# ఆంధ్రపదకోశము



పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

# ఆంధ్రపదకోశము



ప్రకాశకులు

పోతుకుచ్చి అంబరీషశర్మ B. A.

తెనాలి

నిర్మాత

'వ్యాకరణవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ,
సాహిత్యాలంకార, సహస్రావధాని'

పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

తెనాలి

దుర్మతి 1981
ప్రథమ ముద్రణము
వెల : రూ. 30.00



PAPER USED FOR THE PRINTING OF THIS BOOK MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA AT CONCESSIONAL RATE




ప్రాప్తిస్థానము
పాతుదుప్రి సుబ్రహ్మణ్యశాస్త్రి,
శ్రీ శ్రీనివాసభవనశ్రీ H No 22-7-7,
మాచుపల్లివారివీధి,
కొత్తపేట - తెనాలి (A P.)

చంద్రశేఖర ఆర్టు ప్రింటర్స్. గాంధీచౌక్-తెనాలి. Phone 781



నిఘంటు నిర్మాత

పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

# తొలిపలుకు

ఆంధ్రపదకోశ మిది. 'ఆంధ్రభాషార్ణవపదకోశ' మనుట కైన సంక్షిప్తనామమే 'ఆంధ్రపదకోశము'. ఇంతకు ముందు నావెలువరించిన 'అచ్చతెలుఁగుకోశము' పర్యాయపదకోశము. దానినుండి సంగ్రహించి యేర్పఱచిన (శబ్దరత్నాకరాదులవంటి) పదకోశ మిది ఉపాధ్యాయులకు, విద్యార్థులకు, తదితరులకు (వ్యుత్పన్నులకు, అవ్యుత్పన్నులకు అందఱకు) నిత్య ముపకరించుటకై యిది యిట్లు సంగృహీత మైనది.

ఇందు-అచ్చతెలుఁగుపదము, దాని కగునర్థము, దాని కగుసంస్కృత పదము ఈయఁబడినవి. చాలవఱ కర్థముగూడ ఆంధ్రభాషార్ణవ మొసఁగిన పర్యాయపదములతోనే నే నిం దొసఁగఁ బ్రయత్నించితిని. ఇందువలన రెండుప్రయోజనములు చేకూరు నని నేను దలఁచితిని. 1. అచ్చతెలుఁగున కగుపర్యాయపదముల పరిచయము, 2 దానితోపాటు తదర్థావగతి. ఇందులకు నే నెంతగానో ప్రయత్నపడితిని ఐనను గొన్ని చోటులం దచ్చటచ్చట-నావివరణమును, వేఱుగా మఱికొన్ని సంస్కృతాంధ్రపదములను (అర్థ వివరణమునకై) నే నీయక తప్పినది కాదు.

సంస్కృతపదముల నిచ్చునప్పుడు, ఆం. భా. కర్త యిచ్చిన చోట్లనే, అర్థనిర్దేశమునకై ఆతఁ డిచ్చిన సంస్కృతపదములనే చాలవఱకు నే నిచ్చితిని. అవి సులభగ్రాహ్యములు గావని తోఁచినప్పుడే సుప్రసిద్ధములగుపర్యాయపదములను వేఱుగా నే నీయ దొరఁకొంటిని. అర్థనిర్దేశ మొనర్చునప్పుడు కొన్నిచోట్ల సంస్కృతపదముల నొసఁగక ఆం. భా. వదలినవానికి సంస్కృతపదములను వేఱుగా నే నీయఁ బూనుకొన లేదు. పరిశీలించి చూడఁగా వాని నట్లు వదలుటయే యుచిత మనిపించినది. ఇఁక-తృతీయకాండమునందలి నానార్థవర్గమునందు మాత్రము. ఆం. భా కర్త

యిచ్చిన (అర్థనిర్దేశమున కగు) పదములను జాలనలకు వదలి, అందుకు అర్థము తేటతెల్ల మగుటకై . సులభము లగు పదాంతరములను నే నొసంగక తప్పినది కాదు.

ఈ కోశమునందు సంస్కృతపదములకు బహుళముగా (      ) ఈ గుర్తునందు నే నుంచితిని. పదము లేకరూపము లైనప్పుడు, వానిని గుర్తించుటకై వాని కగు సంస్కృతపదమునో తెలుఁగుపదమునో యిం దిచ్చితిని వివరింపబడిన పదము సమీపస్థ మైనప్పుడు, తద్వివరణమును వీలైనంతవఱకు పునరుక్తముఁ గానీక వివరింపఁబడినపదమును మాత్ర మిచ్చి వివరణ మటఁ జూచుకొనుఁ డనుట తెలిపితిని.

ఆం. ధా. ఇచ్చినసంస్కృతపదము అర్థస్ఫూర్తిని శీఘ్రముగా కలిగించునది కా దని తోఁచినప్పుడు, మఱియొక పదమును తదర్థస్ఫోరక ముగా నే నిచ్చియుండుటయు జరిగినది. కొన్నిచోట్ల మఱియొక పర్యాయ పద మేదియు లేక యొకపదమునే ఆం ధా. ఇచ్చినప్పుడు, అర్థమున కిచ్చి నది ఒకప్పుడు సంస్కృతపదమే యైనను బ్రాకెటు - (   ) - లో అది చేరలేదు. దానిని సంస్కృతపదముగా గుర్తించుట పాఠకులకు కష్ట సాధ్యమే యగు ననిపించినను అర్థవివరణమున కైనపదముగూడ అదే యగుటవలన అట్లు చేయక తప్పినది కాదు.

ఇఁక [      ] ఈ గుఱుతులో ఉంచినవిగూడ అచ్చటచ్చట ఇందు గాన్పించును. అవి, వానివానివివరణములు వ్యుత్పత్తులు మున్నగు వాని కైన సంస్కృతాంధ్రపదము లని తెలిసికొనవలయును. నానార్థము లిచ్చుపట్టులలో పదములకు , గుర్తును వివరణమున కగుసందర్భ మున ; గుర్తును ఇందు నే నుంచితిని ఇవి తాఱుమాఱుగాఁ డాము గ్రహింప కుండఁ బాఠకులు తగు జాగరూకత వహింపవలయును. పర్యాయపదములతో వివరణ మొసఁగినప్పుడు వీలగునంతవఱకు ముందు

వచ్చియున్న సమీపస్థపదములనే ఇచ్చుటకు యత్నించితిని. అవి తెలియ రానివి గా (ప్రసిద్ధములు కానివి గా) ఉన్నప్పుడు, దూరస్థము లగువానిని ముందు రా నున్నవానిని సైతము నే నిచ్చుటకు వెనుదీయ లేదు.

క్రియావర్గమున ఆం. భా. అర్థనిర్దేశమునకై ఇచ్చినవి బహుల ములుగాఁ దెలుఁగులే; సంస్కృతపదములు చాల నరుదు. అందులనే ఆవర్గమునందు సంస్కృతపదములు చాలమట్టుకు ఇందును గానరావు. గ్రంథాంతరమునందు నేను వానిని వేఱు గా నిచ్చుచు ఆం. భా. లో అసంపూర్ణము గా ఉన్న క్రియాకాండమును పెంచి పెద్దచేయుతలంపు గలవాఁడ నగుటచే, వానిమాట నిప్పు డీ దు నేను దడవలేదు.

ఇందు కొన్నిచోట్ల, నాయాపదములకడఁ దగువివరణము గానరా కున్నను, సంస్కృతపదము గనరా కున్నను, వివరణమునకై ఇచ్చిన పదముకడఁ జూచిన అవి గానవచ్చును. పీకైసంతవఱకు, 'ఆపదము చూడుము, ఈ పదము చూడుము' అని పాఠకులను శ్రమపెట్టుట యేల? యని, (చూడవలసినపదములు దూరస్థము లైనప్పుడు) పునరుక్తము లగు చున్నను గా దనక అర్థవివరణమును, సంస్కృతపదమును ఇందు మరల మరల నొసఁగితిని. అది తుదముట్ట జరిగినది కాదు గ్రంథము ద్రణాగార మందుల కాటంక మైనది.

మఱియొకమాట : ఈ నిఘంటునిర్మాణము నే నొనర్చునప్పుడు, అన్వాచయము గా నా 'అచ్చతెలుఁగుకోశమును' పునఃపరిశీలన మొనర్ప వలసిన స్థిరపడినది. నా 'అచ్చతెలుఁగు కోశము'నందును, ఆం.భా.కు నే నొసర్చినపదసూచియందును సవరింపవలసిన యంశములు కొన్ని నా కప్పుడు గోచరించినవి. వానిని పీకైవంతవఱ కిందు సరిచేసితిని. ఇందు సరిచేయుటకు వీలుపడనివానిని అచ్చతెలుఁగుకోశమున కగుపునర్ముద్రణమున సవరింపఁ దలపెట్టి పదిలపఱచి యుంచితిని పాఠకసౌలభ్యమునకై

సమాసస్థలములందును దోష మనక పరంపరని తెలుఁగుపదములలో చాలచోటుల నే నిందుఁ బాటించితిని. అర్థాఖిలమైన సంశయ మేమైన నిందు కలిగిన, నా 'అచ్చతెలుఁగుకోశము'న జూచి తీర్చుకొనవలసినదిగా పాఠకలోకమును గోరుచున్నాను. ఇంకొకమాట! 'త్రిక' 'పీపు' మున్నగువానినిఁ పూర్ణానుస్వారార్ధానుస్వారములఁగా మతభేదమునుబట్టి ఉభయవిధములఁ గాఁ ఇందు నే నుపయోగించితిని. దీనిని నేను నా 'అచ్చతెలుఁగుకోశము'న వివరించితిని. 'పూడోడి' 'పూఁడోఁడి' అనునవి రెండును వ్యుత్పత్తి భేదమునుబట్టి సాధువులే! దీనిఁ గూర్చినవన్ని నా 'అచ్చతెలుఁగుకోశము'న నడచివరి అందు చూడఁగోరెద.

ఈ యుభయవిధకోశ నిర్మాణమునకుఁ జాల శ్రమపడవలసి వచ్చినది అది అనుభవైకవేద్యము ఇది. ఇందుండి అందుండి పదము లెత్తి యేర్చి కూర్చి ఒకచో చేర్చు నిఘంటువువంటిది కాదు ఆంధ్ర భాషార్ణవము నిజముగా మహార్ణవము. గ్రంథసమన్వయము, అర్థ వివరణము, పాఠపరిశోధనాదులతోఁ బదస్వరూపనిరూపణము, పూర్వాపరముల సమ్యక్పరిశీలనముతో సప్రమాణముగా అర్థనిర్ణయము మున్నగు వంశములు చాల శ్రమసాధ్యములు. ఇదివఱ కెవ్వరును ఇందులకై (ప్రత్యేకముగా) కృషి యొనర్చినవారు లేరు ఇందులకు నేనే కనిష్ఠికాధిష్ఠితకాళిదాసును గావలసి వచ్చినది. అందులకే నాశ్రమ మనంత మయినది. నాపడినకష్ట మర్థము చేసికొనఁజాలని యసూయాగ్రస్తులు కొందఱయ్యె లిందులకుఁ గా దనవచ్చును. "న హి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్" అనునదియే వారికి నా సమాధానము.

# కృతజ్ఞతా నివేదనము

ఈ కాలము చాల విషమకాలము. గ్రంథప్రకటనం మహాసాహసము. సులువుగానిది. ఇట్టిసమయమున ఈ గ్రంథమును ప్రకటించుటకు "ఆంధ్రోద్ధారకు"నా కీర్తించి యాంధ్రప్రభుత్వము దోహదకారులై మఱి యీ మహాకార్యమునకుఁ దోడ్పడినది. అందులకై వారికి నాకృతజ్ఞతాభివందనములు.

ఇఁక నామిత్రులు, లక్ష్మణశాస్త్రివారలు, మఱి యితరులు దీని ముద్రణావ్యయభారమును నాకు తగ్గించుటకై అర్థికముగాఁ గొంత సహాయ పడిరి. సాహిత్య సేవకు లయినయీద్రవ్యదాతలకు నాకృతజ్ఞతానివేదన ములు. నా కొసఁగినద్రవ్యమునుబట్టి 'మహారాజపోషకులు, రాజ పోషకులు, పోషకులు, సభ్యులు' అనుసరించి నొకవిభాగము చేసియుంచి వారి పేర్లిందు పొందుపఱచితిని. పరమేశ్వరుఁడు వీరందఱకు నాయురారో గ్యైశ్వర్యాభివృద్ధు లనంతములు గా నొసఁగి యిట్టి మహాకార్యమునకై వారు నాబోంట్లకింకను నెక్కుడు గా నుపకరించునవకాశము గల్పించుఁ గాక! మఱియొకమాట! ఇప్పుడు తెలుఁగుకోశమునకై యీముద్రణము భారవంతమైనమహాకార్యమగుటచే అందు మునిఁగి తేలుచు, నేను దీని ముద్రణమునకుఁ జాలజాగొనర్పవలసి వచ్చినది. ఐనను నాయందలి విశ్వాసముచే నన్నుఁ దొందరపెట్టక యీ చందాదారుల సహకార మొసఁగి కాల విలంబము లెక్కఁగొనని వారి త్యాగమునకు నా జోహారులు.

ఇఁక దీనికి, అచ్చున కిచ్చెడుప్రతి వ్రాయుచునపుడు ఒకటికి రెండు మూఁడు తడవలు నేను దీనిని సవరింపఁగా, మరల మరల వ్రాయ వలసి వచ్చినది. నాయందలి భక్తిప్రపత్తులతో అందులకు విసుఁగుకొనక, ఓపికతో అచ్చుప్రతినిఁ జక్కఁగా వ్రాసిపెట్టిన యస్మదంతేవాసి చిరం

శ్రీ పుయ్యూరు లక్ష్మీనరసింహారావు సమధికాయురారోగ్యైశ్వర్యములతో చిరంజీవి యగుగాక!

ఈ గ్రంథప్రకటనమున కైనద్రవ్య సాహాయ్యప్రయత్నములో నాతోపాటు శ్రమపు పంచుకొనినమామిత్త్రులు అళ్ల వెంకయ్యగారికి నా కృతజ్ఞతాభినందనములు.

ఇది యంతయు నిట్లు జరపుచు నా సాహితీయాత్రను నిరంతరాయముగాఁ గొనసాగించు చున్నమాపరాదేవతకు నాపరశ్శతసాష్టాంగాభి వందనములు.

గ్రంథ నిర్మాత

పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

స్వస్తి

## సంకేతములు

ఆం. భా. ఆంధ్రభాషార్ణవము

వ్య. వ్యవహారము

మొ. మొదలగునవి

ఉదా:- ఉదాహరణము

## గ్రంథప్రకటనమునకై సహాయపడిన

# సంస్థలు - దాతలు

### సంస్థలు

| | |
|---|---|
| అధ్యాపకబృందము ఓరియంటల్ కాలేజి | గౌతమీ విద్యాపీఠము<br>రాజమండ్రి |
| P. S U. P స్కూలు | నందివెలుగు |

### దాతలు

### మహారాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ ఆవుల సాంబశివరావుగారు | హైదరబాదు |
| " మామిడిపూడి ఆనందంగారు | " |
| " [illegible]పల్లి కాశీనాథశాస్త్రిగారు | " |
| " గోలి శివరాంగారు | " |
| " సంకా వెంకటేశ్వర్లుగారు | తెనాలి |
| " కిల్లంపల్లి కృష్ణమూర్తిగారు | " |
| " క్రొత్తమాసు సుబ్రహ్మణ్యంగారు | " |
| " టి. లక్ష్మీప్రసన్నముగారు | " |
| " కొల్లసాని వెంకటసుబ్బయ్య చౌదరిగారు | చిలుమూరు |
| " అవుతు మాతిరెడ్డిగారు | పరిమె |
| " లవుత కళందరెడ్డిగారు | " |
| " భీమవరపు నాగిరెడ్డిగారు | " |

| | |
|---|---|
| శ్రీ అవుతు వెంకటరెడ్డిగారు | పరిమి |
| ,, ముక్కామల లక్ష్మయ్యగారు | ,, |
| ,, పిసుపాటి లక్ష్మీనారాయణగారు | బాపట్ల |
| శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు | ,, |
| శ్రీ బి. వి. వి. రాఘవేంద్రరావుగారు | వేటపాలెము |
| ,, వై. బాలకృష్ణారెడ్డిగారు | కొత్తూరు |

## రా జ పో ష కు లు

| | |
|---|---|
| శ్రీ పి. కోదండరామయ్యగారు | హైదరాబాదు |
| ,, ఎ. భారతి | ,, |
| ,, కొత్త రవీంద్రబాబుగారు | తెనాలి |
| ,, కొత్త శివరామకృష్ణప్రసాదు గారు | ,, |
| ,, పి. దక్షిణామూర్తిగారు | ,, |
| ,, గవిని వెంకటేశ్వరరావుగారు | ,, |
| ,, నోరి సత్యనారాయణశర్మగారు | ,, |
| ,, ఎమ్. వెంకటనారాయణగారు | ,, |

## పో ష కు లు

| | |
|---|---|
| శ్రీ మునిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు | హైదరాబాదు |
| ,, జి. వి. సుబ్రహ్మణ్యముగారు | ,, |
| శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు | ,, |

| | |
|---|---|
| శ్రీ డి. దాశరధిగారు | కాకినాడ |
| ,, పేరాల భరతశర్మగారు | ,, |
| ,, ప్రిన్సిపాల్‌గారు సదనంకాలేజి | రాజమండ్రి |
| ,, మల్లంపల్లి శరభయ్యశర్మగారు | ,, |
| ,, చల్లా రామశర్మగారు | ,, |
| ,, హెచ్. వి. ఆర్. నరసింగరావుగారు | ,, |
| ,, నన్నపనేని లింగారావుగారు | తెనాలి |
| ,, చదలవాడ కృష్ణయ్యచౌదరిగారు | ,, |
| ,, గురిజాల సీతారామయ్యగారు | ,, |
| ,, ఆలపాటి మల్లికార్జునరావుగారు | ,, |
| ,, నేతాజీ మెడికల్‌షాపు | ,, |
| ,, ప్రసన్న జ్యూయలరీమార్టు | ,, |
| ,, గెయిటీటాకీస్ | ,, |
| ,, బాలాజీ రైస్ ట్రేడింగ్ కంపెనీ | ,, |
| ,, వి. యల్. యస్. వి. యన్. ఆర్. భట్టాచార్యులుగారు | ,, |
| శ్రీమతి మంచినేని సీతారామమ్మగారు | ,, |
| శ్రీ తమ్మా వీరారెడ్డిగారు | పరిమె |
| ,, మానూరు వెంకటరమణరావుగారు | మూలూర్వారు |
| ,, కాకుశవరపు రాధాకృష్ణమూర్తిగారు | ,, |
| ,, కామయ్యగారు | ,, |

## స భ్యు లు

| | |
|---|---|
| శ్రీ పి. రామశంకరరావు | నాగార్జునయూనివర్సిటీ<br>గుంటూరు |
| శ్రీ అరుణకుమారి | ,, |
| ,, ఎన్. విజయలక్ష్మి | ,, |
| ,, ఎస్. కల్యాణి | ,, |
| ,, కె. జయభారతి | ,, |
| ,, ఎమ్. శేషగిరిరావు | ,, |
| ,, సి. హెచ్. హైమవతి | ,, |
| ,, సూర్యదేవర శ్రీధర్ | తెనాలి |

# ఆంధ్రపదకోశము

## అ

అంకవన్నె = మీఁదికి ఎక్కుటకు ఆధారముగా గుఱ్ఱపు ప్రక్కలందుండు త్రాడు

అంకు = దౌఁకీలు (తాలుమూలము)

అంకుసము = ఏనుఁగుకుంభస్థలము పొడిచెడిఆయుధము (అంకుశము)

అంకెము = ఎద్దు మున్నగువానిపై వేయుఒకప్రిక్క బరువు (గోణ్యర్థము)

అంకెకాఁడు = ముఖ్యుఁడు

అంగడి = దుకాణము (ఆపణము)

అంగద = మనోవ్యథ

అంగదట్టము = పరికిణీ; గాగర (యోషాంతరీయము)

అంగలార్పు = మనోవ్యథ

అంగలార్చెను = దుఃఖపడెను

అంగి = చిన్నచొక్కా (కూర్పాసము)

అంగిలి = లోకుత్తుక; కొండనాలుక ఉండుచోటు

అంగుటము = ఒకవిధమగు బొటనవ్రేలు (అంగుష్ఠవిశేషము)

అంచ = హంస

అంచ = సమీపప్రదేశము (నికటము)

అంచతేజి నెక్కునట్టిరౌతు = బ్రహ్మ

అంచు = వస్త్రము మొదలగువానికొన (అంచలము)

అంచు = వస్త్రమునకు ముందుండునిలువుటంచు

అంచులవాఁడు = చిత్తరువు వ్రాయువాఁడు (చిత్రకారి)

అంచెను = పయనింపఁజేసెను; అంపెను

అంజ = సమీపము (నికటము)

అంజ = అఱకాలు (పాదతలము)

అంజమెడపట్టు = ముప్పదిరెండు పట్టులలోనియొకపట్టు (మల్లబంధవిశేషము)

అంజిక = అధైర్యము (భయము)

అంజెను = భయపడెను

అంట = చెట్టుపట్ట (త్వక్కు)

అంటవివేల్పు = అగ్నిదేవుఁడు

అంటి = అరఁటి (కదళి)

అంటు = చెలికాఁడు (మిత్త్రుఁడు)

అంటుప్పు = వంటయుప్పు (బిడాలవణము)

అంటెను = తాఁకెను (స్పృశించెను)

అంటెలు = ఒకటిమీఁద ఒకటి గా ఏర్పడు ముడుతలు; దొంతరవళులు

అండ = [సంధ్యాదులలోని] ఆశ్రయము; షడ్గుణము లలో ఒకటి

అండ = అంజ

అండె = తొడలమొదలు (ఊరుమూలము)

అండె = బుఱ్ఱటకొమ్ము; ఒకవిధ మగుచిమ్మనగ్రోవి (శృంగవిశేషము)

అంకెము = అంకెము

అంత = ఆపాటిది (తావదర్థకము)

అంతట = అన్నిచోట్ల (సమన్తాదర్థకము)

అంతటికి = అంతకు; ఎల్లదానికి (సర్వమునకు)

అంతరదామర = వేరు లేకుండ నీళ్లలో ఉండెడి ఒకమొక్క (శైవలభేదము)

అంతరపల్లటి = ఒకవిధ మగుపావురము (పారావతవిశేషము)

అంతలపొంతలవాఁడు = దూరసంబంధము కలవాఁడు (పరంపరాసంబంధి)

అంతిపురము = రాజస్త్రీ లుండుగృహము (అంతఃపురము)

అందలము = ఒకవిధ మగువాహనము (ఆందోళిక)

అందిపొందినట్టివాఁడు = అంతలపొంతలవాఁడు

అందు = ఆప్రదేశమున (తత్రార్థకము)

అందుగు = ఏనుఁగులు తిను సల్లకీవృక్షము (హ్రాదిని)

అందుల = అచ్చట; అందు

అందె = స్త్రీలు కాళ్లకు ధరించెడి నగ (నూపురము)

అందెను = తాఁకెను

అంపఱ = బాణపరంపర

అంపు = ఒకవిధ మగుఉత్సవము

అంపెను = పంపెను

అంబలి = ఒకదినుసుజావ (కాబేరము)

అందష్ఠ = తెలివి లేనివాఁడు (అజ్ఞుఁడు)

అంబాళము = ఆమ్రాతకము [నోరు అంబాళపుపండు-చేయి బలుసుపుల్లు-అని లోకోక్తి]

అకరువు = తామరమొద్దు లో నగువాని కేసరము (కింజల్కము)

అక్క = ముందు పుట్టినసహోదరి (అగ్రజ)

అక్కజము = ఆశ్చర్యము

అక్కటికము = కరుణ

అక్కడ = అందు; ఆచోట

అక్కరములు = వర్ణములు (అక్షరములు)

అక్కఱ = ఒకవిధ మగు తెలుగుజాతిపద్యము

అక్కసము = కరుణ

అక్కిలి = చాపకీలు, అంకిలి (తాలుమూలము)

అక్కు = వక్షస్థలము

అగచాటు = కష్టము

అగచాట్లమారి = ఆపద లెప్పుడు అనుభవించువాఁడు (కష్టాత్ముఁడు)

అగడిత = పరిఖ

అగడు = అపవాదము

అగడ్త = అగడిత

అగప = కొంకాయచిప్పగరిటె (మహాతండువు)

అగప = ఓషధులనిపొడి గోకివేయుటకు ఉపయోగపడు కొయ్యగద్దలి (అభ్రి)

అగపడెను = పట్టుకొనఁబడెను; చిక్కెను

అగపాటు = కనఁబడుట (గోచరత్వము)

అగసాలి = కమసాలి (స్వర్ణకారుఁడు)

అగిలెను = బద్దలాయెను

అగిసె = అవిసెచెట్టు (అతసి)

అగురు = అగురుచెట్టుకఱ్ఱనుండి తీయుపరిమళద్రవ్యము (రాజార్హము)

అగ్గమయ్యెను = వశపడెను

అగ్గము = కనఁబడునది

అగ్గలము = ఆధిక్యము

అగ్గలము = అధికము

అగ్గలిక = ఉత్కర్షము

అగ్గి = అగ్నిదేవుఁడు, నిప్పు

అగ్గించెను = పొగడెను

అగ్గింపు = పొగడ్త; మెప్పు

అగ్గెడ = అచ్చట; అందు

అచట = ఆచోట; అందు

అచాటము = గొప్పది; పెద్దది

అచ్చట = అక్కడ; అందు

అచ్చనగల్లు = అచ్చనగాయ (అక్షోపలము)

అచ్చము = ప్రసన్నమైనది (అచ్ఛము)

అచ్చరములు = అక్షరములు

అచ్చరలు = అప్సరసలు

అచ్చికము = అచ్ఛము; తేటైనది (అచ్ఛము; ప్రసన్నము)

అచ్చివచ్చెను = అనుకూలపడెను
అచ్చు = ప్రతిబింబము
అచ్చుకుప్ప = ఆస్తికాఁడు (సంపన్నుఁడు)
అచ్చెరువు = ఆశ్చర్యము
అట = ఆప్రదేశమున; అందు
అటకలి = నలుఁగు-మొ.
అటమట = మోసపుఁబల్కు (అపలాపము)
అటిక = చట్టి (ప్రతలాల్పభాండము)
అటుకులు = నానఁబోసి వేయించి కొట్టినవడ్లు (పృథుకములు)
అటులన్ = అట్లు; ఆవిధము (తథార్థకము)
అట్టడి = కోటవాఁకిటిమీఁదియిల్లు (అట్టము)
అట్టిఁడు = అటువంటివాఁడు (తాదృశుఁడు)
అట్టిక = మచ్చు; డాబా (అల్పహర్మ్యము)
అట్టు = భక్ష్యవిశేషము
అట్టెడ = పదాఱువరావికలధాన్యము పట్టెడిగోనె (ఆఢకమితగోణి)
అట్టము = ఎనిమిదిపన్నములు గలవేదభాగము (అష్టకము)
అట్లు = ఆప్రకారము; అటులన్
అడఁచెను = చంపెను (వధించెను)
అడపము = వక్కలు ఆకులు ఉంచుబరణి మొదలైనది (తాంబూలకరండము)

అడబాల = వంటలవాఁడు; భోజనోపకరణములను [కూర, పులుసు–మొదలగువానిని] వండువాఁడు (సూపకారుఁడు)

అడరెను = ఒప్పెను

అడలించెను = భయపడునట్లు పెద్దగా అఱచెను

అడవి = అరణ్యము; అటవి

అడవికాఁకర = అఁగాఁకర; పనసపిందెల్లు ఉండి కూరకు ఉపయోగపడు కాఁకర

అడవినెలవరి = ముని; వానప్రస్థుఁడు

అడవిబీఱ = చేఁదు గలబీఱ (ధామార్గవము)

అడవిమల్లె = అడవియందుఁ బుట్టుమల్లె (ఆస్ఫోట; వనోద్భవ)

అడవిమొల్ల = యూథిక

అడిగెను = యాచించెను; వేఁడెను [ద్వికర్మకము]

అడిగొట్టు = చెడ్డవాఁడు (కుజనుఁడు)

అడిదము = ఖడ్గము

అడియాలము = ఆనవాలు; గుఱుతు (చిహ్నము)

అడియాస = వట్టియాశ (వ్యర్థాశ)

అడుకులు = అటుకులు (పృథుకములు)

అడుగు = అడుగాలు (పాదతలము)

అడుగు = క్రింది ప్రదేశము, పాదము

అడుగుట = ప్రశ్నము

అడుగుట = యాంచ

అడుప = పశువుల పాదరోగవిశేషము

అడుసు = బురద (పంకము)

అడ్డకత్తి = పట్టాకత్తి; రెండువైపులఁ బదునైనయంచు గల పెద్దకత్తి (పట్టసము)

అడ్డగించెను = అడ్డుపెట్టెను

అడ్డగించెను = అడ్డెను (నిరోధించెను) [ద్వికర్మకము]

అడ్డపాటు = మఱుఁగు; చాటు (వ్యవధానము)

అడ్డము = అడ్డపాటు

అడ్డము = ప్రతికూలము

అడ్డము లేనివాఁడు = స్వతంత్రుఁడు

అడ్డసరము = అటరూష [ఒక యోషధి]

అడ్డసారె = జూదమాడెడుసారె; సోగటాలపాచిక(శారి)

అడ్డి = అడ్డపాటు

అడ్డుగ = రూకలో సగభాగము (అర్ధపణము)

అణంగెను = అడఁగెను (క్షీణించెను)

అణుకువాఁడు = అన్యజాతీయుఁడు [పెఱజాతివాఁడగుమల్లుఁడు]

అణుజు = పక్షివిశేషము; ఈఁక రాల్చినపక్షి

అతివ = స్త్రీ

అతివస =, ఒకానొకమూలిక (అతివిష)

అతుకు = మాసిక

అత్త = భార్యతల్లి, పెనిమిటితల్లి (శ్వశ్రువు)

అద్దము = ఆదర్శము; దర్పణము

అద్దరి = అవతల; ఆవలిదరి (పారము)

అద్దిర = ప్రశంసాదులతో కూడిన ఆశ్చర్యము

అనంటి = అరఁటి (కదళి)

అనఁటి = అనంటి

అనప = అనాథ; భర్త లేనిది (విధవ)

అనద = దిక్కుమాలినవాఁడు; గతి లేనివాఁడు (అనాథుఁడు)

అనుగిలము = తోడు; తోడు ఉండునది (సహాయము)

అనుఁగు = తోడు; తోడు ఉండువాఁడు (సహాయుఁడు)

అనుపు = గాటనాములు ఇచ్చుదారిపన్ను; కాలరి (అభిగస్త్రభాగధేయము)

అనుము = చిక్కుడువంటి గింజలు గలఒకజాతి పైరు (నిష్పావము)

అనుసు = పొన్ను; పొదుపు

అనెను = చెప్పెను (వచించెను)

అన్న = అగ్రజుఁడు

అనుషి = స్త్రీ

అన్నువ = తక్కువది [పరిమాణముచే] (స్వల్పము)

అపరంజి = పదారువన్నె బంగారు (అతిశుద్ధకాంచనము)

అప్ప = అక్క (అగ్రజ)

అవ్వ = తల్లి, తోఁబుట్టువు

అప్పచ్చి = అప్పము (అపూపము)

అప్పడము = అపూపవిశేషము

అప్పన = పిన్ను; కప్పము (భాగధేయము; కరము)

అప్పనము = అప్పన

అప్పము = అప్పచ్చి

అప్పసము = ఎల్లప్పుడు (సతతము)

అప్పటము = వెంటనే (శీఘ్రముగా)

అప్పు = ఋణము

అప్పుడు = ఆవేళ; ఆసమయమందు (తదార్థకము)

అప్పులవాఁడు = ఋణదాత; ఉత్తమర్ణుఁడు

అబక = కొయ్యగుద్దలి (అభ్రి)

అబక = టెంకాయచిప్పగరిటె (మహాతంగువు)

అబ్బ = తండ్రి (జనకుఁడు)

అబ్బురపాటు = ఆశ్చర్యము

అబ్బెను = చిక్కెను; పట్టువడెను (గృహీత మయ్యెను)

అబ్రము = ఆశ్చర్యము

అభిని = నల్లమందు (అహిఫేనము)

అమర = జంట (ద్వంద్వము)

అమవస = అమావాస్య

అమరెను = ఒప్పెను

అమాస = అమవస

అమ్మ = తల్లి (అంబ)

అమ్మకము = అమ్ముట (విక్రయము)

అరుసము = హర్షము, ఆనందము

అర్మిలి = వాత్సల్యము [పుత్రాదులయందలి స్నేహము]

అఱ = లోపల నుండు ప్రదేశము (అంతరాళము)

అఱ = లోపలిగది (వాసగృహము)

అఱకట = పిఱుదుల ప్రక్క ప్రదేశము (కటింబపార్శ్వము)

అఱకసు = అజీర్ణరోగము (అజీర్తి)

అఱకాలు = పాదముక్రింది భాగము (పాదతలము)

అఱచెను = ఏడ్చెను

అఱచెను = వాగెను, కూసెను

అఱచెయ్యి = చేతిలోపలిభాగము (కరతలము)

అఱజాతి = నీచజాతివాఁడు

అఱపు = పసువుల కంఠధ్వని

అఱవ = ద్రవిడదేశస్థుఁడు

అఱవము = ద్రవిడ [దేశ] భాష

అఱిమురి = తబ్బిబ్బు తొటుపాటు

అఱిమెను = ఎదిరించెను ఎదుర్కొనెను

అఱిసె = తీపిపిండివంట (అతిరసము)

అఱుకప = అఱకము

అఱుట = వదలుట (విసర్జనము)

అఱుముట = [శత్రువునకు] ఎదురుగా పోవుట (అభియానము)

అఱువది = ఆఱుపదుల సంఖ్య (షష్టి)

అడచు = రెండు ముక్కలాయెను (వంగెను)

అఱ్ఱు = కంఠము పైభాగము (మెడ)

అట్టము = అఱుకువ

అఱంపము = కోటచుట్టు వేయనమట్టిదిబ్బ (వప్రము)

అలఁతినవ్వు = చిరునగవు (స్మితము)

అల = తరంగము

అలఁకము = రొద (కోకిలధ్వని)

అలరు = పుష్పము (సుమము)

అలరువిల్కాఁడు = మన్మథుఁడు

అలరెను = ఒప్పెను, ప్రకాశించెను

అలవరి = అలంగము

అలసంద = పెద్దబొబ్బర్లపైరు (రాజమాషము)

అలవ = అల్లుసుతీఁగె, ఒకజాతితీఁగె

అలికిడి = చప్పుడు (ధ్వని)

అలుగు = నీళ్లు పోవుటకై దారి (పరీవాహము)

అలుఁగు = కండి, ఆయుధము

అలుక = కోపము

అలుకు = అలుకుటకు ఉపయోగించుపేఁడ మొదలగునది (ఉపలేపకద్రవ్యము)

అలుపుట = ధ్వస

అలుసు = తిరస్కారము

అల్లట = కష్టము

అవ్వ = కన్నమ్మ (జనయిత్రి)

అవ్వ = నాయనమ్మతల్లి (ప్రపితామహి)

అవ్వల = అవతల

అసదు = అన్నువ (అల్పము)

అసలు = అవుఝు

అసిమి = ఒకవిధ మగుచిన్నగోనె

అసియాడెను = వడఁకెను, కదలాడెను

అస్తరు = మూసిక, అతుకు (సంధానవసనఖండము)

## ఆ

ఆఁకలి = అన్నము తినవలయు ననెడి కోరిక (బుభుక్ష)

ఆఁకొంట = ఆఁకలి

ఆఁకొన్నవాఁడు = ఆఁకలి గలవాఁడు (క్షుధితుఁడు)

ఆఁగాకర = అడవికాఁకర, ఒకానొక కాఁకర(కర్కోటకి)

ఆఁగెను = అడ్డుపెట్టెను (వారణముచేసెను)

ఆఁడంగి = స్త్రీవలె మాటలాడుపురుషుఁడు (స్త్రీభాషి)

ఆఁడుది = స్త్రీ

ఆఁబోతు = ఆఁబోతెద్దు (గోపతి)

ఆకసము = ఆకాశము

ఆకు = [చెట్టు మొదలగువాని]పత్త్రము (పర్ణము)

ఆకుచుట్ట = తమలపాకుచుట్ట, మడుపు (పర్ణసంపుటకము)
ఆకుటిల్లు = పర్ణశాల
ఆకుమడుపు = గుండ్రముగా చుట్టినతమలపాకు (వృత్తపర్ణము)
ఆకుదాయి = ఇనుము మొదలగువానిని తెగఁగొట్టు ఒక పనిముట్టు (పత్త్రిపరశువు)
ఆకె = ఆమె, ఆ స్త్రీ
ఆగడపలు = మెట్లవలె ఎత్తుగా నున్నమబ్బుతునకలవరుస, మొగిలుదొంతి
ఆగడము = నేరము (అపరాధము)
ఆగడీఁడు = ఎక్కిరించువాఁడు (పరిహాసకుఁడు)
ఆట = నాట్యము
ఆట = పరిహాసము
ఆటకత్తె = నాట్యము చేయుస్త్రీ (నటి)
ఆటరి = ఆటకత్తె
ఆడ = ఆప్రదేశమునందు, అందు
ఆడిక = అపవాదము
ఆడికోలు = సిస్తు, అప్పన (భాగధేయము)
ఆడె = కడితమునందలి యొకభాగము (ఘట్టితపట్టైకదేశము)
ఆడెను = కదలెను
ఆడెను = పలికెను
ఆడెబలు = ఆగడపలు
ఆడెలు = ఆడెబలు [మొగిలుదొంతి]

ఆడెలు = గాలు (పక్షివిశేషము, శరారి)

ఆణము = మాంససారము

ఆణి = ఇరుసుచివరిసీల (సంధానితకీల)

ఆణి = ఒకజాతిముత్యము

ఆణి = మేలైనది మేటి (శ్రేష్ఠము)

ఆణె = ఒకవిధ మగుకుష్ఠరోగము

ఆణెము = ఒకదేశము

ఆతల = అవతల, అవలియొడ్డు

ఆద = ఎద (హృదయము)

ఆది = నగలు మొదలగువాని కిచ్చెడికొలతను తెలుపువస్తువు (చిహ్నము)

ఆన = ఉత్తరువు (ఆజ్ఞ)

ఆనతి = ఆన (ఆజ్ఞప్తి)

ఆనవాలు = ఆది

ఆనవాలు = ఇగురఁగాఁచినపాలు (కర్దమీకృతదుగ్ధము)

ఆనుగము = సొఱ (అలాబువు)

ఆనె = ఆసె

ఆనెను = త్రాగెను (ఆస్వాదించెను)

ఆపెను = నిలిపెను, అడ్డుపెట్టెను (నివారించెను)

ఆపె = ఆస్త్రీ, ఆమె

ఆపోవుట = సంతృప్తి

ఆబ = కంటిగ్రుడ్డు (తారకము)

అవిస = అవిసె

అమాతి = పెనుతిండి, పెద్దతిండి (అభుక్తి)

ఆమడ = నాలుగుకోసులదూరము (యోజనము)

ఆమని = వసంతఋతువు

ఆము = మదము

ఆముదము = ఏరండవృక్షము

ఆముదము = ఏరండతైలము

ఆడతి = జ్యేష్ఠమాసము మొదలుగా
నాలుగుమాసములు

ఆయము = ఆయువుపట్టు (మర్మము)

ఆయవారము = ఉపాదానము. భిక్ష; యాయావరము

ఆయితము = అంతయు సిద్ధపఱచినది (ఆయత్తము)

ఆయెను = కలిసెను; ఒనగూడెను (సిద్ధించెను)

ఆరగించెను = తినియెను (భోజనముచేసెను, భుజించెను)

ఆరగింత = భోజనము (భుక్తి)

ఆరగింపు = ఆరగింత

ఆరతి = హారతి (నీరాజనము)

ఆరసెను = వెదకెను

ఆరాట = అగ్నివలని వేడిమి (తాపము)

ఆరాటము = ఆరాట

ఆరు = హిమాలయమునందుండెడిఓషధి (ఆరుక)

ఆవు = ఐదువాకిటి, నూఱారు (మొదటియుగ్మమున
ధేను)

అరుగ = అల్లు (కోద్రవము)

అరుదూఱు = అగడు (అపవాదము, నింద)

అరుదొంత = ఆరొంత (ఆర్ద్రకము)

అరె = కోడికాలివ్రేళ్ల వెంటగోరు

అరె = మహారాష్ట్రుఁడు మహారాష్ట్రదేశస్థుఁడు

అరెకుఁడు = తలారి (ఆరెకుఁడు)

అరెగోల = అర్ధచంద్రాకారపు అలుగు గల వాదరుకత్తి (తోత్రము)

అరెను = ఒప్పెను

అరెపుష్వ = ఏఁకుజాతి (ధాతకీపుష్పము)

అరెలు = ఆరెపుప్పి

అర్ఘము = ఆఁబహూపములు (షష్ఠాంశి)

అర్వు = సింహాసనము

అఱడి = అపవాదము

అఱుపలము = ఆఱుపలములు (షట్పలి)

అఱున = ఆఱుకుంచములు (ద్రోణషట్కము)

అలకించెను = వినియెను

అలతి = రాగాలాపము

అలము = యుద్ధము

అలవట్టము = ఎండమఱుఁగునకై యిడెడువీవన, సూరెపాను (ఆలావర్తః ...

అలించెను = వినెను

భళ్లు = భార...



ఆలు = ఆవులు, భార్య

ఆలుడి = శీలము

ఆవ = ఆవపైరు (ఆసురి)

ఆవజము = ఒకవాద్యము (ఆరజము)

ఆవటిల్లెను = కలిగెను ఏర్పడెను (సంభవించెను)

ఆవడ = చేదు గలబీర (ధామార్గవము)

ఆవడి = ఉపద్రవము

ఆవల = ఆతల, ఆవలినొడ్డు అద్దరి

ఆవలింత = జృంభణము, ముఖభేదనము

ఆవలిమొన్న = ప్రకృతదినమునకు ముందటిమూడవదినము

ఆవలియెల్లుండి = ఎల్లుండికి ఆవలిదినము

ఆవి = చీడ (సస్యరోగము)

ఆవిరి = ఉక్క (ఊష్మము)

ఆవు = గోవు, పాడియావు

ఆవులింత = ఆవలింత

ఆస = దిక్కు (ఆశ)

ఆస = ఆశ, కోరిక

ఆసాది = మాదిగవాడు (మాతంగుడు)

ఆస్తి = సొత్తు అంతధనము (సర్వస్వము)

ఆస్తిపాట్లుడు = ధనవంతుడు

ఆసు = నేతపనివాండ్లు పడుగు కోయుటకు ఉపయోగించెడిచట్రము

# ఇ

ఇంగలము = నిప్పు (అంగారము)

ఇంగిలీకము = ఒకవిధ మగుకోఁతి (మర్కటవిశేషము)

ఇంగిలీకము = ఖనిజ మగురాగద్రవ్యవిశేషము (హింగుళి)

ఇంగువ = హింగువచెట్టుయొక్క జిగురు (హింగువు)

ఇంచు = చెఱకు (ఇక్షువు)

ఇంచుక = కొంచెము (ఈషదర్థకము)

ఇంచుకంత = ఇంచుక

ఇంచువింటివాఁడు = మన్మథుఁడు

ఇంత = ఈపాటిది (ఏతావదర్థకము)

ఇంతి = స్త్రీ

ఇందు = ఈప్రదేశమునందు (అత్రార్థకము)

ఇండుగ = చిల్లచెట్టు (కతకము)

ఇందుప్పు = సైంధవలవణము

ఇక్క = స్థానము, నివాసము

ఇక్కడ = ఈప్రదేశమునందు, ఇందు

ఇక్కువ = ఇక్క

ఇగము = చల్లఁదనము, చల్లనిది (శీతము)

ఇగిరిక = ఇగురఁబెట్టినయన్నము (హావిష్యము)

ఇగిరికె = ఇగిరిక

ఇగురు = చిగురుటాకు (కిసలయము)

ఇచట = ఇక్కడ

ఇచ్చ = కోరిక (ఇచ్ఛ)

ఇచ్చకము = మనుష్యప్రీతికై ఇష్టముగా పలుకుమాట (ఇష్టోక్తి, ప్రియవచనము)

ఇచ్చకాలమారి = ఇచ్చగొండి (ప్రియవాది)

ఇచ్చట = ఇక్కడ

ఇచ్చ వుండువాఁడు = అడ్డు లేనివాఁడు (స్వతంత్రుఁడు)

ఇటిక = ఇటుక రాయి (ఇష్టకము)

ఇటుక = ఇటిక

ఇటులు = ఈవిధముగ (ఏవమర్థకము)

ఇట్టిక = ఇటిక

ఇట్టుక = ఇటిక

ఇట్లు = ఇటులు

ఇడుపు = వాఁకిటి చేరువ గోడ (ద్వారప్రాంతకుడ్యము)

ఇడుమ = కష్టము, దుర్దశ

ఇత్తడి = ఇత్తళి (లోహవిశేషము, ఆరకూటము)

ఇత్తిగ = ఆకు (పత్త్రము)

ఇద్దరి = ఇవతల (అవారము)

ఇద్దుము = రెండుతూములు (ద్వ్యాఢకి)

ఇసుకు = ఊఁకతో కలసి నూఁకగా నుండు ధాన్యము (తుషయుక్తస్వల్పధాన్యము)

ఇనుమద్దియ = మద్ది (సాలము)

ఇనుము = ఒకలోహము (అయస్సు)

ఇప్ప = మధూకము
ఇప్పుడు = ఈవేళ (సంప్రత్యర్థకము)
ఇమ్ము = స్థానము
ఇయ్యకొనెను = ఒప్పుకొనెను (అంగీకరించెను,సమ్మతించెను)
ఇయ్యకోలు = సమ్మతి
ఇయ్యెడ = ఇచ్చట, ఇందు
ఇయ్యేఁడు = జరుగుచున్నసంవత్సరము (ఐషమము)
ఇరవు = ఇక్క (స్థానము నివాసము)
ఇరుగడలు = రెండుప్రక్కలు (ఉభయపార్శ్వములు)
ఇరుగు = దగ్గఱలో (నికషార్థము, సమీపమునందు)
ఇరుగుడు = ఒకచెట్టు (శింశప)
ఇరుపక్కలు = ఇరుగడలు, కుడియెడమపార్శ్వములు
ఇరుపర్వునేల = రెండుక్రోసులభూమి (క్రోశద్వయము)
ఇరుమెయులు = ఇరుపక్కలు
ఇరులు = చీకటి (అంధకారము)
ఇరువాఁగు = ఉభయసేనలు
ఇరుస = ఎనిమిదిమానికలు, రెండుకుంచములు (ప్రస్థయుగ్మము)
ఇరుసు = చక్రము తగిలించు-ఇనుపకమ్మి (అక్షము)
ఇర్వది = రెండుపదులసంఖ్య (వింశతి)
ఇఱుకటము = ఇఱుకైనచోటు (సంకటము)
ఇఱ్ఱి = మృగము [ఒకజాతిహరిణము]

ఇలుదొర = గృహస్థుఁడు

ఇలువరము = తీసికొని పోఁదగినకుటీరము (ఆనేయము)

ఇలువారము = ఇలువరము

ఇలునింపడము = వధూవరులనూతనగృహప్రవేశము

ఇల్లంఁటము = అల్లుఁడు తనభార్యతో అత్తవారింటనే చేయుకాఁపురము (శ్వశురగేహాధివాసము)

ఇల్లము = రెండుపలములు (ద్విపలి)

ఇల్లటము = ఇల్లంఁటము

ఇల్లరి = ఇంటిపన్ను (గృహభాగధేయము)

ఇల్లాలు = గృహిణి

ఇల్లి = ఒక్కప్రొద్దు (ఉపవాసము)

ఇల్లు = గృహము

ఇవక = ఇగము (శీతము)

ఇవతల = ఇవ్వలియొడ్డు (అవారము)

ఇవతాళింపు = ఇవక

ఇవము = ఇవక

ఇవల = ఇవతల

ఇవ్వల = ఇవతల

ఇసుక = వాలుక, సికత

ఇసుకమ్రాను = ఉలిమిరి (వరుణము)

ఇసుమంత = ఇంచుక, కొంచెము

ఇసుమంత = ఇసుకయంతటిపరిమాణము

ఇసుము = ఇసుక

# ఈ

ఈఁక = పక్షి ఱెక్క (పక్షము)

ఈఁగ = మక్షిక

ఈఁగంత = ఈఁగయంతటిపరిమాణము

ఈఁగపులి = ఒకజాతిసాలెపురుగు (లూతావిశేషము)

ఈఁచ = జొన్నలో నగువానికాఁడ ఊఁచ (కణిశవృంతము)

ఈఁటె = కుంతము, ఆయుధవిశేషము

ఈఁత = ఈఁతచెట్టు (ఖర్జూరిక)

ఈఁత = పశ్వాదుల ప్రసవము

ఈఁత = పశ్వాదులప్రసవము, ఖర్జూరపుచెట్టు, ఈఁదుట

ఈఁద = చల్లగాలి (శీతవాయువు)

ఈఁదర = ఈఁద

ఈఁదాడు = ఒకతాటిచెట్టు (హింతాళము)

ఈఁదు = ఈఁత (ఖర్జూరిక)

ఈకోలు = సమ్మతి

ఈగి = దానము

ఈగి [నాల్గుపాయములలోని] దానము

ఈచుకొనినది = [నెలలు నిండకమునుపు] చెడినగర్భము కలయావు (అపకోశ)

ఈద = ఎఱ్ఱకిచ్చిలి ఒకజాతినారింజ (ఐరావతము)

ఈఁద = ఇచ్చట

ఈఁదిక = ముళ్లకంప మొదలగువాని మోపు (కంటకాదిభారము)

ఈఁదిక = గడ్డి మొదలగువానిని తెచ్చెడుబండి (తృణాద్యానయనసాధనవిశేషము)

ఈఁడిగ = ఈండ్రవాఁడు

ఈఁడు = యౌవనము

ఈఁడు = ఆకట్టు (ఆధి)

ఈఁడు = సదృశము

ఈఁడు మీఱెను = వయసు వచ్చెను

ఈఁదేఁగు = యుద్ధాదులనుండి వెనుకకు పోవుట (అపక్రమము)

ఈఁదేఱెను = ఈడు మీఱెను

ఈఁతల = ఇవతల

ఈఁన = [తమలపాకు మొదలగువాని] ఈనె (పత్త్రిగాడి)

ఈఁపిక = పశుపక్ష్యాదులకానుపు

ఈఁపి = అంటుపేను పెట్టుగ్రుడ్డు (లిక్షాండము)

ఈఁము = ఇగము (శీతము)

ఈఁరము = పెద్దతుప్ప (గుల్మము)

ఈరస = ఈర్ష్య, అసహనము

ఈరసము = ఈరస

ఈరిక = మొలక (అంకురము)

ఈరు = అంటుపేను (లిక్షు)

ఈరెండ = లేతయెండ, కొంచెపాటియెండ (కించిదాతపము)

ఈరెలుఁగు = చాలసూక్ష్మమైనకంఠధ్వని (సూక్ష్మతరకంఠనినాదము)

ఈర్పెన = పేలను ఈర్చెడిదువ్వెన (లిక్షావికర్షి)

ఈఱతాఱలు = తొఱుమాఱులు, ఋజువైనవి కానివి (వక్రములు)

ఈల = కొంగలసంకేతధ్వని (తస్కరసంకేతనినదము)

ఈవల = ఇవతల

ఈవి = దానము

ఈవికాఁడు = దాత

ఈవులమ్రాను = కల్పవృక్షము

ఈసడము = అపవాదము నింద

ఈసడింపు = ఈసడము

ఈసు = ఈరస (ఈర్ష్య)

ఈల్గు = ఒడలు విఱుచుట (గాత్రవినామము)

ఈల్గుట = అడఁగుట చావు (మరణము)

# ఉ

ఉంకువ = కన్యాశుల్కము, [కన్యార్థము కన్యకుఁగాని మామకుఁగాని యిచ్చుద్రవ్యము]

ఉంగరము = చేవ్రేలికి పెట్టుడినగ (అంగుళీయకము)

ఉంకెడి = పశువ్యాధిభేదము

ఉండ = గుండ్రనివస్తువు (గోళకము)

ఉండువాఁడు = సుఖముగా ఉండెడిస్వభావము కలవాఁడు (వర్తిష్ణువు)

ఉంద్ర = వెలిచంద్ర (కదరము)

ఉంద్రస = ఉంద్ర

ఉక్క = ఆవిరి

ఉక్కళము = పట్టణముకు పోవురాజమార్గము (ఉపనిష్కరము)

ఉక్కిస = ఉబ్బసము, దగ్గు (కాసము)

ఉక్కు = పరాక్రమము శౌర్యము

ఉక్కు = కాఁచి శుభ్రము చేసినయినుము (అయస్సారము)

ఉక్కెఱ = ఒకవిధ మగు భక్ష్యము (ఉత్కారిక)

ఉగడి = గడువు (మర్యాద, అవధి)

ఉగ్గళింపు = నాట్యశబ్దములను పలుకుట (నాట్యశబ్దోక్తి)

ఉగ్గులి = ప్లీ

ఉచ్చి = మాడుపట్టు (బ్రహ్మారంధ్రము)

ఉచ్చింత = ఉస్తె (శుండిక)

ఉచ్చు = ఒకవిధ మగువల (పక్షిబంధనము)

ఉజ్జగించెను = వదలెను (విసర్జించెను)

ఉజ్జింపు = వదలిపెట్టుట (విసరనము)

ఉజ్జనము = ఉజ్జగింపు

ఉడిగము = దాసుఁడు, దాస్యము

ఉడుకు = సెగ (తాపము)

ఉడుగర = [బహుమానయోగ్య మైన] సన్నపువస్త్రము (విశిష్టవస్త్రము)

ఉడుత = ఒకజాతియెలుక (తనుమూషిక)

ఉడుతపాలలు = పలురంగులు కలవస్త్రవిశేషము (చిత్రవస్త్రవిశేషము)

ఉడుము = బల్లియాకారము గలిగి దానికంటె పెద్దది గా ఉండెడియొకజాతిజంతువు (గోధిక)

ఉద్ద = నాలుగు (చతుష్కము)

ఉత్తండము = [ఒకవిధ మగు] అంకువారికంఠహారము

ఉత్తరవాక్కారము = ముప్పదిరెండుమల్లబంధములలో ఒకటి (మల్లబంధవిశేషము)

ఉత్తరించెను = ఉత్తరీయాదులను చించెను (ఛేదించెను)

ఉత్తరి = ఉత్తంసము

ఉత్తరేను = అపామార్గము [ ఉత్తరేణి' వ్య ]

ఉత్తలము = అళుకు (అధృతి, అధైర్యము)

ఉత్తలమ్ము = కొట్రుపాటు (సంభ్రమము)

ఉదిరి = అపరంజి

ఉదిల = ఉత్తలము

ఉదుక = తలుపునకుసి తిరుగుటకై తలుపుక్రింద అమర్చెడికొయ్యచిప్ప, బోలుమ్రాను (కవాటమూలాధివాలము)

ఉద్దము = ఒకవిధమగుపాదరక్ష

ఉద్దర = తాకట్టు (ఆధి)

ఉద్దవిడి = శీఘ్రము

ఉద్ది = పోలిక (సాదృశ్యము)

ఉనికి = ఆసనము [సంధ్యాదిషడ్గుణములలో ఒకటి]

ఉపవడము = నిదురనుండి మేల్కొనుట (అవబోధము)

ఉపారము = [రాజాదులదర్శనార్థము వచ్చి ఇచ్చు] కానుక (ఉపాయనము)

ఉప్పత = పెద్దధ్వని (ఆఘోషణము)

ఉప్పతిలెపు = [జలాదులు] ఉప్పొంగెను

ఉప్పన = లవణము [షడ్రసములలో ఒకటి]

ఉప్పరము = ఆకాశము

ఉప్పరి = ఉప్పరవాడు (కుడ్యాదికారి)

ఉప్పరిగ = పెద్దభవనము (సౌధము)

ఉప్పలము = ఉప్పు పండుపొలము (లవణాకరము)

ఉప్పి = ఒకచెట్టు (లవణి)

ఉప్పఁడి = ఉప్పు లేనిది (అలవణము)

ఉప్పిళ్లు = ఉప్పుడుబియ్యము (పక్వవ్రీహిభవతండులములు)

ఉప్పు = లవణము [షడ్రసములలో ఒకటి]

ఉప్పు = చవుటినేల (ఊషరభూమి)

ఉప్పు = కూరలోనగువానిలో ఉపయోగించునది (లవణము)

ఉప్పుఁగండ = ఎండినమాంసము (శుష్కపలలము)

ఉప్పుఁజేఁప = ఎండినచేఁప (మత్స్యము)

ఉప్పొంగెను = [జలాదులు] పైకి లేచెను

ఉబుకువాఁడు = వృద్ధికి రాఁగలవాఁడు (వర్ధిష్ణువు)

ఉబ్బ = ఆవిరి

ఉబ్బలి = బురద (పంకము)

ఉబ్బసము = ఉచ్ఛ్వాస (కాసము)

ఉబ్బెను = ఉప్పొంగెను

ఉముక = ఊఁక (తుషము)

ఉమ్మ = ఉబ్బ (ఊష్మము)

ఉమ్మటము = ఉమ్మ

ఉమ్మలి = ఉబ్బలి

ఉమ్మలింపు = ఉబ్బ

ఉమ్మలిక = ఉబ్బ

ఉమ్మలికము = ఉబ్బ

ఉమ్మాదము = పిచ్చి (ఉన్మాదము)

ఉమ్మత్త = ఉన్మత్తము, దుత్తూరము
ఉయ్యలచేరుపిట్ట = బెగ్గురుపక్షి (సారసము)
ఉయ్యలపులుఁగు = ఉయ్యలచేరుపిట్ట
ఉయ్యాల = తొట్టి (డోల)
ఉయ్యెల = ఉయ్యాల
ఉరవడి = శీఘ్రము
ఉరవు = వక్షస్థలము, ఉరము
ఉరి = ఉచ్చు (పక్షిబంధము)
ఉరుటము = తీక్ష్ణ మైనది
ఉరుమ = తప్పెట (చర్మవాద్యవిశేషము)
ఉఱికెను = పరువెత్తెను
ఉఱుత = ఉడుత
ఉఱుము = మేఘగర్జితము
ఉలవ = ఒకదినుసుసస్యము (కుళుత్థము)
ఉలి = కఱ్ఱ తెగఁగొట్టుటకు ఉపయోగించెడియొకా నొకపనిముట్టు (దారుచ్ఛేది)
ఉలిపికట్టె = చెడ్డవాఁడు (ఖలుఁడు)
ఉలిమిరి = ఇసుకద్రిమాను (వరుణము)
ఉలివు = ధ్వని
ఉలుకు = ఒకవిధ మగుగుఱ్ఱపుమెల్లనినడక (నీచగతి)
ఉలుప = మిక్కిలిచాంచల్యము గలయొకజాతిచేఁప (మత్స్యవిశేషము)

ఉఱుప = ఒకవిధ మగువులుసుపచ్చడి
(విరణామ్లకలితపిష్టము)

ఉలుప = ఉపారము (ఉపాయనము)

ఉలుపా = ఉలుప (ఉపాయనము)

ఉలుపి = వాఁపురోగము కలవాఁడు (శోఫి)

ఉలుము = ఋష్టము

ఉల్వాఁడు = ఉలుపి

ఉల్లంకి = పక్షి విశేషము

ఉల్లడలు = చాందిని (వితానము)

ఉల్లడములు = ఉల్లడలు

ఉల్లము = హృదయము మనస్సు

ఉల్లఱపుబిరుద = భయంకర మైనబిరుదములు కలవాఁడు
(ఘనబిరుదాఢ్యుఁడు)

ఉల్లసము = ఎత్తిపొడుపుమాట (సోల్లుంఠనము)

ఉవిద = స్త్రీ

ఉసిరిక = ఉసిరి (అమృత, ఆమలకి)

ఉసురు = ప్రాణము జీవుఁడు ఆయుస్సు

# ఊ

ఊక = ధాన్యముపైపొట్టు (తుషము)

ఊగెను = వణకెను (చలించెను)

ఊత = ఒకవిధ మగువల (జాతి విశేషము)

ఊద = ఈర్ష్య

ఊపురము = ఎద్దుయొక్క మూపురము (కకుదము)

ఊట = ఊరిన ద్రవము (ద్రవోష్మ)

ఊఊ = కొండయాట (ఉత్సవము)

ఊటి = ఊరెడినీరు బలము

ఊటించెను = ముఖస్తుతిచేసెను [ఎక్కించెను]

ఊడ = చెట్లకొమ్మలనుండి క్రిందికి దిగెడి వేరు (శిఫ)

ఊడిగము = ఉడిగము

ఊడుగు = అంకోలము

ఊడుపు = ఒకదినపుపాదంతి

ఊపిరి = శ్వాసము

ఊబ = పాతఱ (ఖాతవిశేషము)

ఊరక = మాటలాడకయుండుట (మౌనము)

ఊరుగాయ = ఉప్పులోను కారములోను ఊరెడుకాయ (ఉపదంశము)

ఊరుపిండి = ఉప్పు వేసి రుబ్బిన మినుపపిండి (లవణభావితపిష్టము)

ఊప = గ్రామము

ఊరుపు = వండినకూర (వ్యంజనవిశేషము) శ్వాసము

ఊర్పు = ఊపిరి

ఊసర = చవుటినేల (ఊషరము)

ఊసరవెల్లి = తొండ (సరట)

ఊసిళ్లు = ఉసుళ్లు పుట్టచెదలు (వల్మీకమక్షికలు)

ఊళ = నక్కకూత (జంబుకధ్వని)

# ఎ

ఎంగిలి = ఉచ్ఛిష్టము

ఎంచదగినది = లెక్కింపదగినది (గణనీయము)

ఎంచెను = లెక్కించెను (గణనచేసెను)

ఎండ = ఆతపము సూర్యకాంతి

ఎండమావులు = ఎండలో కానవచ్చునీడలు (మృగతృష్ణికలు)

ఎండ్ర = గ్రుడ్డికామంచి (ఛత్రి)

ఎండ్రకాయ = కర్కటకము

ఎండ్రి = ఎండ్రకాయ

ఎండ్రిక = ఎండ్రకాయ

ఎంత = ఏపాటిది (మానదర్శకము)

ఎందు = ఎక్కడ (యత్రార్థకము)

ఎకిమీఁడు = రాజు

ఎకిరింత = వాహనము

ఎక్కటికపరము = ద్వంద్వయుద్ధవిశేషము

ఎక్కడ = ఎందు, ఏప్రదేశమునందు

ఎక్కుడు = ఎకిరింత

ఎక్కుడు = వాహనము శ్రేష్ఠము

ఎక్కుడుదీఁగె = మాచేపతీఁగె (జ్యోతిష్మతి)

ఎక్కుపెట్టుట = ధనుస్సునకు నారి తగిలించుట (గుణారోహణము)

ఎక్కువ = అధికము

ఎగపు = [పక్షులు] ఎగురుట (ఉడ్డీనము, విహంగగతి)

ఎగయువాఁడు = మీఁదికి పోవుస్వభావము కలవాఁడు (ఉత్పతిష్ణువు)

ఎగ్గడి = అంతఃపురము లోపలి కావలివాఁడు (వర్షధరుఁడు)

ఎగ్గు = అమంగళవాక్కు (పశతి)

ఎగ్గడ = ఎక్కడ

ఎచట = ఎక్కడ

ఎచ్చట = ఎచట, ఎక్కడ

ఎచ్చరింపు = ఏకాగ్రత

ఎచ్చరిక = ఎచ్చరింపు

ఎచ్చు = ఎక్కువ

ఎచ్చెను = హెచ్చెను (వృద్ధిచెందెను)

ఎటులు = ఏ ప్రకారము (యథార్థకము)

ఎట్టకేలకు = చాలసేపటికి (చిరార్థకము)

ఎట్లు = ఎటులు

ఎద = వేఱొకటి (ఇతరము)

ఎడఁద = మనస్సు

ఎడఁద = వక్షస్థలము

ఎడఁబాటు = క్రమము తప్పి వర్తించుట (అతిపాతము)

ఎడకత్తియ = తార్చు [నాయకునకు నాయికను గూర్చు] స్త్రీ (కుట్టని)

ఎడబెట్టు = ఒకవిధ మగుబంగారునాణెము

ఎడ మయ్యెను = వీడెను వేఱుపడెను

ఎడరు = మధ్యకాలము, నడుమ కలిగిన [కాలముయొక్క] అవకాశము

ఎడసెను = ఎడ మయ్యెను

ఎడ్ద = ఎడఁద, మనస్సు

ఎడ్ద = ఎడఁద (వక్షస్థలము)

ఎత్తనగోల = గోనెలు ఎత్తి ఎద్దుమీఁద వేయుటకు సాధన మైనకఱ్ఱ (గోణ్యుద్ధారిదండము)

ఎత్తు = యుక్తి, ఉపాయము

ఎద = ఎడఁద (మనస్సు)

ఎద = గుండె (హృదయము)

ఎద = భయము హృదయము

ఎదుగు = ఆధికము

ఎదుట = ముందు ఎదురు (పురోఽర్థకము)

ఎదురుకొనుట = గౌరవించుటకై లేచి ఎదురుగా వెళ్లుట (అభిగమనము)

ఎదురుకోలు = ఎదురుకొనుట

ఎదు రేగుట = ఎదురుకొనుట

ఎద్దడి = లేమి (దారిద్ర్యము, రిక్తత)

ఎద్దడినేల = నిర్జలభూమి, మరుభూమి

ఎద్దు = వృషభము

ఎద్దునాలిక = జెంపు (గోజిహ్వ)

ఎనమందుము = ఎనిమిదితూములు (అష్టాఢకి)

ఎనుపతేలు = నల్లతేలు (కృష్ణవృశ్చికము)

ఎనుపసరము = బఱ్ఱె (మహిషి)

ఎనుపెంటి = ఎనుపసరము

ఎనుపోతు = దున్నపోతు (మహిషము)

ఎనుబది = ఎనిమిదిపదులసంఖ్య అది కలది (అశీతి)

ఎనుము = ఎనుపసరము

ఎన్నిక = నాలుగుమూలుపోగులదారము (తంతుచతుష్కము)

ఎన్ను = వరి లో నగువాని వెన్ను (కణిశము)

ఎన్నెను = లెక్కపెట్టెను (గణించెను)

ఎప్పుడు = ఏసమయమునందును (యదార్థకము)

ముక = అష్ఠి

ఎమ్మ = ఎముక

ఎమ్మె = ఒయ్యారము (విలాసము)

ఎయ్యెడ = ఎక్కడ

ఎర = ఆహారము, ఆఁకలి, [ఎఱ] వానపాము

ఎరఁగుడు = నమస్కారము

ఎరఁగెను = నమస్కరించెను

ఎరగలి = దావాగ్ని

ఎరువు = ఎండి పొడి యైన పేఁడకడి (కరీషమూర్ణము)

ఎరుస = ఒకవిధ మగుబంగారునాణెము (దీనారభేదము)

ఎఱంగెను = నమస్కరించెను

ఎఱక = పక్షి ఱెక్క (పక్షము)

ఎఱచి = మాంసము

ఎఱుంగమి = అజ్ఞానము

ఎఱుక = జ్ఞానము

ఎఱుక గలవాఁడు = చదువరి (పండితుఁడు)

ఎఱుకు = ఒకజాతిబోయ (కిరాతభేదము)

ఎఱుకెత = కిరాతస్త్రీ

ఎఱుపు = రక్తవర్ణము

ఎఱ్ఱ = వానపాము (మహీలత)

ఎఱ్ఱ = నెత్తురు (రక్తము)

ఎఱ్ఱగిం = క్షమ

ఎఱ్ఱన = ఎఱుపు

ఎఱ్ఱముసఁగ = తియ్యమసఁగ (మధుశిగ్రువు)

ఎఱ్ఱయుల్లి = నీరుల్లి (పలాండువు)

ఎలజవ్వనము = లేఁతజవ్వనము ఎడప్రాయము

ఎలనగవు = చిఱునవ్వు (స్మితము)

ఎలనాఁగ = స్త్రీ

ఎలమావి = తియ్యమామిడి (సహకారము)

ఎలమి = ప్రేమము

ఎలిచెను = అనుకొనెను, ఎంచెను

ఎలిమె = నెలిమె గోడకు ఇంటికప్పునకు నడుమ
ఉండెడి సెలవప్రదేశము (భిత్తికాచ్ఛదిసంధి)

ఎలుఁగు = కంఠధ్వని

ఎలుఁగు = ఎలుఁగుబంటి (భల్లూకము)

ఎలుక = మూషికము

ఎలుకచెవి = ఎలుకచెవిచెట్టు (మూషకపర్ణి)

ఎలుకజీడి = ఎలుకచెవి

ఎల్ల = పొలిమేర (సీమాస్థలము, గ్రామద్వయ
మధ్యసీమ)

ఎల్ల = అంత (సర్వము)

ఎల్లప్పుడు = సర్వకాలమునందు

ఎల్లవెంటకు = అంతటికి, అంతకు (సర్వమునకు)

ఎల్లి = రేపు, మఱునాటిదినము

ఎల్లిదము = తిరస్కారము (అగౌరవము)

ఎల్లుండి = రేపటికి పైదినము

ఏఁగెను = మరణించెను

ఏఁడాది = సంవత్సరము

ఏఁడికోల = ఏఁడికఱ్ఱ, నాఁగలికి కాఁడికి నడుమ ఉండుకఱ్ఱ (ఈష)

ఏఁడు = ఏఁడాది

ఏఁదుము = ఐదుతూములు (పంచాఢకి)

ఏఁదెను = ప్రోచెను, కాపాడెను

ఏఁబది = ఐదుపదులసంఖ్య, సంఖ్య కలది (పంచాశత్తు)

ఏఁబలము = ఐదుపలములు (పంచపలి)

ఏకతము = విజనము నిర్జనస్థలము ఏకాంతము

ఏకలము = అడవిపంది (వరాహము)

ఏకు = ఏకినదూదిముట్ట (తూలకణిక)

ఏకుడు = దూదిని మెత్తగాఁ జేయుట (తూలమృదూకృతి)

ఏగుర = ఐదుకుంచములు (ప్రస్థపంచకము)

ఏట్రింత = భరద్వాజపక్షి

ఏడాకులయనంటి = సప్తపర్ణము

ఏడుగడ = రక్షకుఁడు నియంత

ఏడుగడ = సర్వపదార్థము

ఏడుపు = ఆర్తలకంఠధ్వని

ఏడ్చెను = ఏడిచెను (రోదనముచేసెను)

ఏడ్తుము = ఏడుతూములు (సప్తాఢకి)

ఏడ్పు = రోదనము

ఏతము = ఏతాము (ఘటీయంత్రము)

ఏతరి = చెడ్డవాఁడు (కుజనుఁడు)

ఏతుఖ = సాధారణస్త్రీ

ఏతుల = సాధారణస్త్రీ, చేటలు అల్లుట వృత్తిగాఁ గల యొకజాతిమనుష్యస్త్రీ

ఏద = ఏకాగ్రత అవధానము

ఏదు = ముండ్లపంది (శల్యము)

ఏదెను = విడిచెను, ఉజ్ఝించెను

ఏనాది = ఒకజాతిబోయ (కిరాతభేదము)

ఎనుంగు = ఏనుఁగు (గజము)

ఎనుఁగంత = ఏనుఁగంతటిపరిమాణము కలది

ఎనుఁగడుగులు = పలురంగులు గలవస్త్రవిశేషము (చిత్రవస్త్రవిశేషము)

ఏనుఁగు = ఏనుంగు

ఏనుఁగుమొగముసామి = వెనకయ్య (వినాయకుఁడు)

ఏన్గు = ఏనుంగు

ఏపు = గర్వము

ఏపు = ఒయ్యారము (విలాసము)

ఏమఱిక = పరాకు (ప్రమాదము)

ఏమఱిపాటు = ఏమఱిక

ఏరవకడ = దేవతాళము

ఏరాళు = తోడికోడలు (యాత)

ఏరు = నాఁగలి అంచుల కైనయెద్దులు

ఏరుకలప = నాఁగలికి ఉపయోగించుసామగ్రి
(హలోపకరణము)

ఏరుగు = మలము విష్ఠ

ఏరువాఖుపు = గాలింపు, కడుగుడు

ఏర్పిడుక = నేలపైఁబడి ఎండి ఏఱుగాకైడి పేఁడకడి
(కరీషము)

ఓటి = నది

ఏఱువంగ = ముంగ్లవంగ (కంటకి)

ఏల = జోల ఒకవిధమైనపాట

ఏలికి = ఏలికితీఁగె (ఏల)

ఏలిక = దొర (రాజు)

ఏలుకోటి = ఏలబడికి లోఁబడినజనము (ప్రజావర్గము)

ఏవ = ఏద (అవధానము)

ఏవ = రోషము, రోఁత

ఏవగింపు = ఆడిక (అపవాదము, నింద)

ఏవము = ఏవగింపు

## ఐ

| | | |
|---|---|---|
| ఐతె | = | విశేషము త్వర్థకము |
| ఐది | = | వెనుకప్రదేశము (పృష్ఠభాగము) |
| ఐడువ | = | ఐదువరాలు |
| ఐడువరాలు | = | భర్త గలస్త్రీ (పతివత్ని) |
| ఐరి | = | కంటికి వచ్చెడియొకవిధ మగురోగము (అక్షిరోగవిశేషము) |
| ఐరగట్టు | = | ఏరుకలప (హాలోపకరణము) |
| ఐరేనికడవలు | = | పెండ్లికుండలు (ఘటవిశేషములు) |
| ఐవచ్చెను | = | అచ్చివచ్చెను (అనుకూలపడెను) |

## ఒ

| | | |
|---|---|---|
| ఒంటనివాఁడు | = | శత్రువు, వైరి |
| ఒంటమి | = | పగ (వైరము) |
| ఒంటరి | = | అసహాయశూరుఁడు మేటిబంటు (ఏకభటుఁడు) |
| ఒంటరీఁడు | = | ఒంటరి |
| ఒంటి | = | ఒక్కటి (ఏకాకి, అసహాయుఁడు) |
| ఒంటిపాటు | = | ఏకతము |
| ఒంచె | = | లొట్టిపిట్ట (ఉష్ట్రము) |

ఒంట్రింపు = ఒంటరి (ఏకభటుఁడు)

ఒంట్లు = పాఁగులు (కర్ణవేష్టనవిశేషములు)

ఒండు = ఒకటి [ఏకసంఖ్య] కలది

ఒండొండు = అన్యోన్యము, పరస్పరము

ఒండొరిమి = మైత్రి, స్నేహము

ఒకండు = ఒండు

ఒకటి = ఒండు

ఒకతేప = ఒక్కసారి (ఏకవారము)

ఒకపరి = ఒకతేప

ఒకప్పుడు = ఒకానొకప్పుడు (కదాచిదర్థకము)

ఒకపెట్టునన్ = ఒకేసమయమున (ఏకకాలమున,
యుగపత్పదార్థకము)

ఒకింత = ఇంచుకంత

ఒక్కంత గాన్ = ఒకపెట్టునన్

ఒక్కట = ఒకచోట (ఏకత్రార్థకము)

ఒక్కటి = ఒండు

ఒక్కటీఁడు = ఒంటరి

ఒక్కఁడు = ఒండు

ఒక్కనాఁడు = వేఱుదినము ఒకానొకదినము (అన్యదినము)

ఒక్కమాటు = ఒకసారి ృదర్థకము)

ఒక్కయూఁకువన్ = ఒకపెట్టు

ఒక్కసారి = ఒకతడవ, ఒకతేప

ఒక్కుమ్మడిన్ = ఒకపెట్టునన్

ఒక్కెడ = ఒకప్పుడు, ఏదో ఒకసమయమున (కదాచిదర్థకము)

ఒక్కొలనన్ = ఒక్కుమ్మడిన్, ఒకపెట్టునన్

ఒగరు = కషాయము [షడ్రసములలో ఒకటి]

ఒగి = చక్కనిది

ఒజ్జ = ఉపాధ్యాయుఁడు

ఒజ్జసాని = ఉపాధ్యాయునిభార్య (ఉపాధ్యాయాని)

ఒట్టు = శపథము, శపనము, ప్రతిజ్ఞ

ఒడఁబడిక = సమ్మతి అంగీకారము

ఒడఁబాటు = ఒడఁబడిక

ఒడయఁడు = దొర (నరపాలుఁడు)

ఒడలు = శరీరము

ఒడి = వస్త్రపుటి, అంకము

ఒడియించెను = తీయించెను లాగించెను

ఒడిసె = గోఁపులు లో నడువానిని తొలిచి రంధ్రము వేయునొకసాధనము (ఆవిద్ధము)

ఒడ్డగిలెను = ఒకవంకకు వంగెను

ఒడ్డణము = ఆఁడువారియొంటిపేటమొలనూలు (కాంచి)

ఒడ్డాణము = ఒడ్డణము

ఒడ్డనము = సేనావిన్యాసము, వ్యూహము

ఒడ్డారము = వంకరమాట (వక్రోక్తి)

ఒడ్డి = ఒకజాతి మగుపావురము (పారావతవిశేషము)

ఒత్తు = ఒత్తనము
ఒడ్డోలగము = నిండుసభ, పేరోలగము (మహాసభ)
ఒత్తరము = అదుముడు, నొక్కుట (పీడనము)
ఒత్తు = ఒత్తనము
ఒత్తు = ఒకవిధ మకుగాజు (హస్తభూషణము)
ఒదలుట = వదలిపెట్టుట, ఉజ్జనము (విసర్జనము)
ఒదిగెను = తొలగెను తప్పుకొనెను
ఒద్ద = దగ్గఱ (సమీపము)
ఒద్దిక = మైత్రి, స్నేహము
ఒనరెను = ఒప్పెను
ఒనవెట్టు = పొందనము, పొంది యుండుట
ఒప్పగించెను = అప్పగించెను (వశముచేసెను)
ఒప్పనివాఁడు = మఱుఁగుపడి ఉండువాఁడు, చెడ్డనడవడిచే నలుగురిలో సంచరింప వీలు లేనివాఁడు (అప్రకాశ్యుఁడు)
ఒప్పమి = పగ (వైరము)
ఒప్పరము = తూము, జలదారి (జలనిర్గమము)
ఒప్పరగించెను = ఒప్పగించెను (అధీనముచేసెను)
ఒప్పించెను = ఒప్పరగించెను
ఒప్పుకోలు = సమ్మతి, అంగీకారము
ఒప్పు = కాంతి
ఒమ్మిక = స్నేహము

ఒమ్రు = పెద్దది (స్థూలము)

ఒయ్యారము = విలాసము, శృంగార చేష్టావిశేషము

ఒర = ఒరయిక రాపిడి, [ఒఱ] కత్తిఁ ఉంచుకొనెడి రొఱ

ఒరగల్లు = గీటుఱాయి (నికషోపలము)

ఒరగు = దిండు (ఉపధానము)

ఒరిజ = ఏనుఁగునడుమునకు కట్టెడు మోపు (కక్ష్య)

ఒరిమ = పొత్తు (స్నేహము మిత్రభావము)

ఒఱ = కత్తియొఱ (కోశము)

ఒఱగొడ్డెము = వంకరమాట (వక్రోక్తి)

ఒఱపు = ఒయ్యారము

ఒఱ్ఱ = కారము (కటువు)

ఒఱ్ఱన = ఒఱ్ఱ

ఒల్లఁబోయెను = చిన్నఁబోయెను

ఒల్లె = ఉత్తరీయము, ఊర్ధ్వవస్త్రము

ఒళవు = వీణాదండము

ఒసఁగు = ఈవి (దానము)

ఒసి = పనికత్తె మొదలగువారిని పిలిచెడి పిలుపు (చేటికాదిసంబోధనము)

# ఓ

ఓ = ఏమి, ఎందులకు (కిమర్థకము)

ఓగిరము = అన్నము, ఆహారము

ఓజ = స్వభావము

ఓజు = పనివాఁడు

ఓటమి = అపజయము

ఓడ = నౌక

ఓడవాఁడు = నావికుఁడు

ఓడుట = ఓటమి

ఓదము = ఏనుఁగును పట్టుటకు త్రవ్వినగోయి మొద లగునది (గజబంధని)

ఓదె = కోసి వేసినజొన్న మొద లగునవి (ధీర్ఘయావనాళకాది)

ఓపిక = బలిమి (శక్తి)

ఓపె = స్త్రీసంబోధనార్థకము

ఓమటి = ఓగిరము

ఓమము = [వాము-వ్య.]

ఓమె = ఓపె

ఓయి = సంబోధనార్థకము

ఓర అడ్డము గా, ఒరగునట్లు గా (సాచ్యర్థకము)

[illegible] = ఒకజాతిడేగ (శ్యేనవిశేషము)

ఓరపాక = పంచను దూలములు లేక గోడపైనుండి ప్రక్కకు దింపి రాడులయాధారమునఁ గట్టినశాల (భిత్త్యధఃకృతిగృహము)

ఓరి = హీనసంబోధనార్థకము

ఓరీ = ఓరి

ఓరుగల్లు = పురవిశేషము [వరంగల్లు-వ్య.] (ఏకశిలానగరము)

ఓరుపు = సహనము

ఓరెము = ఓరిమము

ఓర్పరి = ఓర్పు గలవాఁడు (సహిష్ణువు)

ఓర్వమి = ఈసు

ఓల = జలక్రీడాకాలమున 'పట్టుకో చూత' మని ఇతరులను ప్రేరేమటకై ఉపయోగించెడి శబ్దము (జలవిహృతికాలశబ్దము)

ఓలగము = కొలువు (ఆస్థానము)

ఓలచెంగనాలు = అపజయము, భంగపాటు

ఓలము = చాటు (వ్యవధానము)

ఓలి = ఉంకువ, కన్యకై అల్లుఁ డిచ్చుద్రవ్యము

ఓలి = వరుస, ఉంకువ

ఓలిమి = ఓలము

ఓవరి = లోపలిగది (వాసగృహము)

ఓసరించెను = ఓరచేసెను, ఒకవంకకు తొలఁగఁజేసెను

ఓసరిల్లెను = తక్కువాయెను, తొలఁగిపడెను

ఓసి = ఒసి [చేటికాదుల కైన సంబోధనము]

ఓహటించెను = ఓడెను

ఓహరిసాహరి = నేను నేను అని ఒకరికంటె ఒకరు ముందుకు వచ్చుచు జరుపుయుద్ధము (అహమహమిక)

## ఔ

ఔడు = అధరము క్రిందిచోటు (ఓష్ఠాధరభాగము)

ఔదల = ముందల, తలముందుభాగము (శిరోఽగ్రము)

ఔను = సరే (యాథార్థ్యము) [నిజమగు అనుట]

ఔర = బలే (ప్రశంసార్థకము)

ఔరు = అవురుగడ్డి (వీరణము)

## క

కంకటి = మంచము (ఖట్వ)

కంకణము = రాబందు (కంకపక్షి, లోహపృష్ఠము)

కంకర = ఇసుక చేర్చి దంచినసున్నము (లేపనిశేషము)

కంకి = ఈని గింజ పట్టినజొన్న లో నగువానికంకి (గ్రామ్యకవిశేషము)

కంగవ = ఇరవు, నెలవు (స్థానము)

కంగారు = ఆటము (యుద్ధము)

కంగిన = కంగారు

కంగోనుపావడ = ఒకవిధ ముగుపావడ, పొడుగుగా కొంగు ఉంచి కుట్టినపావడ

కంచము = భోజనపాత్ర, కంసము

కంచరి = కంచుపని చేయువాడు, కంచరివాడు

కంచి = ఒకపట్టణము

కంచు = ఒకలోహము (కాంస్యము)

కంచుకంటు = బూరెలమూకుడు, గాలి (కందువు)

కంచుమించు = ఒకజాతిడేగ

కంచె = దున్ననభూమి (అప్రహతభూమి)

కంచెల = దున్ననిభూమి, అవిక

కంచెల = అవిక (కంచులిక)

కంట = నాట్యబంధము

కంటనము = విరుద్ధమైనమాట (విప్రలాపము)

కంటనరి = నాను (కంఠభూషావిశేషము)

కంటీలు = పోకులు; ఒంట్లు

కంటు = ఒప్పమి (వైరము)

కంటు = పగవాడు (వైరి, శత్రువు)

కంటె = కంఠసరి

కండ = మాంసము

కండచక్క = కడుపులో కుడిప్రక్క నల్లగా నుండెడి
మాంసపుఖండము (కాలఖండము)

కండచక్కెర = కలకండ, పటికబెల్లము (మత్స్యండి)

కండచక్కెరడింకికత్తలానివజీరుఁడు = చిలుకరౌతు (మన్మథుఁడు)

కండె = జలతారు, సరిగ, పుత్తడిపోఁచ

కంతి = వృక్షాదులబుడిపె (గ్రంథి)

కంద = కందదుంప

కంద = కందగడ్డచెట్టు (సూరణము)

కందణము = ముప్పదిరెండువిన్నాణములలోనియొక
మల్లబంధము (మల్లబంధవిశేషము)

కందనగాయ = ఎద, గుండెకాయ [కాయవలెనుండు
హృదయావయవము]

కందము = అశ్వాదులమూఁపు (స్కంధము)

కందరికము = గంతకు అడుగున వేసికొను మెత్త
(కంథాస్తరణము)

కందాయము = ఆయతి (జ్యేష్ఠాదిమాసచతుష్టయము)

కంది = ఒకదినుసుకాయధాన్యము (తువరి)

కందు = ఉడుకు (తాపము)

కందు = నలుపు (కృష్ణవర్ణము)

కందు = పశుపక్ష్యాదులపిల్ల, కొదమ
(తిర్యగర్భకము)

కందు = శిశువు, కలంకము

కండరీగ = ఒజ్జతె తుమ్మెద [కందిరీగ-వ్య] (గండోలి)

కండువ = చమటతువాలు

కండెన = బండికన్నులయందు పట్టించుచమురు

కండెను = కమలెను

కంప = ముండ్లకంప మొదలగువానిమోపు (కంటకాదిభారము)

కంపు = వాసన, గంధము

కంపె = తమలపాకులపళ్లెము, తబుకు (తాంబూలపాత్రము)

కంబము = గుంజ (స్తంభము)

కంబము = మల్లవిద్యాసాధనము

కంబళి = ఒకవిధ మగుఉన్నిపచ్చడము (కంబలము)

కంబవలి = వసుగులోనికడప వేదినము

కంసాలి = కమసాలి, అగసాలి (స్వర్ణకారుడు)

కకపాల = ఒకవిధ నుగుయోగులసంచి (కక్షపాల)

కకపాల = మంగలిపొది (కక్షపాల)

కక్కెర = పెద్దకొక్కెర (కర్కరేటువు)

కచ్చ = స్త్రీపురుషులరహస్యాంగము (ఉపస్థ)

కచ్చడము = గోచి (కౌపీనము)

కచ్చి = కచ్చిదేశపుగుఱ్ఱము

కచ్చిక = కాలినపిడక (దగ్ధపిటకము)

కచ్చుకొనెను = పట్టుపట్టెను

కచ్చె = కంటసము (విప్రలాపము విరోధోక్తి)

కచ్చె = ఒకవిధమైనవస్త్రపుమడత, పింజె (కచ్ఛభేదము)

కజ్జము = అప్పచ్చి (అపూపము)

కజ్జాయము = కజ్జము

కజ్జూరము = ఖర్జూరపుచెట్టు

కటా = అయ్యో (ఖేదార్థకము)

కటకటా = కటా

కటకరము = ఒకజాతిమృగము (గంధర్వము)

కటదుర = చెక్కిలిమీఁదిప్రదేశము (హనువు)

కటారి = బాకు (కరాసి)

కటిక = సాము సేయుటకై త్రిప్పెడునొకపరికరము (మల్లవిద్యాసాధనము)

కటికవాండ్రు = వేత్రహస్తులు, ప్రతీహారులు

కటికవాఁడు = మాంసము అమ్మువాఁడు (మాంసికుఁడు)

కటికి = కఠినమైనది. గట్టిది (దృఢము)

కటికచీకటి = గాఢాంధకారము, అంధతమసము

కట్ట = మడికి చుట్టు ఏర్పఱచినకట్ట (సేతువిశేషము)

కట్టడ = ఏర్పాటు (నియమము, వ్యవస్థ)

కట్టడి = పూర్వకృతశుభాశుభకర్మము, నియతి, అదృష్టము

కట్టనము = వస్త్రము

కట్టరము = నాట్యమునందలికట్టు (నాట్యబంధము)

కట్టా = కటా

కట్టాయితము = అయితము (సన్నాహము, సంసిద్ధము)
కట్టికలు = కటికవాండ్రు (వేత్రహస్తులు)
కట్టిడి = కట్టడి
కట్టివది = గర్భము ధరించినపశువు (గర్భిణి)
కట్టియ = కట్టె (కాష్ఠము)
కట్టుక = [పశ్వాదుల] గర్భస్రావము
కట్టుకంబము = ఏనుఁగులను కట్టుస్తంభము (ఆలానము)
కట్టుఁగొయ్య = కళ్లమునందు పశువులను కట్టుటకై పాఁతినకొయ్య (మేధి)
కట్టుదారు = ఉడికినకందిపప్పులో నగువానిరసము (యూషము)
కట్టె = కట్టియ
కట్ల = మంచపుడోలి (శిబిక, యాప్యయానము)
కట్లచెట్టు = రాత్రియందు వికసించెడియొకచెట్టు (శంఖని)
కట్లమంచము = కట్ల
కట్లె = తూఁచుటకు ఉపయోగించెడిగురుగింజ మొదలగునది (తులామానగుంజాది)
కడ = దిక్కు
కడ = కడమ వేఱు (ఇతరము)
కడంక = ధైర్యము (కష్టసుఖములకు కలఁత చెందనిస్థితి)
కడంత = కణఁత (శిరఃపార్శ్వము)
కదప్తి = ఒకజాతిమృగము (గంధర్వము)

కత్తెరవంగ = పెద్దవంగ (కర్త్రారిక)

కద = ప్రసిద్ధిని తెలుపునది (కిలార్థకము)

కదంబము = కలపము (యక్షకర్దమము. మహాసుగంధము)

కదలదమ్ము = ప్రయాణము యాత్ర

కదలిక = కదలుటమ్ము

కదలు = కదలుటమ్ము

కదలారు = కదలుటమ్ము

కదలెను = వడఁకెను

కదలెను = పరువిడెను, పాఱెను

కదిసెను = సమీపించెను

కదిపెను = ముట్టెను, అంటెను

కదుపు = పశుసమూహము, సమజము

కదుము = దెబ్బవలన ఏర్పడినగడ్డ, బొప్పి
(ఘాతభవగ్రంథి)

కదురు = రాట్నము వడికినదారము చుట్టుటకు
ఆధారమైనసాధనము
(తంత్వాధారసూచిక, తర్కువు)

కవడు = కోపము

కవటు = కనరు

కనాతిగోడ = గోడవలె గుడారముచుట్టు ఏర్పఱచిన తెర
(వసననిర్మితకుడ్యభావము)

కనికరము = కరుణ

కనిపించెను = వినిచెను, వినఁబడెను

కనుఁగొనెను = చూచెను

కనుక = కారణమును చెప్పునది (హేత్వర్థకము)

కనుపు = గనుపు, వెదురు లో నగువానిముడి (పర్వము)

కనుపుగొట్టెను = ముక్కలు ముక్కలు గా చేసి చంపెను (ఖండించెను)

కనుమ = కన్నము (వివరము, కందరము)

కనుమ = రెండుకొండలనడిమిసందుత్రోవ (కాంతారము)

కనుమరి = కమ్మరి, ఇనుపపనివాఁడు (అయస్కారుఁడు)

కనుము = చెఱకువలె ఉండెడియొకవిధ మగుతృణము (శరము)

కనుమూసిగంత = కన్నులు కప్పి ఆడెడియొకయాట, దాఁగిలిమూఁత (అక్షినిమీలనకేళి)

కనెను = చూచెను

కన్కను = కనుక

కన్గిలుపు = కన్గీఁటు (కనుసైగ చేయుట)

కన్నకొడుకు = కొమారుఁడు (ఔరసుఁడు)

కన్నగాఁడు = కన్నము వేసి దోఁచుకొనుదొంగ, గడిదొంగ (సురంగాకారితస్కరుఁడు)

కన్నడము = ఒకదేశభాష (కర్ణాటము)

కన్నడీఁడు = కన్నడదేశమునం దుండువాఁడు (కర్ణాటకుఁడు)

కన్నము = కనుమ (వివరము)

కన్నాకు = మేలుగాంగి (శ్లేష్మము)
కన్నాతి = ముప్పదిరెండువిన్నాణములలో ఒకపట్టు (మల్లబంధవిశేషము)
కన్నాతలు = సాముగోసియొక భేదము (మల్లవిద్యావిశేషము)
కన్నియ = పెండ్లి కానిబాలిక (కన్య)
కన్నీరు = కంటినీరు (అశ్రువు)
కన్ను = కనుపు
కన్ను = నెమలిపురికన్ను (చంద్రకము)
కన్ను = నేత్రము, లోచనము
కన్నులవిలుతుఁడు = చెఱకువిల్కాఁడు (మన్మథుఁడు)
కన్నులు = నెమిలికన్ను, నేత్రము, వల మున్నగువానిరంధ్రము
కన్నె = కన్నియ
కన్నెకయ్యము = యుద్ధారంభము
కన్నెఱికము = కన్యాత్వము
కన్నెలేడి = పెద్దఱెక్కలు గలయొకజాతిపక్షి (కారండవము)
కన్య = కన్నియ
కప్పురము = కర్పూరము, ఘనసారము
కప్పురపుటనంటి = ఏడాకులయరఁటి (సప్తపర్ణము)
కపోదా = జిలు వగువిల్లు
కప్ప = మండూకము
కప్పచిప్ప = నీటియుంపలిగుల్ల (జలశుక్తి)

కప్పడము = వస్త్రము

కప్పము = కానుక రాజాదులదివ్యనమునకై వచ్చి యిచ్చుకానుక, ఉలుప (ఉపాయనము)

కప్పు = అడ్డి, మఱుఁగు (వ్యవధానము)

కప్పు = నలుపు (కృష్ణవర్ణము)

కప్పురము = కర్పురము

కప్పురాలు = ఇంద్రనీలమణులు

కప్పెను = మూసెను

కప్పెరి = తలచిప్పయెముక (కరోటి)

కప్రము = కర్పురము

కబురు = వృత్తాంతము సంభము, ఆడంబరము

కబ్బము = కావ్యము

కమతగాఁడు = రైతు (హాలికుఁడు)

కమరి = ఒడ్డాణము, ఒడ్డణము

కమలెను = కందెను

కమి = మ్రింగుట (కబళనము)

క[illegible]కిలి = [illegible] (పాణివిశేషము)

కమ్మ = తాటియాకు (తాళపత్త్రము)

కమ్మ = చెవికమ్మ (తాటంకము)

కమ్మ = జాబు (లేఖ)

కమ = తోఁటకూర కాఁడలో నగునది (శాకనాళము)

క[illegible] = శూద్రులలోనియొక తెగ (శూద్రవిశేషము)

కమ్మ = [illegible], [illegible] కమ్మ

కమ్మచ్చు = బంగారు వెండి లో నగువానితీఁగ
తీసెడుపనిముట్టు
(లోహాలతాకరణయంత్రము)

కమ్మతకాఁడు = రైతు (హాలికుఁడు కృషీవలుఁడు)

కమ్మతీఁడు = కమ్మతకాఁడు

కమ్మని = ఇంపైనవాసన (సురభి)

కమ్మపిల్లి = పునుఁగు నిచ్చుపిల్లి (గంధమార్జాలము)

కమ్మరము = ఇనుపపని (అయస్కారకర్మము)

కమ్మరి = ఇనుపపనివాఁడు (అయస్కారుఁడు
కర్మారుఁడు)

కమ్మరేను = ఒకవిధ మరు రేఁగు (లకుచము)

కమ్మవిల్కాఁడు = మన్మథుఁడు ఇక్షుధన్వుఁడు

కమ్మి = వస్త్రముయొక్క నిలువుటంచు
(అంశుకాగ్రావయవవిశేషము)

కమ్మి = బండిచక్రముయొక్క చుట్టునంచు (నేమి)

కమ్మి = బంగారు లో నగువానికడ్డీ (లోహలత)

కమ్మునీరు = చలువ చేయనబట్టలు తడుపుటకుపయోగించు
నీ కందునీరు (ఉపజలము)

కయి = మ కట్టునుండి వ్రేళ్లతో కూడిన యి
(కరము)

కయివడి = సామ్యము (ఉపమ)

కయ్య = కాలువ (కుల్య)

కయ్య = వరిమడి (కేదారము)

కయ్యము = కంగారు (యుద్ధము)

కర = అల (వీచి)

కర = కట్ట (సేతువిశేషము)

కరక = కరకచెట్టు (హరీతకి)

కరకంచు = పలురంగులు గలవస్త్రములలోని యొక భేదము (చిత్రవస్త్రవిశేషము).

కరకరి = మచ్చరము, పట్టుదల (మాత్సర్యము)

కరడు = కర (వీచి)

కరడు = పక్షివిశేషము

కరణము = లెక్కలు వ్రాయువాడు (గణకుడు)

కరణికము = కరణపువృత్తి (గణకత్వము)

కరపక్క = కాంతి తక్కువగా ఉన్న కెంపు

కరపటము = కాటుకఅది ఉంచుకొనుచిన్నబరిణె (శీర్ణకరండము)

కరవాలు = ఖడ్గము

కరాటము = కరవటము

కరి = సాక్షి, ప్రత్యక్షద్రష్ట

కరిచి = తప్పెట (చర్మవాద్యవిశేషము)

కరిపె = వీణాదండమును పొదివికొని యుండునట్లు సొఱకాయపై నమర్చెడు ['ఇత్తడి'లో నగువానితో చేసిన] తదంగము (కకుభము)

కరిసె = కాలువలము, పలములో నాలుగవభాగము

కరుమలి = కమ్మరి (అయస్కారుడు)

కరువు = కొండ (పర్వతము)

కరువలి = గాలి (వాయువు)
కరువాడు = ఎండిన చేఁప (శుష్కమత్స్యము)
కరుసు = కఠిన మైనమాట (నిష్ఠురము)
కఱకంఠుసిల్లాలు = అమ్మిక (పార్వతి)
కఱకు = తీక్ష్ణము
కఱకు = కరుసు
కఱకు = కడిమి (శౌర్యము)
కఱకుట్లు = శూలమునకు గ్రుచ్చి కాల్చినమాంస ఖండము (శూల్యము)
కఱటి = అడిగొట్టు (కుజనుఁడు)
కఱప = భాషితము
కలి = నలుపు, కాటుకవంటినల్లనినలుపు (కృష్ణవర్ణము)
కఱి = నల్లనివస్త్రం. సాక్షి, హద్దు
కఱిఁజేసేసుప్పు = కంఠ్రగొఁగు
కఱియ = కఱి (కృష్ణవర్ణము)
కఱివేము = కఱివేపాకుచెట్టు (కృష్ణనింబము)
కఱుకు = మూలికాదులు కాల్చి చేసినభస్మము (క్షారము)
కఱ్ఱ = వరి మున్నగువానిదుబ్బు (సస్యగుచ్ఛము)
కఱ్ఱి = కఱి (కృష్ణవర్ణము)
కఱ్ఱి = అర్జునుఁడు
కఱ్ఱివెల్పు = విష్ణువు అర్జునసఖుఁడు

దోర = దొంతర (ఉత్పంక్తి)

దోరణము = వెలుపలిగుమ్మము (బహిర్ద్వారము; ద్వారబాహ్యభాగము)

దోరపాక = పంచను, చూరులు లేక గోడపైనుండి ప్రక్కకు దింపి రాడులయాధారమున కట్టినశాల, ఓరపాక

దోరెను = తీరెను; చచ్చెను

దోరెము = దేగకు కట్టుడెదారము

దోవతి = మగవారికట్టుబట్ట (కటీపటము)

దోసము = దోసగు (పాపము; దోషము)

దోసిలి = దోయిలి; వంచినరెండుచేరలచేరిక (అంజలి)

దోసె = ఒకవిధ మగుభక్ష్యము

## దౌ

దౌడ = దవుడ (తాలువు)

## ద్రా

ద్రాబ = సారము లేనిమాట (అసారోక్తి)

## ద్రో

ద్రోణము = ధనుస్సు కొలుటకు కావలసిన భుజబలము కలిగించునట్టి సాధనము (చాపకర్షణబలసాధనము)

ద్రోపది = ద్రౌపది [పాండవభార్య]

ద్రోవది = ద్రౌపది

# న

నంజుడు = చియ్య (మాంసము)

నంది = శివునిఁ బూజించు నొకజాతిపూజారి; లింగబలి (దేవలుఁడు)

నక్క = జంబుకము

నక్కతోఁకపొన్న = నక్కతోఁకవలె నుండునొకతృణము (క్రోష్టుపుచ్ఛ)

నక్కదోస = చిన్నదోస (క్షుద్రోర్వారుకము)

నక్కనేరేడు = కాకినేరేడు (భూజంబువు)

నక్కరేగు = ఒకవిధ మగు రేఁగు (లకుచము)

నక్కవిరి = చిన్నశ్లేష్మాతకము (క్షుద్రశేలువు)

నక్కు = బంగారుకడ్డి నడుమఁగా నడుమ కనిపించు గొప్పకాంతి

నగరు = రాజు లుండెడియిల్లు (రాజగృహము)

నగవు = నవ్వు (హాసము)

నచ్చిక = నమ్మకము (విశ్వాసము)

నచ్చినవాఁడు = చనవరి (ఆప్తుఁడు)

నచ్చెను = నమ్మెను (విశ్వసించెను)

నట్టు = తోలు (చర్మము)

నట్టు = నాట్యము చేయువాఁడు (నటుఁడు)

నట్టు = గృహము, గృహప్రదేశము

నట్టువపిట్ట = నెమిలి (మయూరము; కేకి)

నట్టువుండు = నట్టు (నటుఁడు)

నట్లొట్లు = వాన వెలిసినతరువాత చూరినుండి పడునీటిబొట్లు; వంగుళ్లు

నడ = నడక (గతి; గమనము)

నడక — నడవడి; బ్రతుకు తెరువు (వృత్తి; జీవిక)

నడత — నడక

నడపు — నడు

నడవ — దారి (మార్గము)

నడవడి — నడక

నడిరాతిరి — అర్ధరాత్రము

నడిరేయి — నడిరాతిరి

నడిమ్రేలు — నడిమిమ్రేలు (మధ్యమ)

నడుము — కౌను (శరీరమధ్యభాగము; మధ్యము)

నద్దిముక్కు గలాఁడు — చప్పిడిముక్కు కలవాఁడు (నతనాసుఁడు)

నత్త — గుల్లలయందుండు పురుగు (జలశంఖకీటకము)

నత్తివాఁడు — నంగినంగిమాట లాడువాఁడు (గోహలుఁడు)

నన — ఇంచుకంత పెరిఁగిన మొగ్గ (కోరకము)

ననిచినది — మొగ్గ తొడిగినది (కోరకితము)

ననచు — చిగిర్చును, వికసించును [పూలుపూచును]

నప్పువాఁడు = విటుఁడు; వేశ్యాపతి

నప్పు = మగఁడు (గొలుఁడు)

నమలెను = తినియెను (భుజించెను)

నమ్మిక = విశ్వాసము

నమ్మినవాఁడు = చనవరి (ఆప్తుఁడు)

నర = ముసలితనముచేఁ గలిగిన వెంట్రుకల తెల్లఁదనము (పలితము)

నరగజంబు = ఒకవిధ మగు పెద్దచర్మవాద్యము (తమరవిశేషము)

నరపు = నర

నరము = నాడి; సిర

నరవ = కొండత్రోవ (నిర్యయనము)

నరసింహము = ముప్పదిరెండు విన్నాణములలో ఒకటి (మల్లబంధవిశేషము)

నరాజి = ఖడ్గము

నరులు = అర్మిలి; పుత్రాదులయందలిప్రేమము (వాత్సల్యము)

నర్లు = నరులు

నఱకెను = ఖండించెను

నఱుకు = ఆయుధవిద్యలలోనిదియొకవిద్య (శస్త్రవిద్యాభేదము)

నలి = ఎండుగడ్డి (శుష్కతృణము)

**నలి** = చిఱుతిండి, అందము

నాఁచు = దొంగ, వాఁచితీగె

నాఁటిది = దినమందు ఏర్పడినది

నాఁడు = దినము

నాఁడు = దినము, [నాడు] దేశము

నాగప్పోని = నాగవల్లి నడిపెడిముత్తైదువ
(నాకబలిపేరంటి)

నాగమల్లె = ఒకవిధపుమల్లె (నాగమల్లిక; అష్టపత్రిక)

నాగవలి = పెండ్లిచివరిదినము; నాగవల్లి (నాకబలి)

నాగవాసము = వేశ్యలు గుంపుగా ఏర్పడిన మేళముజత

నాగసరము = పాములకు ఆనందము కలుగునట్లు
పాములవాఁడూదెడుబూర (నాగస్వరము)

నాఁగుఁబాము = త్రాఁచు; పడగ గలయొకజాతిక్రూరసర్పము
(ఫణి)

నాగులు = నాఁగుఁబాములు (నాగములు)

నాడు = దేశము

నాడె = తొట్టె; నూలికండె ఉంచి నేసెడియొక
నేతపనిముట్టు (పెరి)

నాడెను = నాటెను; గ్రుచ్చెను

నాణెము = సరిగా ముద్రింపఁబడినవరా
(శుద్ధదీనారము)

నాణెము = అందమైనది (మంజులము)

నాతి = స్త్రీ

నాతుక = నాతి

నాదు = చప్పుడు (ధ్వని; శబ్దము)

నాదు = వాయింపు (వాదనము)

నాన = సిగ్గు (లజ్జ)

నానఁబ్రాలు = నానఁబెట్టినక్రొత్తచేసుడుబియ్యము (ఆర్ద్రితండులము)

నాను = కంటె; ఒకవిధ మగుకంఠభూష

నానుడి = జనులు చెప్పుకొనెడివార్త (జనశ్రుతి; లోకప్రవాదము)

నానెను = తడిసెను; చెమ్మగిల్లెను [ఆర్ద్రి మయ్యెను]

నానోడి = నానుడి

నాపచేని = నాగప్పనాని (నాకబలిచిరంటి)

నార = తెసపతో నేయఁబడినవస్త్రము (వల్కలము)

నారదబ్బ = ఒకదినుసుదబ్బ (నారంగము)

నారణపక్కి = ఒకజాతికొంగ (నారాయణపక్షి; బకోటము)

నారసము = ఇనుపబాణము (నారాచము)

నారి = అల్లెత్రాడు (మౌర్వి)

నారికెడంబు = టెంకాయచెట్టు (నారికేరము)

నాఱు = నాటుటకై విత్తనములు ఒత్తుగా చల్లి మొలపించుమొలకలు (వాప్యాంకురావలి)

నాలవకులమువారలు = కాఁపులు (శూద్రులు)

నాల్క = నాలిక (జిహ్వ)

నావ = ఓడ (తరణి; నౌక)

నావురు = నాఁగురు (నాగిని)

# ని

ని = సముచ్చయము (ద్యోతకము)

నింగి = ఆకసము (ఆకాశము, గగనము)

నిండారెను = పూరింపబడెను, అవకాశము లేకుండ ఉండెను

నిండెను = నీరు మొదలగువానిచే పూరింపబడెను [పూర్ణమయ్యెను]

నింపిరి = మాలిన్యము మలము;

నికరము = తెఱము (శ్రేష్ఠము)

నిక్కము = నిజము (సత్యము)

నిక్కల = నిజ మగుకల (నిశ్చయార్థకము)

నిక్కపుకు = మోసము లేమి (నిష్కపటము)

నిక్కు = కులుకు (విలాసము)

నిక్కువము = నిక్కము

నిక్కువీనలజక్కి = తెల్లవాజి (ఉచ్చైశ్శ్రవము)

నివురు = కట్టెనిప్పుమీఁది తెల్లనిపూఁత; బూడిద (భస్మము)

నిగ్గు = తళుకు (కిరణము)

నిచ్చ = ఎల్లప్పుడు; సతంబు [సతతము]

నిచ్చలంబు = సహజముగా శుద్ధమైనది (నిర్మలము)

నిచ్చలు = నిచ్చ

నిచ్చెన = పైకి ఎక్కుటకు అగుసాధనము (నిశ్రేణి)

నిజము = సత్యము

నిట్ట = ఉనికిపట్టు, ఇక్క (స్థానము)

నిబ్బరము = మిక్కుటంబు (అతిశయము)

నిబ్బరికము = కనికరము (కారుణ్యము)

నిమితకాండ్రు = బాణశాలలవలన జీవించుజనము

నిమ్మ = నిమ్మచెట్టు (జంభలము, జంబీరము)

నిమ్మళంబు = కళంకము లేకుండుట (నిష్కళంకతః నిర్దోషత)

నిరుడు = జరిగినసంవత్సరము (పరుత్తు)

నిఱుపేద = మిక్కిలిబీదవాఁడు (అకించనుఁడు; అతిదరిద్రుఁడు)

నిలిపెను = అరికట్టెను; అడ్డుపెట్టెను [వారణముఁజేసెను]

నిలువు = చేయి పైకి ఎత్తి నిలిచి ఉన్నపురుషుని ప్రమాణము (పౌరుషము)

నిల్కడ = నీతివేదుల [త్రివర్గములోని] స్థానము

నివాళి = ఆరతి; హారతి (నీరాజనము)

నివిరెను = చేతితో దువ్వెను; నిమిరెను

నివ్వటిల్లెను = నిండారెను; అవకాశము లేకుండ జలాదులతో ఉండెను

నివ్వెఱ = మిక్కిలి ఆశ్చర్యము (నిర్భరాశ్చర్యము)

నిసుఁగు = కూన; పసుపక్ష్యాదులపిల్ల (తిర్యగర్భకము)

నిసువు = నిసుఁగు

## నీ

నీచు = చెడుగు (మూర్ఖుఁడు; దుశ్శీలుఁడు)

నీరెండ = ఈరెండ: కొంచెపు ఎండ
(కించిదాతపము)

నీరెత్తువంగ = నీరువంగ

నీరొట్టు = ఒకభక్ష్యము

నీర్చిచ్చు = బడబాగ్ని

నీర్చిచ్చువాడు = ఒకవిధ మగులనుముకపిట్ట (టిట్టిభవిశేషము)

నీర్వట్టు = దప్పి (దాహము, పిపాస)

నీఱు = నుసుఱు, బూడిద

నీలాలి = రెండువస్త్రములు వెలిగించుటకు రెండుముఖ
భాగములు గలదీపపాత్రి (ద్విముఖదీపిక)

నీలి = నల్లనిరంగు గలవస్త్రము (నీలవస్త్రము)

నీలి = సాము చేయుటకై త్రిప్పెడి యొకపరికరము

నీల్గు = ఒడలు విఱుచుట (గాత్రవినామము)

నీల్గుట = చెల్గుట; త్రెళ్లుట: చావు (మరణము)

నీల్గెను = చచ్చెను; చనెను

నీళ్లచివచి = నీరాడు: నీళ్లు కాచెడికాగు (అలంజరము)

# ను

ను = చార్థము; సముచ్చయము

నుంకు = నిప్పస్తు (ఉపవాసము)

నుగ్గాడెను = చంపెను; త్రుంచెను (వధించెను)

నుగ్గు = చూఱు; పొడి (చూర్ణము)

నుడి = [వాక్యములోని] పదము; వాగుద్ధము

నుడికారము = నుడి

నుడివెను = ఆడెను; అనెను (పలికెను)

నుడుపు = నుడి

నుడువు = నుడి

నుదురు = నొసలు (ఫాలము)

నునుపు = చిక్కనై నున్ననైనది (శ్లక్ష్ణము)

నున్నన = నునుపు

నున్ననిది = నునుపు

నురుగు = సముద్రాదులనురువు (ఫేనము)

నుర్వు = నురుగు

నులుపుడు = నులిపిడి; కాళ్లలో నరము ప్రక్కనకండల
నలుగుట (కణిశోచగార్ద్ణము)

నులుమాడెను = పెగటార్చెను (వధించెను)

నులుము = నగ్గు, పొడుము

నులుముఁ జేసెను = నులుమాడెను

నులక = నార పేనినదారము (త్వక్సూత్రము)

నులిచెను = నులుముఁ జేసెను (వధించెను)

నుఁతడ = బాలతేన (పాపాబల)

నులిమెను = నలిచెను

నులివెచ్చ = లనివెచ్చ; కొంచెము వెచ్చనైనది
(కదుష్ణము)

నువ్వుచేను = నువ్వులు పండుపొలము (తిల్యము)

# నూ

నూగారు = ఆడు: నాభిపై నుండురోమములపంక్తి (రోమరాజి)

నూకలు = బియ్యము మొదలగువాని కణములు (ధాన్యశకలములు)

నూదోస = నూగుదోస; ఒకజాతిదోస (వాలుకము)

నూనె = నువ్వులచమురు (తైలము)

నూనెముంత = ముత్తవచెట్టుయొక్కభేదము (కుప్పాల)

నూనెముడి = ఒకవిధమగు కేశముడి (కేశబంధవిశేషము)

నూయి = చేదుడుబావి (కూపము)

నూఱు = పదిపదులు (శతము)

నూలిగంను = బొట్టతెల (ఇంద్రలుప్తకము)

నూలు = దారము (సూత్రము; తంతుసంతతి)

నూల్కొనెను = ఇయ్యకొనెను (సమ్మతించెను)

నూవు = నువ్వుపైరు (తిలసస్యము)

# నె

నెంజిలి = అంగలార్పు (మనోవ్యథ)

నెగడు = నీటివయ్యము (జలగ్రహము)

నెగడెను = ప్రసిద్ధి చెందెను [ఖ్యాతి మయ్యెను]

నెగులు = గాసి (బాధ)

నెగ్గడము = దట్టము (సాంద్రము)

నెచ్చెలి = చెలికాడు (మిత్రుడు)

నెట్టము = నెమిలి ఈకలచే చేసిన సారెములపాగా
[నెమిలియీకలతలపాగా]

నెట్టు = నాశనము, తావు - [వినాశస్థానము]

నెత్తపుబలక = చదరంగపుబలక (అష్టాపదము)

నెత్తము = విశాల మగుకొండమీదిసమప్రదేశము
(ప్రస్థము)

నెత్తము = జూదము; పాచికలాట (ద్యూతము)

నెత్తమ్ములు = పద్మములు, కొండలపై
నుండెడివిశాలసమప్రదేశములు, జూదములు

నెత్తిబులు = తెమలు; కడుపుమీదిముడుతలు (వళులు)

నెత్తి = తల (శిరస్సు)

నెత్తురు = నెత్తు (రక్తము)

నెత్రు = నెత్తురు

నెనరు = నెయ్యము (ప్రేమము)

నెపము = సాకు (వ్యాజము; అపదేశము)

నెప్పు = నెలవు (నివాసము; స్థానము)

నెమకుడు = తడవుడు; వెతకుట (అన్వేషణము)

నెమకెను = అరసెను; వెదకెను (అన్వేషించెను)

నెమరు = పశువులు నమలి తిన్నఆహారమును నోటికి
తెచ్చుకొని మరల బాగుగా నమలుట
(రోమంథము)

నెమలియడుగుమాను = పూతికరంజము

నెమిలి = నెట్టువపిట్ట (మయూరము)

నెమిలిఁ బజుగొన్నమగఁడు = కొమరుఁడు (కుమారస్వామి; షడాననుఁడు)

నెమ్మది = సంతుమనసు (సుహృదయము)

నెమ్మది = ఏవిచారము లేక ఉండుట (నిశ్చింత)

నెమ్మి = కూరిమి (ప్రేమము)

నెమ్మి = నెమిలి (కేకి)

నెమ్మి = బండిచక్రముచుట్టు వేయఁబడుకట్టు (నేమి)

నెమ్మి = చెలిమి (మిత్త్రభావము; స్నేహము)

నెమ్మి = నెమిలి, స్నేహము

నెమ్మి = వంజులవృక్షము (నేమి)

నెమ్మిలిపడుఁజు = రాజాపడుఁజు, బగ్గామణిఁ కికోక

నెమ్ము = నెమ్మి; చక్రముచుట్టు వేయుచుండుకట్టు (నేమి)

నెమ్ములు = ఎముకలు, నవిల్లు

నెమ్మేను = ఒడలు (శరీరము)

నెయ్యమి = చెలిమి, మక్కువ; కూరిమి (ప్రేమము)

నెయ్యమి = చెల్మి (స్నేహము)

నెయ్యము = నెయ్యమి (ప్రేమము)

నెయ్యము = చుట్టము (మిత్త్రము)

నెయ్యి = వెన్న కాఁచి కరంగించఁగా అయినది (ఘృతము)

నెయ్యుఁడు = నెచ్చెలి (మిత్రుఁడు)

నెరక = ఎముక (అస్థి)

నెరపు = ఒకవిధమైనయిసుక (ఒకతాఘేదము)

నెరక = తెలనెంట్రుక (కేశము)

నెఱతనము = ప్రాజ్ఞత, ఆభోగము

నెసరి = సింహము, ప్రాజ్ఞోపమానము

నెఱసెను = ఒలసెను [వ్యాపించెను]

నెఱి = నెఱుక (కేశము)

నెరి = ఒకవిధమైనగట్టిమసెలి; పించె
(కచ్ఛభేదము)

నెరి – గొప్పకాంతి, చిఱుగడ్డ, వక్రము

నెరిక = నెరి (కచ్ఛభేదము)

నెల = జాబిలి (చంద్రుఁడు)

నెల = చంద్రుఁడు, మాసము

నెలకొనెను = కుదురుపడెను; కదలకుండ దృఢముగా
ఉండెను

నెలఁత = చెలువ (స్త్రీ)

నెలఁతుక = నెలఁత

నెలయల్లుఁడు = మరుఁడు (స్మరుఁడు; మన్మథుఁడు)

నెలవత్తి = పోఁకపలుకులు (పూగభాగములు)

నెలవు = ఉంకి (నివాసము; స్థానము)

నెల్లి = ఒకవిధమైనకూరాకుచెట్టు (అగ్నిమంథము)

నైవము = నెపము (వ్యాజము; అపదేశము)

నేరెడు = జంబూవు

నేరేడు = నేరెడు

నేర్పరి = జాణ (సమర్థుఁడు)

నేల = భూమి; పృథివి

నేలగుమ్మడి = విదారి; భూమికూష్మాండము

నేలతాడి = తాలమూలిక; ముసలి

నేలతామర = మెట్టతామర (స్థలపద్మము)

నేలనేరేడు = నక్కనేరేడు (భూజంబువు)

నేలపల్లటి = ఒకవిధమైనపావురము
(పారావతవిశేషము)

నేలపొన్న = నక్కతోఁకపొన్న (క్రోష్టువిన్న)

నేలమాఱె = భూమిలోపలియిల్లు (భూమ్యంతరాలయము)

నేలముఁక = రాములక (గృహాతి)

నేలయుడుప = పాఁపజగము (పాతాళలోకము)

నేలయుసిరిక = భూధాత్రి

నేలవేము = భూనింబ

నేవళము = గొలుసు; మెడను వ్రేలాడుహారము లో
నగునది (లలంతికావిశేషము)

నేస్తకాఁడు = చెలి (మిత్త్రుఁడు)

నేస్తము = నెయ్యము (ప్రేమము)

నేస్తము = చెలిమి (మిత్త్రభావము: మైత్త్రి;
స్నేహము)

# నొ

నొంచువాఁడు = ఇతరులను బాధించుస్వభావము కలవాఁడు (ఘాతకుఁడు హింసాశీలుఁడు)

నొగ = కాఁడికి ఆధారముగా బండి మొద లగువాని మొదట ఉండెడినిడుపాటికఱ్ఱ (యుగంధరము)

నొగులు = బాధ (వ్యథ బాధ)

నొడి = నుడి, వాక్యము, మాట (పదము)

నొడికారము = నొడి

నొడుగు = నుడువు నొడి

నొడువు = నొడి

నొప్పి = నొగులు

నొవ్వి = నొగులు

నొసలు = నుదురు (లలాటము, ఫాలము)

# నో

నోనాడెను = నొవ్వఁబలికెను బాధపడునట్లు మాటాడెను

నోయ = వస్త్రము, వదినగుహ

నోవి = నొగులు

# ప

పంగ చెట్టుమొదటికొమ్మ (స్కంధశాఖ)

పంగము = కొంకి; పిస్తు (భాగధేయము; కరము)

పంగిడి = ఓదము; ఏనుఁగును పట్టుటకై చేయఁబడినగోయి మొదలగునది (వారి)

పంగెర = పంగిడి

పంచ = ఇంటిప్రక్కలను ఉండుస్థలము (మందిరనికటము)

పంచకము = గుఱ్ఱముయొక్క వెనుకభాగము (అశ్వపశ్చాత్ప్రదేశము)

పంచదార = మెత్తనిచక్కెర (శర్కర)

పంచె = ఒల్లె; మగవారిపైబట్ట (ఊర్ధ్వవస్త్రము; ఉత్తరీయము)

పంచెను = అంకించెను; పంపెను

పంతి = పంగము; పన్ను; సిస్తు

పంజు = గుడ్డలు చుట్టి వెలిఁగించి పట్టుకొనెడి చేతిదీపము; దివ్వటి (కరదీపిక)

పంజులకమ్మ = రత్నములు పొదిగిన చెవికమ్మ (రత్నతాటంకము)

పంట = వ్యవసాయమునకైనప్రూనిక (కృషిసన్నాహము)

పంటి = చప్పున నీరు గ్రహించి తెచ్చుటకు అనుకూలమైనపాత్ర (అతిజవగ్రాహ్య జలానయనార్హభాండము)

పంటె = సాలెవాఁడు నూలు చుట్టెడియొకదినుసు పనిముట్టు (తంతువేష్టనసాధనము)

| | | |
|---|---|---|
| పఱ్ఱంటకోల | = | పంట |
| పండినది | = | ఫలించినచెట్టు లోనగునది (ఫలితము) |
| పండించెను | = | కికురించెను; మోసముచేసెను (వంచించెను) |
| పండు | = | ఫలము |
| పండుగ | = | పండుగు (ఉత్సవము) |
| పండువ | = | పండుగ; పండువు |
| పండెను | = | పరుండెను; పండుకొనెను (శయనించెను) |
| పంతము | = | ప్రతిన; ఏదేనియొకపని తప్పక చేసెద నని పలుకుట (ప్రతిజ్ఞ) |
| పంద | = | దూబ (నపుంసకుఁడు; షంఢుఁడు) |
| పంద | = | కోఁచ; పిఱికివాఁడు (భీరుఁడు) |
| పంది | = | ఏకలము (వరాహము) |
| పందికొక్కు | = | కొక్కు; పందివలె ఉండునొకజాతియెలుక (మూషికము) |
| పందిరి | = | గుంజలు నాటి మీఁద కొయ్యలు కట్టి తాటాకులు లోనగునవి కప్పినది (కాయమానము) |
| పందిలి | = | పందిరి |
| పంది్మము | = | పదిభూములు (దశాఫకి) |
| పందెకాఁడు | = | జూదరి; జూద మాడువాఁడు (ద్యూతకారుఁడు) |
| పందెము | = | జాదము లోనగువానియందు పంతమాడి పెట్టెడుధనాదికము (పణము) |

పంపించెను = పంచెను; అంపెను

పంపు = భాగము; విభాగము

పంపు = పసులమారణాదుల కగుమంత్రతంత్రక్రియ (ప్రయోగము: అభిచారము)

పండెను = పండించెను

పంబ = ఒకవిధ మగుచర్మవాద్యము (పణవము)

పక్క = ఱెక్క (పక్షము; బాహువు)

పక్కము = చుట్టము; చెలి (మిత్త్రుడు)

పక్కి = పక్షి [పక్షిసామాన్యము]

పక్కియ = పక్క: ఱెక్క [బాహువు]

పచ్చ = ముసలి; ఏండ్లు చెల్లినవాడు (వృద్ధుడు)

పచ్చు = బాగుగా ఎండిపోయినమోడు

పచ్చెర = గుఱ్ఱముయొక్క అంగీ (అశ్వతనుత్రాణము)

పగ = కంటు (విద్వేషము; ద్వేషాతిశయము) [తీఱనిశత్రుత్వము]

పగ = కంటు (విరోధము; వైరము)

పగటిది = పగటియందు చేయదగినకర్మము (ఆహ్నికము)

పగటు = పగ (వైరము)

పగడంపుఁబిట్ట = ఒకపక్షి

పగడ = జూదమునందు ఉపయోగించు 'ఒకటి' అను సంఖ్య

పగడము = పవడము; మణివిశేషము (ప్రవాళము)

పగడసాల = స్నేహితులు కలసి ఆడెడిద్యూతము (ఇష్టజనద్యూతము)

పగతుఁడు = గొంగ (శత్రువు; వైరి)

పగదెంచెను = చంపెను (వధించెను)

పగ యీఁగుట = పగ తీర్చుకొనుట (వైరశుద్ధి)

పగఱ = పగతుఁడు

పగలు = దినము; అహము

పగలు = ద్వేషము, దినము

పగవాఁడు = పగఱ; పగతుఁడు (శత్రువు)

పగిది = పన్ను (కరము; భాగధేయము)

పగిది = చందము (ప్రకారము; విధము)

పగిలెను = బ్రద్దలాయెను, విరిగెను

పగులుడు = రోగమువలన దేహమునందు కలిగెడిపగులు (స్ఫోటము)

పగ్గము = కట్లెము లో నగువానియందు తోల్చి ఈడ్చిపట్టెడిత్రాడు (ప్రగ్రహము)

పచ్చ = పసిమి; ఆకుపచ్చనివన్నె (పీతవర్ణము; హరితవర్ణము)

పచ్చ = ఆకుపచ్చనిరతనము (మరకతము)

పచ్చకప్పురు = వడ్లలోనిభేదము (వ్రీహివిశేషము)

పచ్చగుఱ్ఱములతోడు = తమ్మిచుట్టము (సూర్యుఁడు; హరిదశ్వుఁడు)

పచ్చడము = కప్పుకొనుటకు; పఱచుకొనుటకు ఉపయోగించెడిదుప్పటి (ప్రచ్ఛదపటము)

పచ్చడి = భక్ష్యద్రవ్యములకు ఉపకరించెడి వ్యంజన విశేషము (ఉపదంశము)

పచ్చతామర = నేలతామర; మెట్టతామర (స్థలపద్మము)

పచ్చన = పచ్చ; ఆకుపచ్చనివన్నె (పీతవర్ణము; హరితవర్ణము)

పచ్చపిట్ట = పసుపువన్నె రెక్కలు గలయొకజాతిపక్షి. (హారితకము)

పచ్చవిల్తుడు = నెఱజల్లుడు (మన్మథుడు; స్మరుడు)

పచ్చిక = లేఁతగడ్డి (బాలతృణము)

పజ్జ = దగ్గఱ, ఒద్ద (నికటము; సమీపము)

పటికము = స్ఫటికము; మణివిశేషము

పటుతాళించెను = భయాదులచే చలనము కలిగినట్లు ఆదిక్కు ఈదిక్కు చూచెను

పట్ట = తోలు; చెట్టుపట్ట (త్వక్కు)

పట్టపగలు = మధ్యాహ్నము

పట్టించెను = గంధాదులను శరీరమునకు రాచెను; అలమెను

పట్టు = నెలవు (నివాసము; స్థానము)

పట్టుచీర = పట్టుతో నేసినవస్త్రము; పట్టుబట్ట (పట్టాంశుకము)

పట్టువడియెను = తగులువడియెను; చిక్కెను [గృహీత మయ్యెను]

పట్టుసాలెవాఁడు = నేతనేయువారిలో ఒకజాతివాఁడు (తంతువాయవిశేషము)

పట్టె = మంచపుఁబట్టె (పట్టిక)
పట్టెడ = దాకలి; లోహములు సాఁగఁగొట్టుటకు ఆధారముగా ఉంచుకొనెడియినుపదిమ్మె (లోహసంతాడనాధారము; నిఘాతిక)
పట్టెఁడు = ఏకముగా వంపఁబడినవ్రేళ్లు గలచేయి పట్టిలి. దానిపరిమాణము కలది
పట్టెమంచంబు = నవారు అల్లినమంచము (మృదులఖట్వా)
పట్టెమార్పు = పలురంగులు గలయొకవస్త్రము (చిత్రవస్త్రవిశేషము)
పట్టెము = రెండువైపుల పదునైనఅంచు గలపెద్దకత్తి; అడ్డకత్తి (పట్టసము)
పట్ర = ఒకజాతిబోయ (కిరాతభేదము)
పడఁకు = చఱియ; తిరుగుటకు వీలు కానిపర్వతశిఖరము క్రిందిచోటు (ప్రపాతము; భృగువు)
పడఁతి = కొలఁతి (స్త్రీ)
పడఁతుక = పడఁతి
పడక = పాన్పు; పవ్వళింపు (శయనము)
పడగ = పడిగె; పాముపడగ (స్ఫట)
పడగ = టెక్కెము; జెండా (కేతువు; ధ్వజము)
పడగ = టెక్కెము, సర్పముపడగ
పడగడాలుపు = పాము (సర్పము)
పడత = నాఁగలివెనుకభాగము [చివరిభాగము] మేడికోలకాక మిగిలిననాఁగలి (లాంగలపృష్ఠము)

| | | |
|---|---|---|
| పడమటికొండ | = | క్రుంకుగొండ (అస్తాద్రి) |
| పడమటివంకఱేడు | = | వరుణుడు [పశ్చిమదిగధిపతి] |
| పడమర | = | పడమరదిక్కు (ప్రత్యక్కు) |
| పడము | = | అందమైనవస్త్రము (పటము) |
| పడవ | = | చిన్ననౌక (అల్పతరణి) |
| పడవ | = | ద్వంద్వయుద్ధము చేయువారు పోరాడెడి యుద్ధభూమి (ద్వంద్వయుద్ధావని) |
| పడవాలు | = | దళవాయి (సేనాధిపతి) |
| పడవాళ్లు | = | పడవాలు |
| పడాలు | = | పడవాలు |
| పడి | = | త్రవ్వ; మానికలోనిసగము (కుడుపార్ధము) |
| పడిగ | = | ఏటిదగ్గఱ ఉండుభూమి (నదీప్రాంతభూమి) |
| పడిగము | = | కాళాంజి; తమ్మ ఉమిసెడిపాత్రము (పతద్గ్రాహిణి) |
| పడిగలు | = | పాముపడగలు, చేనియందు రాలినవరి లోనగువానికంకులు, నదీప్రాంతమందుండుభూములు |
| పడిగె | = | పడగ; పాముపడగ (స్ఫట) |
| పడియ | = | చిన్నసరస్సు (పల్వలము) |
| పడియ | = | పాడె; శవమును తీసికొని పోయెడి ఒకవిధమగు వాహనము (శవయానము) |
| పడివాగె | = | తేజి; మేలుజాతిగుఱ్ఱము (పూజ్యాశ్వము) |
| పడిసెము | = | పీనసము; నాసికారోగము; ప్రతిశ్యాయము |
| పడుండెను | = | పండెను; పండుకొనెను (శయనించెను) |

పడుగు = నేతయందలినిడుపునూలు (ఆతానము)

పడుపడు = చిఱుత (బాలుఁడు)

పడుచుఁదనము = చిన్నఱికము (బాల్యము)

పడుపల = యోధులు జందెమువోలె వేసికొనెడి తోలుపట్టి: డాబ (ప్రాచీనయోధాలంకృతి)

పడుపుది = భోగముది (వేశ్య)

పడువాఁడు = పడెడివాఁడు (పతయాళువు)

పడె = పడియ (పల్వలము)

పడ్డ = నాలుగేండ్లవయసున్న గొడ్డావు (చతుర్హాయణి)

పణఁకు = వణఁకు; చేఱియ (ప్రపాతము)

పణఁతిపడెను = సొంపరాలు పట్టుకొనెను; వారానులచే దవుజెసరాలు బిసికొనెను

పణమ్మ = ముప్పదిరెండువిన్యాసములలో ఒకటి (మల్లబంధవిశేషము)

పణిదము = బెల్లపుపాకము (గుడపాకము)

పడిహారులు = కట్టికలు (వేత్రహస్తులు; దౌవారికులు)

పత్తిరి = ఆకు (పర్ణము; పత్త్రము)

పత్తిరిబొట్టు = ఒకవిధ మగుబొట్టు (తిలకవిశేషము)

పదకము = గొలుసు: మెడయందు వ్రేలాడెడి యొకవిధ మైనహారము లో నగునది (లలంతికావిశేషము)

పదను = దుమ్ము (ధూళి)

పదను = తఱి (కాలము)

| | | |
|---|---|---|
| పదపడి | = | తరువాత (పశ్చాదర్థకము) |
| పదరిము | = | తము రపాకులను పదిలపఱచునది [బంగారాకు మొదలగునది] |
| పదరు | = | త్వరగా చెప్పెడుమాట (త్వరితోక్తి) |
| పదవి | = | కలిమి (ఐశ్వర్యము; భూతి) |
| పది | = | పదియనుసంఖ్య కలది (దశసంఖ్య) |
| పదిలము | = | ఎచ్చరింపు (ఏకాగ్రత, అవధానము) |
| పదుగు | = | కొలము (వంశము) |
| పదునొకొల్తము | = | పదునొకంబుతూములు (ఏకాదశానకి) |
| పదుపు | = | చాలు; వరుస (పంక్తి) |
| పదురు | = | పదుగురు; పదిమందిమనుష్యులు (మనుజదశకము) |
| పద్దు | = | పంతము (ప్రతిజ్ఞ) |
| పన | = | కోసవేసినవరిపైరు (దీర్ఘవ్రీహిసస్యము) |
| పనంటి | = | పంటి, చప్పన నీరు గ్రహించి తెచ్చుటకు అనుకూల మగుపాత్రము (అతిజవగ్రాహ్య జలానయనార్హభాండము) |
| పనస | = | పనసచెట్టు (పనసము) |
| పనిచెను | = | అంపెను; పోవఁజేసెను |
| పని చెఱుపువాఁడు | = | గుజ్జువేలుపు (వినాయకుఁడు) |
| పనివాఁడు | = | జీతము తీసికొనక పని చేయువాఁడు [శిష్యుఁడు-మొ.] (కర్మకారుఁడు) |
| పనుపరి | = | చాలుమాసి; ఒకరికి లోఁబడి వర్తించువాఁడు (పరతంత్రుఁడు) |

పనుపు = సేవ; దాస్యము

పన్న = అరగడము; ముసలి (వృద్ధు)

పన్నము = అట్టములోనియెనిమిదవభాగము (ప్రశ్నము)

పన్నాగము = అందలము లోనగువానిగట్టము
(ఆందోళికాద్యవయవము)

పన్నిక = పన్నుట [వ్యూహాది నిర్మాణము]

పన్నిదంబు = పందెము; పంతమాడి పెట్టుధనాదికము
(గ్లహము)

పన్నిద్దుము = పండ్రెండుతూములు (ద్వాదశ ఖారి)

పన్నిల్లము = పండ్రెండుపలములు (ద్వాదశపలి)

పన్నీరు = ఒకవిధ మగుపరిమళోదకము
(హిమాంబువు; పన్నీరము)

పన్ను = ప్రజ ల రాజునకు చెల్లింపవలయునధనాది
భాగము; అప్పనము (భాగధేయము)

పన్నుండెను = పరుండెను; పండుకొనెను (శయనించెను)

పప్పళి = ఒకవిధ మగురంగులవస్త్రము
(చిత్రవస్త్రవిశేషము)

పప్పు = పొట్టు పోయి బద్దలైనకాయధాన్యము
(సూపము)

పబ్బము = పండుగ (ఉత్సవము)

పయంట = పైఁట; ఆడువారిపైబట్ట
(కాంతోత్తరీయము)

పయిఁట = పయంట

పయిఁడి = బంగారు (సువర్ణము; కాంచనము)

పయిని = మీఁద: మీఁదిప్రదేశము (ఊర్ధ్వము)

పయిరు = వరిపైరు మొదలైనపంట (సస్యము)

పయిరు = నివ్వరిధాన్యము (సస్యము)

పయ్య = మెలుపు ఎక్కువగా ఉన్నయెలుపు (పాటవము)

పయ్యంట = పయంట

పయ్యెర = తెమ్మెర (మలయమారుతము)

పయ్యెద = పయంట

పంట = విప్పుడుక; పెఱుపిడుక; నేలఁ బడె యెండ యెఱుఁగు వడి పేఁడకడి (కరీషము)

పరంటె = నూలు చుట్టెడి యొకపనిముట్టు; పంటుకోల; పంటె (తంతువేష్టనసాధనము)

పర = పొర; కంటిజబ్బు (పటలము)

పరక = సూకలోనియెనిమిదవభాగము; రెండుపీసములు

పరఁగెను = తనరెను; ఒప్పెను; రాణించెను

పరవి = కొద్దిదినములు వాడుకొనుటకై అడిగి తెచ్చుకొనెడిసొమ్ము; ఎరవు (యాచితకము)

పరదా = బురకా: పెద్దముసుఁగు (ప్రావరణము)

పరము = కాఁడినగానిని బండి మొదలగువానిమొదట ఉండెడినిడుపాటిమానికి కట్టెడిప్రదేశము (కూబరము)

పరాకు = ఏమఱిపాటు (ప్రమాదము)

పరిక = ఒకపక్షి (పక్షివిశేషము)

పరికి = ఒకజాతిబోయవాఁడు (కిరాతభేదము)

పరికించెను = అరసెను; వెదకెను (అన్వేషించెను)

పరిగొనెను = చుట్టెను (వేష్టించెను)

పరిభవిల్లెను = పంఁగెను

పరిది = గుడి; వరదగుడి (పరివేషము)

పరిపరి = చింపఱవంపఱ: ముక్కలుముక్కలు (కణశోఽవస్థము)

పరిమార్చెను = త్రుంచెను; చంపెను (వధించెను)

పరిమార్పు = చంపుట: కొట్టి తిట్టి గాసించి చంపుట (హింస)

పరుంజు = నెమ్మిలిపరుఁజు; కత్తిపిడి చివరిప్రదేశము (ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము)

పరుండెను = పరుండెను; పండుకొనెను

పరుఁజు = పరుంజు

పరుగు = పరుగెత్తుట (ధావనము. శీఘ్రగమనము)

వరువడి = వరుస (క్రమము; ఆనుపూర్వి)

పరువు = పరుగు

పరువునేల = కోసు (క్రోశము)

పరువెత్తెను = శీఘ్రముగా నడచెను; పాఱెను

పరుస = తిరునాళ్లకై తిరిగెడిజనసమూహము (తైర్థికసభ)

పరుసన = కఱకు (నిష్ఠురము: పరుషవాక్యము)

పరుసు = పరుసన

పర్వెను = వలసెను (వ్యాపించెను)

పఱగడ = గ్రామనగరాదులసమీపస్థానము (పరిసరము)

పఱపుట = పశ్వాదులను తోలుట (విద్రావణము)

పఱచెను = పరుగెత్తెను

పఱవ = పఱద (ప్రవాహము)

పఱతి = పఱతె

పఱద = పఱతి

పఱపు = తలిమము; పఱుపు (శయ్య)

పఱవ = పఱతి

పఱి = కొల్ల మొదలయినదేశోపద్రవము (డామరము)

పఱిగ = రెండుసూరులవిత్తనములు విత్తుటకు వీలైనపొలము (ద్వ్యక్షి)

పఱియ = తునక (శకలము)

పఱివోయెను = చెదరెను, చెడెను

పఱపు = పాన్పు, విరివి - [విస్తారము]

పట్టె = పఱియ

పల్లకంబాఱెను = తెల్లనయ్యెను; తెల్లబాఱెను; పాలిపోయెను [వివర్ణమాయెను]

పలక = కూర్చుండుటకై అమర్చిన యెత్తగు కొయ్యపీట (ఫలక)

పలక = డాలువంటి యొక ఆయుధము (ఫలకము; ఆయుధవిశేషము)

పలపల = పలుచన; పలుచగా ఉండునది (విరళము)

పలము = రెండుకర్షములు [పలములో నాలుగవభాగము కర్షము]

పలవరింపు = ప్రేలుడు; ప్రయోజనము లేనిమాట (ప్రలాపము)

పలికెను = చెప్పెను; అనెను

పలికెను = అనెను [ద్వికర్మకధాతువు]

పలు = ఒక్కటిగాక పెక్కు అయినది (అనేకము; నానార్థకము)

పలుకమి = మాటలాడకుండుట (మౌనము)

పలుకరింత = మాటలాడించుట (వాచనము)

పలుకు = కఱద (భాషితము)

పలుకు = తునుక, మాట

పలుకుంజెలి = భాషాజలజాక్షి; సరస్వతి

పలుకువెలందిమగండు = నలువ (బ్రహ్మ: వాణీపతి)

పలుకెంపు = మోవి కఱచుటవలనిగాయము (దంతక్షతము)

పలుగంటు = పలుకెంపు

పలుంగు = ఒకదినుసుస్ఫటికము (స్ఫటికభేదము)

పలుంగురాయి = పాలరాయి (పాండుశిల)

పలుగు = నాగటికఱ్ఱు (ఫాలము)

పలుచన = పలపల; పలుచనిది

పలునొక్కు = పలుకెంపు (దంతక్షతము)

పలపట్టది = ఊరిజనము. సామాన్యప్రజ (పౌరశ్రేణి)
పలుపు = పసులమెడలకు తగిలించెడిత్రాడు (సందానము; కంఠరజ్జువు)
పలుమఱు = మాటిమాటికి; చాలతడవలు [ముహుర్ముహుస్సకము]
పలుము = ప్రవరింపు (ప్రలాపము)
పలువ = చెనటి; జాత్యాచారాదులచే నింద్యుఁడు (కుజనుఁడు)
పలువగలు = నానావిధము లైనవి (ఉచ్చావచములు)
పలువితములు = పలువగలు
పల్కుపువ్వు = పెదవి (ఓష్ఠము)
పల్క్రెక్కెను = పండెను [పక్వ మాయెను]
పల్గాకి = పలుగాకి; సంకరజాతివాఁడు (సంకరుఁడు)
పల్ల = పయ్య (పాటలవర్ణము)
పల్ల = ఎక్కునప్పుడు క్రింద మెత్తగా ఉండుటకై గుఱ్ఱముమీఁద వేసెడిగంత; జీను (పల్యాణము)
పల్లకి = మనుష్యులు మోసెడి యొకవిధమగు యానము; పాలకి (పల్యంకిక)
పల్లటము = చోడుము; ఇడుమ (కష్టము)
పల్లటీ = ఒకవిధ మగుపుల్లగటి: గంపె (పుల్లగటివిశేషము)
పల్లటిల్లెను = అంగలార్చెను (దుఃఖపడెను)
పల్లము = నవురు: కొంచెములోఁ తైనది (నిమ్నము)
పల్లిక = వరుగు మొద లగునవి ఎండఁబెట్టెడి ఒకవిధమగుతట్ట; సిబ్బి (ప్రసేవవిశేషము)

పల్లు = పల్లము

పల్లు = పన్ను (దంతము)

పల్లె = చిన్నయూరు (పల్లి)

పల్లెత = మాదిగది (మాతంగి)

పల్లేరు = శ్వదంష్ట్ర

పళ్లెము = తమలపాకులు మున్నగునవి ఉంచుకొనెడి యొకవిధమగుపాత్రము

పళ్లెరము = పళ్లెము (పాత్రము)

పవలు = పగలు (అహము)

పవడము = పగడము (ప్రవాళము)

పవాడము = బిరుదు; రాజాదులనామముద్రచిహ్నము (బిరుదము)

పవ్వ = వెడల్పగుమూతి గలపాత్రము; గంగాళము (తతముఖపాత్రము)

పవ్వళించెను = పండెను (శయనించెను)

పవ్వళింపు = పడక (శయనము)

పస = పరస్పరము చేసుకొనెడియొకజాడలు (సంకేతము)

పస = గొప్పకాంతి (స్ఫురణము)

పసదనము = కైసేత (అలంకరణము; ప్రసాధనము)

పసపస = ఎడతెగక కురియువాన; ముసురు

పసపు = పసుపు; పసుపుమొక్క, పసుపుదుంప (హరిద్ర)

పసరము = పశువు; గోమహిష్యాది

పసరు = ఆకు మొద లగువానిరసము (స్వరసము)

పసరు = వీర్యము [పురుషుని రేతస్సు]

పసరుమొగ్గ = పచ్చిమొగ్గ (కోరకము)

పసి = పసరము

పసి = ఆవు, గాలి

పసిండి = బంగారము (కాంచనము; సువర్ణము)

పసిఁడి = పసిండి

పసిబిడ్డ = చంటివాఁడు (స్తనపాయి)

పసిబిడ్డ = చంటిబిడ్డ, ఆవుదూడ

పసిమి = పచ్చన; ఆకుపచ్చవన్నె (పీతవర్ణము)

పసిమొగ్గ = పసరుమొగ్గ

పసిరిక = పచ్చపిట్ట; పసుపురెక్కలు గల యొకజాతి పక్షి (హారీతకము)

పసిరిక = కామాల; కన్నులు పచ్చనగునొకరోగము కామెర (కామల)

పసిరికపాము = ఎవరికి హాని కలిగింపక పసరువన్నె కలిగి యుండెడియొకపాము (సర్పవిశేషము)

పసుపు = పసపు

పసుపు = కూరలలో ఉపయోగించుటకు, పూసికొనుటకు వాడెడిపసుపుపొడి (హరిద్ర)

పసురు = పసరు (స్వరసము)

పసులకాపరి = గొల్ల, ఆవులను కాచునొకజాతివాఁడు (గోపాలుఁడు)

పసులపోలిగాఁడు = పులిచింత (భరద్వాజపక్షి; వ్యాఘ్రఘాటము; వ్యాఘ్రఘాటము)

పసులు = నాలుగుకాళ్లు గలపశువులు (చతుష్పాత్తులు)

పస్తు = నిప్పస్తు (ఉపవాసము)

పస్సె = పద్య (పాటలవర్ణము)

## పా

పాంశవభూమి = చాలకాలమునుండి దున్నని బీటినేల (చిరాప్రహతము)

పాఁచి = మజ్జిగ చిక్కన చేయునొకతీగె (వారాహి)

పాఁడి = నేయి మొదలగువానికారణము (పయస్యము)

పాఁతర = ధాన్య ముంచుటకై నేలయందు త్రవ్విన యొకవిధమగుపల్లము (ఖాతవిశేషము)

పాఁపజగము = నేలయడుగు (పాతాలము)

పాఁవిసము = పాముయొక్క విషము మొదలగునది (ఆహేయము)

పాఁపఱేఁడు = ఆదిశేషుఁడు; సర్పరాజు

పాఁబెన్న = వధువు పెండ్లింట్లోపలిమూఁడవదినము

పాగ = తలపాగ (ఉష్ణీషము)

పాగా = గుఱ్ఱములగుంపు (అశ్వపంక్తి)

పాగా = గుఱ్ఱపుసాల, తలపాగ

పాకు = పణిదము; బెల్లపుపాకము (గుడపాకము)

పాచనము = గ్రహణి; రోగవిశేషము

పాచిక = పావు; కవడ (పాశకము)

పాట = గానము

పాటకము = బొబ్బలు లేచెడియొకరోగము (స్ఫోటకము)

పాటపాట = కొద్దికొద్ది (అత్యల్పము)

పాటబండి = కొల్లాబండి; ఎద్దులబండి

పాటము = కెంపులు నాణెము చూచుటకు తీసియెంపు (ప్రభ)

పాటి = దీటు (సదృశము)

పాల్లని = చెట్లుకొట్టువి; ఇతరులకు బాధ కలిగించువాడు (ఖలుడు)

పాదగము = ఒకవిధ మగు స్త్రీలకాలినగ (పాదాంగదవిశేషము)

పాడి = తగవు (న్యాయము)

పాడి = పాటి

పాడు = ఒకవిధ మైనదున్ననిభూమి (అప్రహతవిశేషము)

పాడు = కాపురము లేనిగ్రామము (శూన్యగ్రామము)

పాడె = పడియ (శవయానము)

పాడ్యమి = మొదటితిథి (ప్రతిపత్తు)

పాణివడమ్ము = దొనః అమ్ములపొది (తూణీరము)

పాతర = నాట్యమాడుస్త్రీ (నర్తకి)

పాతిక = రూకలో నాల్గవభాగము (పణచతుర్థాంశము)

పాది = పాదు (ఆలవాలము)

పాదిరి = కలిగొట్టు (పాటలి)

పాదొట్టు = చెలఁది; సాలెపురుగు (లూత)

పాన్పు = పఱపు (శయ్య)

పాప = చిఱుత (బాలకుఁడు)

పాప = కంటిపాప (తారకము)

పాప = శిశువు, కంటిపాప

పాపట = రెండుపాయలుగా కేశములు దువ్వి నడుమ ఏర్పఱచినతిన్నని రేఖ (సీమంతము)

పాపటబొట్టు = ఒకవిధమగు స్త్రీల కేశాభరణము (వాలపాశ్యావిశేషము)

పాపటము = మిరెపచేను మున్నగువానిలోని కలుపు పోవుటకై దున్నెడియొక సాధనము (కృషిసాధనవిశేషము)

పాపఁడు = పాప (బాలుఁడు)

పాపోసు = ఒకదినుసుపాదరక్ష (పాదరక్షావిశేషము)

పాయము = ఈడు (వయస్సు; ప్రాయము: బాల్యాది)

పాయము = జవ్వనము (యౌవనము)

పారసి = బంగారుపని చేయువాఁడు; కంసాలి (స్వర్ణకారుఁడు)

పారివాఁడు = సేనయందు రాజాజ్ఞ నెఱవేర్చువాఁడు (పరిచరుఁడు; పరిధిస్థుఁడు)

పాచము = పాచనము (గ్రహణి)

పారువఁజూచెను = చక్కఁగా చూచెను; సూటిగా చూచెను

పారువము = పావురాయి (పారావతము)

పాఱ = భూమిని చెక్కెడి యొక సాధనము (అవదారణము)

పాఱఁజూచెను = దృష్టి చెదరకుండ అగ్గి చూచెను; తప్పక యటు చూచెను

పాఱముష్టి = ముప్పదిరెండువిన్నాణములలో నొకటి (మల్లబంధవిశేషము)

పాఱపాతము = విశాలమైన మొన గలబాణము (విశాలముఖసాయకము)

పాఱుట = పరుగు; పరుగెత్తుట (ధావనము)

పాఱుఁడు = బ్రాహ్మణుఁడు; విప్రుఁడు

పాఱుటు = వెల్లువ (ప్రవాహము)

పాలి = పాలు (భాగము)

పాల = కీరిక

పాల = పాలపిట్ట (కికీదివము)

పాలకొడిసె = శ్వేతకుటజము

పాలపాపఁడు = పాలు త్రాగుశిశువు; పసిబిడ్డ (స్తనపాయి)

పాలవిఱుగు = కూడు: వేఁడిపాలయందు పెరుఁగు చేర్చుటవలనివికారము

పాలవెల్లి = క్షీరసముద్రము

పాలవెల్లి = ఒకదినుసుశాలిధాన్యము, సముద్రము- [పాలసముద్రము]

పాలాసత్రాళ్లు = గుజ్జము లో నగువానిని కట్టెడిత్రాళ్లు (బంధరజ్జువులు)

పాలిక = జాజాలపాలిక (అంకురార్పణశరావము)

పాలిండ్లు = చన్నులు (కుచములు)

పాలు = క్షీరము

పాలు = క్షీరము, భాగము

పాలుడు = శరీరము తెల్లబడెడియొకరోగము (పాండువు)

పాశె = జూదమాడెడిపలక (శారిఫలము)

పాశెము = సేన దిగియుండుచోటు (నివేశము)

పావకోళ్లు = పావలు (పాదుకలు)

పావడ = పరికిణి (మోహాంతరీయము)

పావలు = పావకోళ్లు; కొయ్యతో చేసినపాదరక్షలు

పావాలు = పావలు; పావకోళ్లు

పావిలి = చిన్నజాతిగోళి [కూరిమొక్క] (గోళీభేదము)

పావు = దీనారము [వరా] లోనినాలుగవభాగము (పాదదీనారము)

పావురము = పారువము (పారావతము; కపోతము)

పావురాపల్కులు = కూకీపల్కులు (మణితము)

పావురాయి = పావురము

పాసెను = వీడెను, విడిచిపోయెను

# పి

పింగాణీ = కుప్పె: గాజుతో చేసినపాత్ర (కాచకృతచషకము)

పింజ = బాణముక్రిందిచివర (పుంఖము)

పింజారి = తురకలలోనియొకజాతివాఁడు; దూదేకువాఁడు

పింజె = కుచ్చె (కచ్ఛభేదము)

పిండి = బియ్యము లో నగువానిపొడి (పిష్టకము)

పిండికొండ = కొండపిండి (నగభేది)

పిండివంట = అన్నిభక్ష్యములు (భక్ష్యసామాన్యము)

పిండు = గుంపు (వర్గము)

పిందె = పచ్చికాయ (బాలశలాటువు)

పికిలి = ఒకపక్షి (పక్షివిశేషము)

పిక్క = చిఱుదొడ (జంఘ)

పిక్కు = జుడుగు: మోసము

పిగిలెను = చినిఁగెను; బిగువుచే వస్త్రాదులు చీలెను

పిచ్చి = ఉమ్మాదము; వెఱ్ఱి (ఉన్మాదము)

పిచ్చి = పైత్త్యము; పిత్తము

పిచ్చుక = పిచ్చిక (చటకము)

పిచ్చుకరాలు = ఒకవిధ మగుగడ్డి; పర్పాటకము [తృణవిశేషము: పర్పటము]

పిచ్చె = చింతపండులోనిగింజ (చించాబీజము)

పిట్ట = పక్కి (పక్షి సామాన్యము)

పిట్ట = గడ్డ (లోష్టము)

పిట్టు = ఉడుకఁబెట్టినపిండి (పిష్టము)

పిడి = గుప్పిలి; ముడువఁబడినవ్రేళ్లు గలఅఱచేయి (ముష్టి)

పిడి = తక్కువమూర; చాఁచినచిటికెనవ్రేలు గలపిడికిలితోఁ గూడినమూర (అరత్ని)

పిడి = పిడికిటితో పట్టుకొనుఖడ్గాదులయొక్క భాగము (త్సరువు)

పిడికిటికట్టు = ధనుస్సుయొక్క నడిమిప్రదేశము (లస్తకము)

పిడికిలి = పిడి: గుప్పిలి (ముష్టి)

పిడిసాన = కొయ్యలకు రత్నములకు బెజ్జము వేయుటకు ఉపయోగపడునొకపనిముట్టు (వేధనిక)

పిడుఁజు = పసులనెత్తురు పీల్చెడియొకజాతిజంతువు (గోమారి)

పిడుఁదు = పిడుఁజు

పిడుక = ఆవుపేఁడపిడుక; పిసికి పిడుచగా చేసి తట్టి ఎండఁబెట్టిన ఆవుపేఁడ (గోమయపిష్టము)

పిడుగు = మేఘములరాయిడిచే కలిగెడి తేజఃఖండము (అశని)

పిడుచ = అన్నపుముద్ద (పిండము)

పిడుత = పిడికెఁడుకొలత కలకుండ (ముష్టిమానభాండము)

| | | |
|---|---|---|
| పిడెంబు | = | చిన్నకత్తి; కటారి (కరాళి) |
| పిఱుఁజు | = | పిడుఁజు |
| పిత్తడి | = | ఇత్తడి; ఒకలోహము (ఆరకూటము) |
| పిదప | = | తర్వాత (అనంతరము) |
| పిన్న | = | చిన్న (బాలకుఁడు) |
| పిన్నపాఁపర | = | వారుణి |
| పిన్నపాల | = | పాలకూరచెట్టు (జీవంతిక) |
| పిన్నములక | = | వాఁకుడు (బృహతి) |
| పిన్నటికము | = | పడుచుఁదనము (బాల్యము) |
| పిప్పి | = | బాగుగా పిసికి నీరు పిండివేసినధాన్యపుపొట్టు (నిష్పిష్టతమము) |
| పిమ్మట | = | తర్వాత (పశ్చాదర్థము) |
| పిరంగి | = | కరవాలు (ఖడ్గము) |
| పిరి | = | పురి; కొన్నిదారపుపోఁచలు కలిపి దారముగా ఒనర్చుటకై వానిని పేనుటవలనిగట్టితనము (సూత్రకరణవేష్టదము) |
| పిఱికి | = | కోఁచ; భయపడువాఁడు |
| పిఱుదివిచెను | = | వెనుదీసెను; వెనుకకు పోయెను |
| పిఱుఁదు | = | మొలకు వెనుకటిభాగము (నితంబము) |
| పిలుకుమార్చెను | = | నఱుమాడెను; చంపెను |
| పిలుపు | = | పిలుచుట; చీరుడు (ఆహ్వానము) |
| పిల్కుమార్పు | = | చంపుట; కొట్టి తిట్టి బాధించి చంపుట (హింస) |

పిల్ల = కొదమ; పశుపక్ష్యాదులకూన (తిర్యగర్భకము)

పిల్లనగ్రోవి = వేణువు; వంశనాళము

పిల్లపీఁచర = శతావరి

పిల్లపెసర = కాకిపెసర (కాకముద్గము) ['పిల్లిపెసర' వ్య]

పిల్లాణి = కాలివ్రేళ్లకు ధరించునొకసొమ్ము: కాలినాల్గవ్రేలికి పెట్టునగ (పదాంగుళీభూష)

పిల్లి = మార్జాలము; బిడాలము

పిల్లిగడ్డ = చట్టము; పునుఁగుపిల్లిశరీరమందు పునుఁగు ఉండుతిత్తి (బిడాలకము)

పిల్లారి = పని చెఱుపువాఁడు (వినాయకుఁడు)

పిసరు = పిప్పి

పిసాలి = అవివేకి; మూఢుఁడు

## పీ

పీఁచ మడఁచెను = చంపెను; పరిమార్చెను

పీఁచము = బల్మి (శక్తి)

పీఁచర = పిల్లపీఁచర (శతావరి)

పీఁట = గద్దియ; ఎత్తైనపీఁట (పీఠము)

పీనుంగు = ప్రాణము లేనిబొంది (శవము)

పీరంగి = (అగ్నిప్రసారణము)

పిలికాఁడు = ఓడవాఁడు; ఓడ నడుపువాఁడు (నావికుఁడు)

పిచెను = పిగిలెను; చినిఁగెను

పిత్రెను = జుర్రెను; చప్పుడు కాకుండ త్రాగెను (ఆస్వాదించెను)

## పు

పుంగుడు = ఇరియమువోలె శరీరమునందు లేచెడిదుర్మాంసము; పులిపిరికాయ (అల్పగ్రంథి)

పుంజము = అఱువదిపోఁగులు గలదారము (షష్టితంతువు)

పుంజు = మగకోడి (కుక్కుటము)

పుంట = ప్రాఁట; ప్రొద్దు పొడుచుటకు ముందు ఐదుగడియలవఱకును, ప్రొద్దు గ్రుంకినవెనుక మూఁడుగడియలవఱకును గలకాలము (సంధ్య)

పుండు = వ్రణము

పుక్క = నీటితో నింపినబుగ్గ (గండూషము)

పుక్కిలి = పుక్క

పుచ్చ = కళింగము

పుచ్చడీక = నాన; సిగ్గు (లజ్జ), సిగ్గరి (లజ్జావంతుఁడు)

పుచ్చె = కప్పెర; తలచిప్పయెముక (కపాలము; కరోటి)

పుచ్చెను = పోవఁజేసెను; అంపించెను

పుటముల్ = ఒకవిధ మగుసాము (మల్లవిద్యాభేదము)

పుటమ్ము = తూము; జలదారి; నీరు బయటికి పోవుద్వారము

పుటిక = చిన్నగంప (పిటకము)

పుట్ట = వల్మీకము

పుట్టకాలివాఁడు = పుట్టవలె దుర్మాంసము పెరిఁగినకాలు కలవాఁడు (వల్మీకపాదుఁడు)

పుట్టకొక్కు = తెల్లగా మొగ్గయట్లు భూమియందు మొలచెడి మెత్తనిమొలక (భూస్ఫోట)

పుట్టవంబ = ఒకజాతితమ్మితీగె (వల్మీకశింబి)

పుట్టము = చీర; వస్త్రము

పుట్టి = అరిగోలు; గంపవలె ఉండి నదిని దాఁటుటకు ఉపయోగపడు ఒకసాధనము (కోలము)

పుట్టి = పుటిక

పుట్టి = రెండువందలయేఁబదిమానికలు (ఖారము)

పుట్టిక = పుట్టి; చిన్నగంప

పుట్టు = పుట్టుక (జన్మము)

పుట్టువ = పుట్టు

పుడమి = నేల (భూమి)

పుడమివేల్పు = పాఱుఁడు (బ్రాహ్మణుఁడు; భూదేవుఁడు; విప్రుఁడు)

పుడిగ = తేగము; ఈవి (దానము)

పుడిసిలి = కుదియఁబట్టినచేరలోనిసగము (నికుబ్జహస్తము)

పుడిసెఁడు = పుడిసిలికొలఁది కలది

పుడుక = సన్ననిగడ్డిపుల్ల (తృణకాండము)

పుడుకు = పుడిగ (దానము)

పుడుకురింత = పుడిగ

పుత్తడి = బంగారము (కాంచనము)

పుత్తెంచెను = పుచ్చెను: పంపెను

పునుక = పుచ్చె (కపాలము)

పునుగుపిల్లి = పునుఁగు నిచ్చుపిల్లి (గంధమార్జాలము)

పున్నమ = ఒకతిథి (పూర్ణిమ)

పుప్పొడి = పూలనుండి రాలెడిపొడి (పరాగము)

పుయిలోట = దిగులు: అధైర్యమువలనిచలనము (అధృతి)

పురంట = పుంట; పూఁట (సంధ్య)

పురపురఁబొక్కెను = ఎక్కువగా దుఃఖపడెను; తఱచుగా వెతలను చెందెను

పురి = నెమలిపురి (పింఛము: బర్హము)

పురి = పిరి (సూత్రకరణవేష్టనము)

పురివొల్చెను = పుత్తెంచెను

పురిటిల్లు = ప్రసవగృహము; సూతికాగృహము

పురివిచ్చెను = పాసెను; వీడెను

పురుగు = క్రిమి: కృమి

పురుడు = పోలిక (సామ్యము; ఉపమ)

పురుడు = జాతసూతకము, సమము - [సదృశము]

పురులోమెను = పరాక్రమము చూపించెను; క్షాత్త్రము నెఱయించెను

పురువు = పురుగు

పుర్వు = పురుగు

పుఱ్ఱె = పుచ్చె (కపాలము)

పులకండము = ఒకదినుసుచక్కెర (శర్కరాభేదము)

పులకరము = గగ్గురు; భయము సంతోషము మొదలగు వానిచే మేనివెండ్రుకలు నిక్కపొడుచుట (రోమాంచము)

పులకలు = పులకరము

పులగము = పప్పు చేర్చి వండినఅన్నము (కృసరాన్నము)

పులికూడు = పులిమోర, పులికి ఆహార మగునెద్దు

పులిగోరుచెట్టు = వ్యాఘ్రనఖము

పులిచింత = నేలపైఁ బ్రాఁకెడిది పుల్లనియాకులు గలది యగునొకజాతియోషధి (సునిష్ణకము)

పులిచెంచలి = పులిచింత

పులిపిరి = పుంగుడు; పులిపిరికాయ (అల్పగంధి)

పులిమెట్టు = పులిగంజి; పుల్లనీళ్లు (అభిషుతము)

పులిసరి = పాలకిని; వాలెఘ్ని

పులుఁగు = పక్షి. (పక్షిసామాన్యము)

పులుఁగు = గుఱుతు, పక్షి

పుసి = కన్నులయందలిమలినపదార్థము (నేత్రమలము)

పుస్తు = చెడువాసన (దుర్గంధము; పూతిగంధము)

పుస్తె = తాళి (మాంగల్యసూత్రము; మంగలసూత్రము)

# పూ

పూ = పువ్వు

పూట = పురంట, సంజ (సంధ్య)

పూఁట = ఒకనికి మాటుగా నానిపనిని నేను చేసెదనని పూనినమఱియొకఁడు (లగ్నకుఁడు; ప్రతిభువు)

పూఁటకాఁపు = పూఁట

పూఁటకూళ్లవాఁడు = వంటచేయువాఁడు (పాచకుఁడు; ఔదనికుఁడు)

పూఁదేనె = పుష్పరసము; మకరందము

పూఁబిండె = మిక్కిలిలేఁతపిండె (అత్యంతబాలశలాటువు)

పూచినది = పూలు పూచినది (పుష్పితము)

పూచినమాషలు = పుష్పించినమానిష్లు, తెల్లపొఁలు కలగుజ్జము

పూచెకాఁగులు = ఒంగులలో చేసినఅలంకారము గలపెండ్లి కుండలు, ఐరేనికడవలు (ఘటవిశేషములు)

| | |
|---|---|
| పూడుపు | = నిక్షేపము (పాఁతిపెట్టినధనము) |
| పూదె | = కుళిక; బంగారుపూస లో నగునది (ముటిక) |
| పూనెను | = తొడిగెను (ఆవహించెను; ధరించెను) |
| పూప | = ప్రాఁబిందె |
| పూమొగ్గ | = గొప్పకాంతి, మొగ్గ [విచ్చనిపువ్వు] |
| పూరటిల్లెను | = నిండారెను; నిండెను |
| పూరి | = పుల్లు; పుల్ల, గడ్డి |
| పూరేడు | = ఒకపక్షి (పక్షివిశేషము) |
| పూలపొట్లము | = పువ్వులుత్తి; పుష్పము లుంచి వానికి ముళ్లు వేయుచు కట్టినదండ (మాల్యగ్రంథి) |
| పూవిల్లు | = పుష్పచాపము, పూవులయిల్లు |
| పూవు | = నాగను, పుష్పము |
| పూవులవిలుకాఁడు | = పచ్చవిల్తుండు (పుష్పధన్వుఁడు, స్మరుఁడు; మన్మథుఁడు) |
| పూస | = తొలి వేయఁబడినరత్నము (విద్ధమణి: సచ్ఛిద్రరత్నము) |
| పూసమెముక | = కోలెముక; వెన్నెముక (కశేరుక) |
| పూసలవాఁడు | = రత్నములను పోసపట్టువాఁడు (మణికారుఁడు) |
| పూసెను | = పట్టించెను: అలఁదెను, గంధాదులను శరీరమునకు దాచెను |

పెడకంత = పెడద్రోవ; తప్పుత్రోవ (అపథము)

పెడచెయి = వెనుకకుఁ ద్రిప్పినచేయి (కరపృష్ఠభాగము)

పెడచెవినిఁబెట్టెను = వినఁడాయెను; ఆదరించి వినకుండెను

పెడతల = తలయందలి వెనుకభాగము : ముచ్చిలిగుంట (కృకాటిక)

పెడతల = తలవెనుకభాగము (పశ్చాచ్ఛిరము)

పెడలు = పెరడు; గృహమునకు వెనుక ఉండు ప్రదేశము: దొడ్డి (గృహపృష్ఠసీమ)

పెణక = కత్తియొక్క వెనుకభాగము (కరవాలపృష్ఠము)

పెదవి = వాతెఱ (ఓష్ఠము)

పెద్ద = ముసలి (వృద్ధుఁడు)

పెద్ద = చదువరి (పండితుఁడు)

పెద్ద = బొడ్డ, గొప్పది (పృథువు)

పెద్దదోస = త్రపుసము; రాజకర్కటి

పెద్దనిద్దురపోయెను = తీఱెను; చచ్చెను

పెద్దపాఁపర = ఇంద్రవారుణి

పెద్దమ్రాను = పెదవేఁపచెట్టు (మహానింబము)

పెద్దవ్రేలు = బొటనవ్రేలు (అంగుష్ఠము)

పెనఁకువ = కుస్తీపాట (నియుద్ధము: బాహుయుద్ధము)

పెనఁగులాట = పెనఁకువ

పెనఁగెను = కదిసెను; అంటెను

పెనము = దోసెలు మున్నగునవి కాల్చెడియినుపరేకు (స్వేదని)

పెనిచెను = పెంచెను

పెనిమిటి = మగఁడు (భర్త. ధవుఁడు)

పెను = పెద్ద

పెనుఁబాము = ఒకజాతిపెద్దపాము (అజగరము)

పెనుమ్రాను = పెద్దమ్రాను

పెన్న = నదివిశేషము [పినాకిని]

పెన్నిదురు = గాఢనిద్ర; చావు (మరణము)

పెన్నేరు = పెన్నేరుగడ్డ (అశ్వగంధ)

పెన్నెఱులవాఁడు = మంచితలవెంట్రుకలు గలవాఁడు (కేశి)

పెన్నేరు = పెన్నేరు

పెయ్య = ఆవు లోనగువాని ఆఁడుదూడ
(గోప్రభృతిస్త్ర్యపత్యము)

పెర = తుట్టె; తేనెపెట్టె (క్షౌద్రపటలము)

పెరక = పెంకు; ఒకవిధమైనతలపుఱ్ఱె

పెరడు = పెరళ్లు, దొడ్డి (గృహపృష్ఠసీమ)

పెరయీఁగ = ఒకజాతి తేనటీఁగ (పతంగిక)

పెరిఁగెను = హెచ్చెను [వృద్ధిచెందెను]

పెరుఁగు = తోడు పెట్టినపాలనుండి ఏర్పడునది (దధి)

పెరుఁగుడు = వృద్ధి; [శివలింగములోనిదియొకటి]

పెరుఁగుతోఁటకూర = ఒకజాతితోఁటకూర (మహాబాష్ప)

పెఱ = తక్కటి (ఇతరము)

పెఱ = తుట్టెము, తేనెపట్టు

పెటిక = ధాన్యము నించినగోనె

పెలుకుతోఁటకూర = ఎలుకతోఁటకూర

పెల్ల = పెడ్డ; మట్టిగడ్డ

పెల్లు = ఎక్కువ (అధికము)

పెళ్లు = పెళుసు

పెళ్లెము = మధ్యము చేయుటకై అనేకవస్తువులు చేర్చి చేసినపిండి (మేదకము)

పెసర = ఒకదినుసు కాయధాన్యము (ముద్గము)

## పే

పేఁట = అంగడివీథి (విపణి)

పేఁట = అంగళ్లవీథి, పేట [హారములోని యొకసరము]

పేఁడ = గోవులు మొదలగువాని పురీషము (గవాదివిష్ఠ)

పేఁడ = ఆవుపేఁడ (గోమయము)

పేటి = కవచము దృఢముగా ఉండుటకై యోధులు ధరించెడిదికట్టు (సారసనము)

పేటు = గుబ్బ (పుష్పితకేశము)

పేడి = పంద (నపుంసకుఁడు; షండుఁడు)

పేడు = సన్నని మ్రానిచెక్క (సూక్ష్మదారుభేదము)

పేద = దీనవాఁడు; పనికట్టె (దరిద్రుఁడు)

పేదరాలు = దీనస్త్రీ (దరిద్ర)

పేదఱికము = నిప్పచ్చరము, ధనాదులలేమి (రిక్తత)

పేను = తలయందు చెమటనుండి పుట్టినయొక క్రిమి (యూకం)

పేము = ఒకజాతి పేము (వేత్రవిశేషము)

పేరంటము = చిరంటీత్వము

పేరంటాలు = యౌవనమునందుండియు భర్తృగృహము వదలి పితృగృహవాసము చేయుస్త్రీ (చిరంటి)

పేరడవి = పెద్దయడవి (మహారణ్యము; అరణ్యానీ)

పేరణము = కత్తళము (కవచము)

పేరణి = ఒకనాట్యము (నాట్యభేదము)

పేరిణి = పేరణము

పేరు = నామము

పేరు = పంట, ఒక పేటహారము (సరము)

పేరు = పెద్ద; గొప్పది

పేరు = హారము, నామము

పేరెము = జాళెము (రేచితము)

పేరైనవాఁడు = ప్రసిద్ధి కెక్కినవాఁడు (ఖ్యాతుఁడు)

పేరోదనము = ఒకదనసుగొలుసుపచ్చ (గారుత్మతవిశేషము)

పేరోలగము = ఒడ్డోలగము; మించి కానిపించుసభ

పేర్కొనుట = పేరొత్తుట; పేరెత్తి పిలుచుట (నామగ్రహణము)

పేలాలు = మంగలములో వేయింపఁగా ప్రేలినవడ్లగింజలు (లాజలు)

పేలిక = చిరిఁగినవస్త్రములోనికొద్దిభాగము (జీర్ణవస్త్రైకదేశము)

పేసెము = చిక్కనిఫలరసము, గుజ్జు (దేశి)

# పై

పై = పయిని: మీఁదిప్రదేశము (ఊర్ధ్వము)

పైఁట = ఆఁడువారిపై బట్ట (కాంతోత్తరీయము: పైర)

పైఁడి = ఉంకువ; కన్యకై అల్లుఁ డిచ్చుద్రవ్యము (కన్యాశుల్కము)

పైఁడి = పసిఁడి; బంగారు (స్వర్ణము; కాంచనము)

పైఁడి = రోయి; భోగస్త్రీల కిచ్చుశుల్కము (వేశ్యాభృతి)

పైఁడికంటి = గుబిలి (కనకాక్షి)

పైఁడికంటె = కంఠభూషణము, కనకాక్షి

పైఁడితామర = పచ్చతామర (స్థలపద్మము)

పైఁడియుమ్మెత్త = పచ్చయుమ్మెత్త (కాంచనాహ్వయము) [దీనిపూలుబాగ పచ్చనివిగా ఉండును]

పైకము = వస్గువు (సమూహము: వర్గము)

పైకము = రెండుకాసులనాణెము (కాకణిద్వయము)

పైకము = రొక్కము (ధనము)

పైకాణము = కూటమి [పుంభావముతో స్త్రీ సల్పుసురతము] (పురుషాయితము)

పైదలి = వడఁతి (స్త్రీ)

పైయెద = పైఁట

పైరు = పయిరు (సస్యము)

## పొ

పొంగలి = పాలు చేర్చి పొంగించునట్టి అన్నము (పాయసము)

పొంగెను = ఉబ్బెను [జలాదులు పైకి లేచెను]; ఉప్పొంగెను

పొంచరమ్ము = దాఁగి వేచియుండుట (గూఢవసతి: రహస్యనివాసము)

పొంత = పజ్జ (నికటము; సమీపము)

పొంతకరవ = పొయ్యిదగ్గఱి నీళ్లకుండ (చుల్లీనికటఘటము)

పొంతకత్తియ = తోడికత్తియ [నాయికను నాయకునిఁ గూర్చు స్త్రీ]

పొందిక = చెలిమి (మిత్త్రభావము: స్నేహము)

పొందు = పొందిక

పొందుకాఁడు = నెచ్చెలి (మిత్త్రుఁడు)

పొందెను = అందెను; కడిసెను [సక్త మాయెను]

పొంపిరిపోయెను = అతిశయమును జేసెను [అతిశయించెను]

పొత్రాలి = పొయి కగు రాయి; పొయిగడ్డ (అధిశ్రయణీశిల)

పొక్కిలి = బొడ్డు (నాభి)

పొత్తికడుపు = క్రిందికడుపు; బొడ్డుక్రిందియుదరభాగము

పొత్తు = పాలమందితో కలసి చేయుభోజనము (సగ్ధి)

పొత్తు = పొందిక (మిత్త్రభావము; స్నేహము)

పొద = బోదె లేని చిన్న చెట్లు [తీగె మొక్క లగునవి] (గుల్మము)

పొదడు = పొట్టి; పొట్టివాఁడు (వామనుఁడు)

పొదరిల్లు = ఇల్లువలె ఉండుపొద [తీగెలు మొక్క లగువానిచే కప్పఁబడి ఇంటివలె ఏర్పడిన ప్రదేశము] (కుంజము)

పొదరు = పొద

పొది = దొన; అమ్ములపొది (తూణీరము)

పొదిటి = పొదడు

పొదివెను = కవిసెను (ఆవరించెను)

పొదుఁగు = ఆవు లోనగువానిపాలుండుచోటు (ఊధస్సు)

పొద్దు = నాఁడు (దినము)

పొన్ = పైఁడి; బంగారు (స్వర్ణము)

పొనఁటినది = తాలింపు వైచినది, పోఁతాలించి వండినకూరయు మున్నగునది (సంస్కృతము)

పొనపొన = అంచు; ఆప్రదేశమునంచు

పొనరెను = ఒప్పెను; మెఱసెను

పొనిక = ముంజగడ్డి (ముంజము)

పొట్టఁడు = పొట్టివాడు (వామనుఁడు)

పొన్న = పున్నాగము

పొన్నంగి = ఒకపక్షి (పక్షిభేదము)

పొన్నగంటి = ఒకవిధమగుకూరాకు (మత్స్యాక్షి)

పొన్నట్టు = చట్టువ; కొయ్యగరిటె (దారుహస్తము)

పొన్ను = రోకలి మున్నగువానికొనకు అమర్చబడిన లోహపుకడియము (శంబకము)

పొయి = పొయ్యి (అగ్నిశ్రయణి)

పొర = కంటిచూపునకు అడ్డు కలిగించెడి ఒకవిధమైనఆవరణము (పటలము)

పొరఁటినది = తాలింపు వైచినది; పొనఁటినది

పొరక = చీఁపురు

పొరకటి = ఇసుపు; వాకిటిచేరువగోడ

పొరచి = చేబదులుగా అడిగి తెచ్చుకొనుధనాదికము (యాచితకవిశేషము)

పొరసెను = చెప్పెను, కార్యసిద్ధిపడసెను

పొరిగొనుట = బాధించిచంపుట (హింస)

పొరుగు = ఇరుగు; దగ్గఱలో (సమీపమునందు)

పొర్లుగాడి = నక్కతోఁకయట్లుండునొకతృణము (క్రోష్టువిన్న)

పొర్లుట = పశుమిథునములయు మృగమిథునములయు కూటమి (పశుమృగరతము)

పొల = నంజుడు (మాంసము)

పొలఁతి = పైదలి (స్త్రీ)

పొలంతుక = పొలతి

పొలపరి = తెరువాటుకాండు; దారి కట్టి దోచుకొను దొంగ (మార్గచోరకుండు)

పొలమరి = కాపు; సేద్యకాండు, వితమరి (కర్షకుడు)

పొలము = ఊరిపట్టునేల; ఊరికి దగ్గఱ నుండుభూమి

పొలయలుక = ప్రణయకోపము

పొలసు = పొల (మాంసము)

పొలసుదిండి = నైరృతి

పొలసుదిండ్లు = తొలివేల్పులు (అసురులు; రాక్షసులు)

పొలిమేర = ఎల్ల (సీమాస్థలము)

పొలిమేరం = పొలిమేర

పొలియుట = పెన్నిదుర; చావు (మరణము)

పొలుపు = చక్కఁదనము (సౌందర్యము)

పొల్తి = నెలంత (స్త్రీ)

పొల్తుక = పొల్తి

పొల్ల = తాలుక; గింజ లేనిధాన్యము (తుచ్ఛధాన్యము)

పొల్లకట్టు = పొల్ల

పొల్లు = కల్ల (అసత్యము)

పొల్లు = పొల్ల; తాలు

పొళ్లి = పొల్లి

పొవ = పొగ (ధూమము)

# పో

పోఁక = పోఁకచెట్టు (పూగము)

పోఁక = పోఁకపండు (పూగఫలము)

పోఁకమ్రాను = పోఁక (పూగము)

పోఁకరంతి = పోఁకకాయయంతటిపరిమాణము

పోఁకముడి = స్త్రీలు ముందువైపు వేసికొనుకోకముడి (నీవి)

పోఁకత్తి = పోఁకలు కత్తిరించుకత్తెర (పూగఛేదని)

పోఁగు = దారము (తంతువు)

పోఁగు = దారము, చెవిపోఁగు

పోఁగులు = ఒకవిధమగు చెవిసొమ్ములు (కర్ణవేష్టన విశేషములు)

పోఁచ = పోఁగు (తంతువు)

పోఁజెను = ప్రత్తి గారమున్నగువానిని సలుసులు లేకుండ సన్నముగా తీసి బాగుచేసెను; మాటను జేర్చెను

పోక = యానము (దండయాత్ర) [షడ్గుణములలో ఒకటి]

పోక = తరలుట (యాత్ర, ప్రస్థానము)

పోచిల్లు = ఉపశ్రుతిచే శుభాశుభములు తెలియుటకై చల్లు అక్షతములు (ప్రార్థనాక్షతలు)

పోటకము = బొబ్బలు లేచెడియొకరోగము (స్ఫోటకము)
పోటనబంతి = వస్త్రములు లోనగువానితో చేయఁబడె ఎగురఁగొట్టఁబడుచు ఆడఁబడెడిబంతి (క్షేపణి)
పోటి = పాటి: సాదృశ్యము కలది (సదృశము)
పోటిగాఁడు = సదృశుఁడు, మిత్త్రుఁడు
పోట్లాట = జగడము (యుద్ధము)
పోడిమి = పదిలము (ఏకాగ్రత: అవధానము)
పోతరంబు = పొగరు (గర్వము)
పోతు = గండు; పశుపక్ష్యాదులకు చెందినపురుషజాతి
పోతుగుఱ్ఱము గలాఁడు = దక్షిణపుఱేఁడు (యముఁడు)
పోతురాజు = ఒకబ్రహ్మరక్షస్సు (బ్రహ్మరాక్షసవిశేషము)
పోని = సదృశము (వదర్థకము)
పోపిట్ట = ఒకపక్షి (పక్షివిశేషము)
పోయెను = చనెను; నడచెను
పోయెను = తీఱెను; చచ్చెను
పోరాట =పోట్లాట
పోరు = విగ్రహము [షడ్గుణములలో ఒకటి]
పోరు = పోట్లాట
పోరువ = ఒకవిధమైనపచ్చడము (ప్రచ్ఛదపటవిశేషము)
పోలిక = మాదిరి (సాదృశ్యము; ఉపమ)
పోలికి = పోలిక

పోవడి = పొక్కు (జనశ్రుతివిశేషము)
పోనవాలు = పాలు (క్షీరము)

## పౌ

పౌజు = వరుస; చాలు (పంక్తి)
ఫౌజు = సైన్యము [రాజ్యాంగములలో ఒకటి]

## ప్ర

ప్రక్క  కెప (పార్శ్వము)
ప్రక్కె = సన్నని ఆకులు గల ప్రక్కె చెట్టు (పిచులటు)
ప్రకె్క = ప్రక్కె
ప్రగ్గ = పంగ; చెట్టుమొదటికొమ్మ (స్కంధశాఖ)
ప్రతి = బదులు (ప్రతినిధి)
ప్రతిన = పంతము (ప్రతిజ్ఞ)
ప్రత్తి = ప్రత్తిచెట్లు (కార్పాసి)
ప్రబ్బ = వేతసము; నిచులము
ప్రబ్బలి = ప్రబ్బ
ప్రమిద = దీపము వెలిగించెడి ఒకపాత్ర (దీపపాత్రము; శరావవిశేషము)
ప్రమ్మెను = చుట్టెను (వేష్టించెను)
ప్రల్లదము = అర్థము లేనిమాట; వదరు (ప్రలాపము)

## ప్రా

ప్రాచు = ఒకజాతినాఁచు; నీరాకు (వారిపర్ణి)

ప్రాఁజదువు = వేదము

ప్రాఁత = చాలకాలమునాఁటిది (పురాణము)

ప్రాఁబలుకుటెంకి = తమ్మిచుట్టము (సూర్యుఁడు) [పద్మినీవల్లభుఁడు]

ప్రాఁబల్కుగుఱ్ఱముల్ పన్ని
పెన్నగంబట్టిపుడమి తేరెక్కిన
పోటుగాఁడు = శివుఁడు

ప్రాపు = పజ్జ (సమీపము)

ప్రామినుకు = ప్రాఁజదువు

ప్రాముడు = పులుముడు (మార్జనము)

ప్రామెను = పాత్రాదులను శుభ్రపఱచెను: తోలఁచెను

ప్రాలేఱు = కడలి (సముద్రము; వననిధి)

ప్రాలు = విఱుగనిబియ్యము (అక్షతలు)

## ప్రె

ప్రెగడ = మంత్రి: ప్రధానుఁడు

ప్రెగ్గడ = ప్రెగడ

ప్రెగ్గడ = మంత్రి [రాజ్యాంగములలో ఒకఁడు]

ప్రెగ్గడసాని — మంత్రిభార్య

## ప్రే

ప్రేంకదము = ప్రియంగువు
ప్రేంకణము = ప్రేంకదము
ప్రేగు = కడుపులోని పేగు (అంత్రము)
ప్రేముడి = మక్కువ (ప్రేమము)
ప్రేలిక = పేలిక; పీలిక (జీర్ణవస్త్రైకదేశము)
ప్రేలుము = ప్రల్లదము
ప్రేలువాఁడు = మాటలమారి; పెద్దమాటలు పెక్కులు పలుకువాఁడు (వాచాటుఁడు)

## ప్రొ

ప్రొద్దు = పొద్దు (దినము)
ప్రొద్దు = సూర్యుఁడు; బ్రధ్నుఁడు
ప్రొద్దునెల = ప్రసవమున కైనమాసము (ప్రజననము)
ప్రొయ్యి = పొయ్యి (అధిశ్రయణి)

## ప్రో

ప్రోగు = చెవిపోగు (కర్ణవేష్టనము; కుండలము)

ప్రోక = కుప్ప (రాశి)
ప్రోగు పోక
ప్రోచితిని = భూతకాలమును చెప్పులిఙ్రూపము (ఉ. పు.ఏ.)
ప్రోచితివి = భూతకాలిక లిఙ్రూపము (మ. పు ఏ.)
ప్రోచుఁగాతన్ = ఆశీస్సును జెప్పులి ఙ్రూపము
ప్రోచుచున్నాఁడు = వర్తమానార్థకలఙ్రూపము (ప్ర. పు. ఏ.)
ప్రోచుచున్నాను = వర్తమానార్థకలఙ్రూపము (ఉ పు ఏ.)
ప్రోచుచున్నావు = వర్తమానార్థకలఙ్రూపము (మ పు. ఏ.)
ప్రోచుట = భావార్థకకృదన్తము (ధాత్వర్థమును మాత్రము బోధించు కృత్ప్రత్యయాన్తము: సుబన్తము)
ప్రోచుటాయెను = భావార్థకరూపము; క్రియనుమాత్రము వచించునది; ప్రోచుట-అనుట
ప్రోచును = భవిష్యత్కాలము చెప్పులృట్రూపక్రియ (ప్ర. పు ఏ )
ప్రోచువాఁడు = కర్త్రర్థము; కర్తను చెప్పెడిక్రియాజన్య విశేషణ మైనసుబన్తము
ప్రోచెను = భూతకాలికలిఙ్రూపము (ప్ర. పు. ఏ )
ప్రోఢ = నిండుయౌవనము గలస్త్రీ (ప్రౌఢ)
ప్రోఢ = ఆరితేఱినవాఁడు (ప్రౌఢుఁడు)
ప్రోతును = భవిష్యత్కాలమును వచించులృట్రూపము (ఉ. పు. ఏ.)

ప్రోతుసుగాతన్ = ఆశీస్సును చెప్పడిలి ప్రాపము
(ఆశీర్లిఙ్రూపము)

ప్రోతుష = భవిష్యత్కాలమును జెప్పుల్య ప్రూపము
(మ. పు. ఏ.)

ప్రోతుపుగాతన్ = ఆశీస్సును చెప్పడి లి ప్రూపము
(ఆశీర్లిఙ్రూపము)

ప్రోపించెను = ప్రేరణార్థమును (ణిజర్థమును)
తెలుపురూపము

ప్రోయాలు = సెలంత (స్త్రీ)

ప్రోలు = వీడు (పురము; పట్టణము)

ప్రోవఁబడినది = కర్మార్థకము; కర్మార్థమును వచించు
క్రియాజన్యవిశేషణమగుసుబన్తము

ప్రోవఁబడెను = కర్మార్థమును వచించుగాతకాలిక క్రియ

ప్రోవడము = క్రిందను మాత్రము చెప్పడెభావార్థక
కృదన్తసుబన్తము

ప్రోవు = ప్రోగు: కుప్ప

ప్రోవు = ప్రోచుట (భావార్థక కృదన్తసుబన్తము)

# బ

బంకమన్ను = కుమ్మరి కుండలు చేయు జిగురు గలమట్టి
(కుంభకరమృత్తు)

బంగరు = బంగారము (కాంచనము; సువర్ణము)

బంగల = ఒకచోటినుండి వేఱొకచోటికి తీసికొని పోవుట కుపయోగించెడి కంపటి; బండికుంపటి

బంగారు = బంగరు

బంగారుకడుపువాఁడు = దుహిణుఁడు (బ్రహ్మ) [హిరణ్యగర్భుఁడు]

బంగు = మైకము కలుగుటకు గంజాయిపత్రితో చేసిన పదార్థము (కలంజము)

బంటు = యుద్ధము చేయువాఁడు (భటుఁడు; యోధుఁడు)

బంటు = గాసీఁడు (దాసుఁడు; పరిచారకుఁడు)

బండ = వెడల్పుఱాయి (విశాలశిల)

బండారువు = బొక్కసము; ధనము ఉంచుగృహము (భాండాగారము)

బండారము = బండారువు

బండారు = పసుపు (హరిద్ర)

బండాలము = మొదలు, వ్యాపారమునకైన ప్రధాన ద్రవ్యము (మూలధనము)

బండి = గుఱ్ఱపుబండి మొద లగునది (శకటము)

బండికన్ను = బండికంటి నడిమితూము (నాభి)

బండికల్లు = చక్రము; రథాంగము

బండిగురివింద = ఒకజాతిగురివెంద (మాధవి)

బండిదాట = రాజమార్గము (ఘంటాపథము)

బంతి = చాలు (పంక్తి)

బంతి = చెండు; ఆడుకొనెడిబంతి (కందుకము)

బటువుకత్తి = చక్రము. సుదర్శనము

బట్టి = గుడ్డ: వస్త్రపుపేలిక (వస్త్రఖండము)

బట్టికాఁడు = చిలుక (శుకము)

బట్టినగోల = ఎత్తనగోల (గోణ్యుద్ధారదండము)

బట్లు = క్రిక్కులు; బట్టువారు (పాఠకులు: వందులు)

బల్లె = మల్ల; ఒకవిధ మగుమాఁకుగు (శరావవిశేషము)

బడప = ఇడుమ (కష్టము)

బడల్పడియెను = చాఁపచుట్ట గఁ బడెను; చాఁపచుట్టవంటి చుట్ట గా ఆయెను

బడి = పన్ను (భాగధేయము; కరము)

బడి = వెనుక: వెనుకప్రదేశము (పృష్ఠము, పశ్చాద్భాగము)

బడిత = అంతట ఇనుపముండ్లతో కూడిన యినుప దండము (పరిఘము)

బడిమి = వైశ్వదేవహోమమునకు అంగము గా ఆవు కుక్క మొద లగువానికి నిత్యము ఒసఁగు అన్నాదికము (భూతబలి)

బడిలి = గండి (రంధ్రము)

బడుగు = బక్క; కండ లేనివాఁడు (అమాంసుఁడు)

బడుగు = శవము, దుర్బలుఁడు

బడుప = చాలపల్లము గలభూమి (విస్తారనిమ్నధరణి)

బడుపు = బడుగు (అమాంసుఁడు)

బతము = ఉపవాసాదిపుణ్యకర్మము (వ్రతము)

| | | |
|---|---|---|
| బతిమాలడము | = | దేవురింపు; దుఃఖముతోడి వాక్కు (పరిదేవనము) |
| బత్తళిక | = | పొది: అమ్ములపొది |
| బత్తి | = | పెద్దవారియందలి భయముతోడి ప్రేమ (భక్తి) |
| బదనిక | = | చెట్టుమీఁద మొలచెడి యొకయోషధి (వంద) |
| బదులు | = | ఒకరిపని చేయుటకుఁగా అయిన మఱియొకఁడు (ప్రతినిధి) |
| బదులుమాట | = | మాఱుమాట (ప్రత్యుత్తరము, ప్రతివాక్యము) |
| బద్దపరికి | = | పలుచనిబిళ్ల |
| బద్దె | = | వస్త్రపుటంచు (దశ [లు]) |
| బన్నము | = | ఓటమి (అపజయము) |
| బన్నసరము | = | ఉత్తరిగె; ఒకవిధ మగుఆఁడువారి కంఠహారము (సరవిశేషము) |
| బమ్మ | = | నలువ (బ్రహ్మ) |
| బమ్మెర | = | ఉన్నది లేనట్లు లేనిది ఉన్నట్లు తలఁచుట (భ్రాంతి; మిథ్యాబుద్ధి) |
| బయకాఁడు | = | జంత్రగాత్రములయందు రెండిటియందు నేర్పు చూపువాఁడు (ఉభయకారి) |
| బయట | = | వెలుపల; వెలుపల ఉండుచోటు (బహిరర్థము) |
| [illegible] | = | మిన్ను (ఆకాశము; నభము) |

బయ్యాంకలు = వేవిళ్లు: గర్భవతికి భక్షణవస్తువులయెడ కలుగువాంఛలు (దౌహృదము)

బరకము = ఒకవిధ మసుగోనె (గోణీవిశేషము)

బరవు = రెబ్బ: చిన్నకొమ్మ (ఉపశాఖ)

బరడు = గలుకైనచెట్టుపట్టలో నగునది (త్వగవయవము)

బరణి = పబ్బి (భరణి; సంపుటము)

బరి = తెక్క [మనుష్యునితెక్క] (పక్షము)

బరి = ఏనుఁగును గోలుసాధనము. అరెకోల (తోత్రము)

బరిగాయు = కొంటె (ధృష్టుఁడు)

బరిగివాటు = జీను వేయనిగుఱ్ఱమును ఎక్కెడిరౌతు (పల్యాణబంధరహితహయసమారోహకుఁడు)

బరిసె = ఈఁటె: ఒకఆయుధము (కుంతము)

బరిదెంపది = హద్దు మీఱినది (విశృంఖలము)

బరిపోటు = ముప్పదిరెండు విన్నాణములలో ఒకటి (మల్లబంధవిశేషము)

బరిస = బడిత (పరిఘము)

బఱ్ఱె = ఎనుము (మహిషి)

బలపము = పలకపుల్ల (ఖటిక)

బలారె = అన్యాస్యారె (ప్రశంస)

బలితము = బలవంతుఁడు

బలిమికాఁడు = బలితము

[illegible] = [illegible] (బలవంతుఁడు

బవినీఁడు = జాతరలయందు వేసము వేసి గ్రామదేవతల కథ ఆడుచు పాడుచు పామరజనుల మెప్పు లందువాఁడు (క్షుద్రసంఘప్రశంసి)

బవిరి = బమ్మెర (భ్రాంతి; భ్రమ)

బవిరి = జాళెము; ఒకవిధ మగుగుజ్జుపనిక (కేచితము)

బవిరె = ఒకవిధ మగు చెవిసొమ్ము (కర్ణభూషావిశేషము)

బవిళి = మైమఱపు; గంధాదులచే స్మృతి తప్పి వర్తించుట (మూర్ఛ)

బవిసనము = సీసెదండెకును నాలికాయమును వేఁడికట్టు (అంగాబాంధవము)

బవిసి = దయ్యము (నియతి)

బసవఁడు = స్వేచ్ఛగా విడిచిన ఆఁబోతెద్దు (గోపతి)

బసివి = శివునికి పరిచర్య చేయుటకై బాల్యమునందే సమర్పింపఁబడిన స్త్రీ (పశుపి)

## బా

బాఁకు = చిల్లాణము; వంకరకత్తి (వక్రశస్త్రము)

బాఁపఁడు = బ్రాహ్మణుఁడు; విప్రుఁడు

బాఁపత = బ్రాహ్మణస్త్రీ [బ్రాహ్మణి]

బాఁపన = బ్రాహ్మణజాతి

బాఁపనుఁడు = బాఁపఁడు

బాపనీకము = బ్రాహ్మణ్యము [బ్రాహ్మణధర్మము; బ్రాహ్మణకర్మము]

బాగాలు = సెలవత్తి: వక్కముక్కలు (పూగభాగములు)

బాగు = తిన్ననిది: అందమైనది (మంజులము)

బాకుదారు = చిన్నకత్తి (అల్పాసి)

బాట = బండిబాట (రాజమార్గము; ఘంటాపథము)

బాట = దిక్కు, త్రోవ

బాడిగ = జీతము (వేతనము)

బాడిస = వడ్రంగి కొయ్యలు చెక్కెడియొక సాధనము (వర్ధకి)

బాడు = పరదా, పెద్దముసుఁగు (ప్రావరణము)

బాడువ = బహువ; చాలపల్లము గలభూమి

బాణము = టపాకి (అగ్నిప్రసారణము)

బాణలి = వేఁచుట లో సగునానికి ఉపయోగించెడి లోహపాత్రము (కందువు)

బాతు = ఆడేలు; ఒకజలపక్షి (శరారి)

బాధ = వెత (బాధ; వ్యథ)

బాదరి = మెట్లములు లేక గోడపై నుండి ప్రక్కకు పంచను దింపి రాడులయాధారమునఁ గట్టినశాల, ఓరపాక

బాదరు = నిప్పు ముట్టించెడి త్రాడు ఉంచెడితుపాకుల చెవి

బాన = పెద్ద వెడల్పుమూతి గలపాత్రము; గంగాళము

బానిస = వెల యిచ్చి కొనినపనికత్తె (దాసి)

బానిసము = సేవ; దాస్యము

బానిసీఁడు = బంటు (దాసుఁడు)

బాడా = గుఱ్ఱము (అశ్వము)

బాము = అగచాట్లు (కష్టము; దుస్థితి)

బార = అఱచేతులతోఁగూడ అడ్డముగా చాపఁబడిన బాహువులనడిమిభాగపుఁగొలఁది (వ్యామము)

బార = పండ్రెండు (ద్వాదశకము)

బారంగి = చిఱుతేకు (భార్ఙ్గి)

బారకేళ్లమరినవాఁడు = సవ్యసాచి; సుబాహుఁడు [రెండుచేతులదండిమగఁడు]

బారసి = ఒకతిథి (ద్వాదశి)

బారి = నొప్పి (బాధ)

బారి = బాధ, ఏనుఁగుకాలిగొలుసు, గొప్పది

బారిజము = పారిభద్రము [బాడిదపుఁజెట్టు]

బారిముద్ర = ఒకవిధ మగుబంగారునాణెము (దీనారభేదము)

బారిసము = వాలకము (వేషము)

బారు = ఛాల్; చాలు; వరుస

బారెఁడు = బారయంతకొలఁత కలది

బాలసంగరము = సాము చేయుటకై త్రిప్పెడుకొయ్యపరికరము (మల్లవిద్యాసాధనము)

బాలెంత = క్రొత్తగా ప్రసవించినస్త్రీ (ప్రసూత)

బాళి = మక్కువ (ప్రేమము)

బావ = భర్తయన్న, భార్యయన్న (భావుకుఁడు)

బావి = దిగుడుబావి (వాపి)

బావురు = గండుఁబిల్లి (మహామార్జాలము)

బావురుఁబిల్లి = బావురు

బాస = ఆంధ్రాదిభాష, ప్రతిజ్ఞ

బాసట = తోడు (సహాయుఁడు)

బాసవాలుఁడిట్టలు = జేజేలు సురలు: దేవతలు) [గీర్వాణులు]

బాసికంబు = నొసటఁ గట్టెడిముత్యాలబాసికము (లలాటిక)

బాహాపురి = సందికడియము (కేయూరము; భుజకీర్తి)

## బి

బింకము = బీరము (గర్వము; వీరగర్వము)

బిందె = నీళ్లు లోనగునవి తెచ్చుట కుపయోగించు నొకవిధమగులోహపాత్ర (తామ్రాదిభాండము)

బికారి = తిరిపగొట్టు; టక్కరిసన్యాసి (అవిరక్తభిక్షువు)

బికారి = పేద (దరిద్రుఁడు)

బికాసి = బికారి

బిక్షము = తిరిపము (భిక్ష)

బిరాలమూతి = బికారి (అపరక్తభిక్షువు)

బిగుసు = బింకము

బిచ్చము = భిక్షము (భిక్ష)

బిట్టు = మిక్కుటము (ఆధిక్యము)

బిడారు = విడుపట్టు; సేన దిగి యుండుచోటు (నివేశము)

బిడ్డ = పట్టి (అపత్యము, సంతానము)

బిడ్డకట్టు = ప్రసవవేదన: ఆమనస్యము

బిత్తరము = నీటు (విలాసము)

బిత్తరి = పొలఁతి (స్త్రీ)

బిత్తలి - దిసమొల; వస్త్రము లేనివాఁడు (దిగంబరుఁడు; నగ్నుఁడు)

బిత్తెర = చక్కిలము మొదలగువానిని పైకెత్తెడి యొకలోహసాధనము (శష్కులికాప్రముఖసముద్ధరణసాధనము)

బిద్దె = నరకము, దుర్గతి

బిద్దెను = పోయెను; చచ్చెను

బిచ్చిలికాయ = స్త్రీలు కాలిమాఁటవ్రేలికి ధరించు నొకనగ

బియ్యము = పొట్టు పోవునట్లు దంచిన ధాన్యము (తండులములు)

బిరడ = సీసాలో నగువానిలోంత [తీగ] చుట్టబడి గంకిమెడకొలద్యు (ఉపవాహము)

బిరబిర = ఒకవిధ మగుధ్వనికి అనుకరణము

బిరాన = శీఘ్రముగ (శీఘ్రత్వసూచకము)

బిరుదాయెత్తు = బిరుదము కలవాఁడు (బిరుదాన్వితుఁడు)

బిరుదు = పతాకము (బిరుదము)

బిల్ల = సూర్యచంద్రులగుండ్రని యాకారము (బింబము)

బిల్లదిండు = బాలీసు: గుండ్రనితలగడ (ఉపధానవిశేషము)

బిల్లిక = బిల్ల

బిస = మీట; ఏతపుమ్రాను కొన నగునవి క్రిందికి మీఁదికి ఆడుటకు ఆధార మైనచీల (ఉత్పతనకీలము)

బిస్త = బిడ్డ

# బీ

బీటిక = పొక్కులు, రోగమువలన దేహమునందు కలుగుపొక్కులు (స్ఫోటకము)

బీకర = బీఱ (కోశాతకి)

బీగము = ఒకవిధ మగుఇనుపగడియ (అయోమయార్గళవిశేషము)

బీడు = కంచె; పండనిభూమి

బీదు = రిత్త; ఏమియు లేనియిల్లు మొదలగునది (శూన్యము)

బీతు = దిగులు (అధైర్యము; అధృతి)

బీరము = వీరము; వీరరసము

బింకము = బిగువు (గర్వము; పిరగర్వము)

బీరిణము = కృపణము; ఏడము

బీల = బీకర

బీలనరము = పెద్దనరము (పీతనాడి)

బీలుపోయెను = వ్యర్థ మాయెను, పొల్లన పోయెను

## బు

బుంగ = చిన్నమూతి గలపాత్రము; కూజా లో
నగునది (అల్పముఖభాండము)

బుక్కా = గంధపొడి (గంధచూర్ణము;
వాసయోగము)

బుక్కాము = బుక్కా

బుగ్గ = బుడగ (బుద్బుదము)

బుగ్గ = ఎక్కువలోతుగనిభూమిలో పైకి ఉబికివచ్చునీరు
(ఉత్సవిశేషము)

బుగ్గ = నీటితో నింపినబుగ్గ (గండూషము)

బుగ్గి = దుమ్ము (ధూళి)

బుజంబు = జబ్బ (భుజము)

బుట్ట = పుటిక; చిన్నగంప

బుడమ = ఒకవిధ మగు చేదుదోస
(తిక్తోర్వారుకవిశేషము)

బు[illegible] = వస్త్రలోనిపురుగువిశేషము ([illegible]భేదము)

బుడిగ = సంన్యాసులుగాని బ్రహ్మచారులుగాని నీరు త్రాగుటకై ఉపయోగించెడిపాత్ర విశేషము (కమండలువు)

బుడిగ = బుంగ

బుడిగి = పొట్టి; పొట్టివాఁడు (వామనుఁడు)

బుడిపి = ముడి; చెట్టు మొదలగువానిబుడిపె (గ్రంథి)

బుడుక = తానము (స్నానము)

బుడుత = చిఱుత (బాలుఁడు)

బుడుత = బుడిగి

బుడుబుడుక్క = డుబుడుక్క; ఒకవాద్యము (హుడుక్క)

బుర్తగింపు = పంది ముట్టెతో నేల కెల్లగించుట (ఘృష్టిధరాఖాతి)

బుడ్డి = బుంగ

బుడ్డిగ = బుడిగ (కమండలువు)

బుడ్లు = ఒకవిధమైనకుండలు; ఐరేనికడవలు (ఘటవిశేషములు)

బుద్ధి = బుద్ధి; మతి

బుబ్బుదము = ఒకదినుసుభక్ష్యము (బుద్బుదము)

బురకదము = ఉడుములను వేఁటాడెడికుక్క [ఉడుపవేఁపి]

బురద = ఉబ్బలి (పంకము)

బుడుక = పొట్టివాఁడు; బుడుత

బురుజు = మువ్వ; అలంకారము కై మొలనూలు మొదలగువానిలో గ్రుచ్చెడిచిన్నగజ్జె (క్షుద్రఘంటావిశేషము)

బురుద = కల్ల (అసత్యము)

బురుసా = జరీబట్ట (కలధౌతవస్త్రము)

బుట్టకొమ్ము = ఒకవిధమైనచిమ్మనగ్రోవి (శృంగవిశేషము)

బుట్టముక్కువాఁడు = పెద్దముక్కురంధ్రములు కలవాఁడు (ఘోణసుఁడు)

బులుపు = సీటు (విలాసము)

బువ్వ = కూడు (అన్నము)

బువ్వము = పెండ్లివారితోడిసహభోజనము (స్వజనవివాహాజ్ఞ్వి)

బుసి = గడ్డి మొదలగువానిదుమ్ము (బుసము)

బుసుకుజొన్న = ఒకదినుసుజొన్న (జూర్ణవిశేషము)

## బూ

బూఁజు = పుస్తు (దుర్గంధము)

బూక = కొండిమె; సముదాయార్థశూన్య మగు వాక్యము (అబద్ధము)

బూగర = బుసి (బుసము)

బూచి = దయ్యము (పిశాచము)

బూతులజోర = శిష్యుఁడు [పాపసేవుఁడు]

బూటకిమ్మ = బూక

బూడిద = నివురు; కట్టెనిప్పుమీఁది తెల్లనినూకి
(భస్మము)

బూతపిల్లి = పునుఁగుపిల్లి (గంధమార్జాలము)

బూతము = దయ్యము (పిశాచము: భూతము)

బూతు = బూక

బూది = విబూది (భూతి, విభూతి)

బూదె = చతుర్దశి [భూతతిథి]

బూమె = బూక

బూరకాలివాఁడు = బోదకాలు కలవాఁడు (ప్రవృద్ధపాదుఁడు)

బూరగొమ్ము = చింపము (శంఖము)

బూరుగ = ఒకవిధ మగుబూరా (శష్కులీభేదము)

బూరుగ = పూరణి; శాల్మలి

బూరువ = బూరుగ

బూరె = ఒకవిధ మగుఅప్పము (పూరిక)

## బె

బెండ = ఎర్రగా ఉండు చెట్టు (గోజిహ్వ)

బెండగిలెను = బాహిరం పరాయెను; ఎత్తువడియును

బెంపడి = [illegible] నగువానిప్పుఁలకై ఇసుక
పెట్టి వండిన యన్నము (లేపనిశేషము)

బెగ్గలుట = ఉద్వేగము: అద్భుతి, భయము

బెగ్గురు = ఉయ్యెలపులుఁగు (నారికము)

బెట్టిదంబు = ఘోరము; భయము కలిగించుట (ఘోరత)

బెట్టు = మిక్కుటము (అతిశయము; అధికము)

బెడఁగు = బులుపు (విలాసము)

బెడక = ధాన్యము నింపనిగోనె; ఉత్తగోనసంచి
(ధాన్యవిరహితగోణి)

బెడిగ = కోరు; రాజునకు చెల్లింపవలసినధనాది
భాగము (భాగధేయము; కరము)

బెడ్డ = పెల్ల; మట్టిగడ్డ (లోష్టము)

బెత్త = చాఁచినచూపుడువ్రేలు మొదలు
నాలుగువ్రేళ్లు (చతురంగుళి)

బెత్తము = పేము (వేత్రము)

బెత్తిలి = బెత్త

బెత్తెఁడు = బెత్తకొలత కలది

బెదరు = భీతి; జడుపు (అధైర్యము)

బెదరెను = భయముచే వణఁకెను (చలించెను)

బెబ్బులి = పెద్దపులి (మహావ్యాఘ్రము)

బెబ్బులి = [ఉత్తరపదమైన శ్రేష్ఠతావాచకము]
శ్రేష్ఠము, శ్రేష్ఠుఁడు

బెరసెను = అంటెను; కదిసెను

బెలము = సొరంగము (బిలము)

బెల్లము = చెఱకురసము కాఁచి చేసినయుండగట్టి
పదార్థము (గుడము)

వెల్లించెను = ఎక్కించెను, ఉబ్బించెను; ఇచ్చకము లాడి సంతోషపఱచెను

వెవ = ఒకపక్షి (పక్షివిశేషము)

వెళుకు = ఒకడేగ (శ్యేనభేదము)

వెత్త = బోయి, బరువు మోయువాఁడు (భారవాహకుఁడు)

## వే

వేగడ = కాఁబంగారు (అభ్రకము)

వేద = పప్పు; పొట్టు పోయి బద్దలైనకాయ ధాన్యము (సూపము)

వేడ = వరాలోనిముప్పదిరెండవభాగము (దినాం ద్వాత్రింశదంశము)

వేదిస = ఒకజాతిచేఁప (గుల్మము)

వేరజము = చకుకు (ధూర్తుఁడు)

బేరులు = కోమట్లు (వైశ్యులు)

వేలపోయెను = మోసపోయెను

వేహారులు = బెములు

## బై

బైజ = బజారము; ప్రయోజనశూన్య మగుమాట (ప్రలాపము)

పైడాలము = కినుక (కోపము)
పైరి = ఒకజాతిడేగ (శ్యేనవిశేషము)
పైరి = మొసలి, ఒకజాతిడేగ
పైసి = పూర్వజన్మమందలిశుభాశుభకర్మము (దయ్యము)

## బొ

బొంకరి = జల్లికాఁడు; అనృతము లాడువాఁడు (అసత్యుఁడు)
బొంకి = బోలె; ఒకవిధ మైనతలపుట్టి (కరోటివిశేషము)
బొంకు = దబ్బర (అసత్యము)
బొంగరము = గుండ్రముగా త్రిప్పుచు గాలి రాడుకొనెడి ఒకవిధమగుఆటవస్తువు (భ్రమరము)
బొంగు = బొంగు వెదురు (కీచకము)
బొంప = బోను, మృగములు మున్నగువానిని పట్టుట కుపయోగించుయంత్రము (కూటయంత్రము)
బొందుగ = గొంతె; మెడక్రిందిభాగము (కంఠము)
బొండుమల్లె = బొంపుమల్లె (మహామల్లి)
బొండ్లము = తాటికొబ్బెరలకాయ (తాలాదికశలాటువు)
బొంత = గంత (కంథ)
బొంద = కలుగు (గర్తము; భూరంధ్రము)

బొందకోల = యోధులశస్త్రవిద్యాభ్యాసమున కఱ్ఱఆయుధము (సాధనాయుధము)

బొందడీఁడు = అంతఃపురము కాలుపలిరసి ఒనర్చువాఁడు (కంచుకి)

బొందకమ్మ = కత్తళము; యుద్ధాదులందు తొడుగుకొను ఇనుపచొక్కాయి (కవచము)

బొంది = డొక్క (శవము; కళేబరము)

బొందు = పెన్ను తీయుటకు యోగ్యము కానివరి లో నగువానిపైరు (శుష్కసస్యము)

బొందె = అరఁటియూఁచ (కదలీత్వగంతర్గతశ్వేతకాండము)

బొక్క = బొంద

బొక్కసము = ధన ముంచుగృహము (భాండాగారము; కోశాగారము)

బొక్కసము = బండారము [రాజ్యాంగములలో ఒకటి]

బొక్కెన = నీరుపిప్పలి (కోడుపిప్పలి)

బొక్కెన = ఉలవలు లో నగుదాణ ఉంచి గుఱ్ఱము నోటికి తగిలించుసంచి (అశ్వఖాదనసాధకాస్యలంబిత స్త్రిక)

బొక్కెన = చేఁద; నీళ్లు తోడునొకసాధనము (ఘటీయంత్రవిశేషము)

బొగడ = చెవులపువ్వు; ఒకవిధ మగుచెవిసొమ్ము (కర్ణభూషావిశేషము)

బొగడ = బుగడ; ఆడువారు చెవికొనను ధరించు నొకదినుసుసొమ్ము, చెఱువునుండి నీళ్లు పాఱువడు ప్రదేశము

బొగ్గు = నల్ల (కాళిక: ఇంగాలము)

బొచ్చు = ముఖమునందు తలయందుఁగాక తక్కిన దేహమందు ఉండువెండ్రుక (రోమము)

బొచ్చె = బొంకి: ఒకవిధ మగుతలపుష్ప

బొజుఁగు = నన్నుకాఁడు (విటుఁడు)

బొజ్జ = పొట్ట (కుక్షి)

బొజ్జదేవర = పిళ్లారి (విఘ్నేశ్వరుఁడు) [లంబోదరుఁడు]

బొజ్జవాఁడు = లొండ, పెద్దపొట్ట కలవాఁడు (తుందిలుఁడు)

బొటవ్రేలు = పెద్దవ్రేలు (అంగుష్ఠము).

బొటనవ్రేలు = బొటవ్రేలు

బొటె = అరె: కోడికాలివ్రేళ్లకు వెనుకతట్టు నుండిపోలె మిక్కిలివాఁడి యై ఉండెడి కొంటెగోరు .

బొట్ట = పొడక; ఒకవిధ మైనగాదె

బొట్టనవ్రేలు = బొటవ్రేలు

బొట్టము = కచ్ఛటము; గోఁచి (కౌపీనము)

బొట్టవ్రేలు = బొటవ్రేలు

బొట్టు = మంగళసూత్రమునకు గ్రుచ్చెడిబంగారునగ; తాళిబొట్టు (మాంగల్యసూత్రాంతర సువర్ణభూష)

బొట్టు = చుక్క (తిలకము)

బోడు = బోడివాఁడు

బోద = కూన: పశుపక్ష్యాదులపిల్ల (తిర్యగ్బాలకము)

బోదుప = బోద

బోదె = బోద

బోనకత్తె = వంట చేయుస్త్రీ (పాచిక)

బోనము = బువ్వ (అన్నము)

బోను = బోంఠ; మృగములు మున్నగువానిని పట్టుటకు ఉపయోగించుకపటయంత్రము

బోయ = కిరాతుఁడు [చండాలజాతివిశేషము]

బోయఁడు = బరువు మోయువాఁడు; మోపరి (భారవాహకుఁడు)

బోయెత = బోయజాతిస్త్రీ (శబరి)

బోయసీఁడు = కొమ్ముకాఁడు; మాదిగవానివంటి ఒకజాతి మనుష్యుఁడు

బోయి = బోయఁడు

బోర = రొమ్ము (వక్షస్థలము)

బోరుతలుపు = వాకిటిపెద్దతెక్కఁతలుపు (దళయుగకవాటము)

బోరులు = బొరిసెలు (నానలు)

బోరె = బొచ్చె; ఒకవిధమైనతలపుట్టె

బోరె = బుడిగ (కమండలువు)

బోసేసెను = తినియెను (భుజించెను)

## బ్ర

బ్రతికించెను = కాచెను; ప్రోచెను

బ్రతుకు = మనుట; బ్రతుకుట (జీవనము)
బ్రదుకు = బ్రతుకు
బ్రద్ద = వెనుక; ముక్క (శకలము)
బ్రద్దర = బ్రద్ద
బ్రమరి = బాధాదులచే స్మృతి తప్పి ఉండుట (మూర్ఛ)

## మ

మ్రుంగెను = పోయెను: చచ్చెను
మంకెన = ఎఱ్ఱనిపూవులు గల యొకచెట్టు (బంధూకము)
మంగ = మ్రంగచెట్టు (మదనము)
మంగలకత్తి = మంగలపనికి ఉపయోగించెడికత్తి (క్షురము)
మంగలము = వేపుడుచట్టి (భ్రాష్ట్రము)
మంగి = మంగలవాఁడు, మంగలి
మంగు = మొగమందలిపొడ (ముఖసిధ్మము)
మంగుడు = మంగు
మంచి = మంచివాఁడు (సజ్జనుఁడు)
మంచి = సామోపాయము [చతురుపాయములలో ఒకటి]
మంచిదె = వల్లె (సమ్మతి)
మంచివాఁడు = మంచి (సజ్జనుఁడు)

మంచివాఁడు = పుణ్యవంతుఁడు; సుకృతి

మంచు = హిమము: తుషారము

మంచుకారు = హేమంతర్తువు

మంచుఁగొండ = గుబ్బలిదొర (హిమవంతము, ప్రాలేయశైలము)

మంజాడి = వజ్రములు తూఁచుపడికట్టు

మంజిడి = రాగివంటిఎఱ్ఱనిరంగు గలవస్త్రము (మాంజిష్ఠము)

మంట = అగ్నిమంట (జ్వాల)

మంటపము = కొలువుచావడి మొదలగునది (మండపము)

మండ = విరివి యైనకొమ్మ (వితతశాఖ)

మండ = కాఁచినబంగారు ఇనుము లోనగునది (తప్తలోహము)

మండవాయి = చీలమండలయందు పుట్టువాతరోగము (గుల్ఫమారుతము)

మండిలూటి = పైకి పొటమరింక లోపల అఱఁగియుండు వ్రణము (మర్మవ్రణము)

మండీ [అ] = ఒకవిధ మగుసాము (మల్లవిద్యావిశేషము)

మండె = జొన్నకంకులు పొగాకు మున్నగువానిని అదిమి పొదుపుగా పేర్చి పెట్టినప్రోగు (రాశివిశేషము)

మండెఁగ = మెత్తనిగోదుమపిండి నెయ్యి మున్నగువానితో చేసినయొకభక్ష్యము (మండకము)

మంపము = మన్నెము: చొరరాని ప్రదేశము (దుర్గమస్థలము)

మంత్రగబ్బ = నల్లని పెద్దతేలు (పృథువృశ్చికము)

మంతనము = మంత్రశక్తి [శక్తిత్రయములో ఒకటి]

మంతరసాని = మంత్రసాని (ప్రసవమంత్రజ్ఞ)

మంతు = రాజనయవాదమునందు వినోదము కలిగించుమంత్రి (ద్యూతమంత్రి)

మంతు కెక్కినవాఁడు = పేరైనవాఁడు; ప్రసిద్ధి కెక్కినవాఁడు (విఖ్యాతుఁడు)

మంద = కిలారము; ఆవులగుంపు (గోకులము)

మందట = ధనాదినిమిత్త మైనకలహము (వ్యవహారము)

మందలింపు = మందట

మందసము = నిడుపాటిపెద్దపెట్టె (మంజూష)

మందారము = మబ్బుపట్టి యుండుట (మేఘావరణము)

మంది = మనుష్యులగుంపు (మనుష్యసమూహము)

మందు = ఔషధము

మందుపట్టడ = బాణసంచు చేసెడిసాల (బాణశాల)

మందుమల = ద్రోణపర్వతము

మందులమారి = మణిమంత్రౌషధాదులచే వశముచేసుకొనుట బాగుగా తెలిసికొనినవాఁడు (వశ్యక్రియావేది)

మందెమేలము = తచ్చన (పరిహాసము)

మక్క = పిఱుఁదుల లోని కొలఁదిభాగము; టెంకి (కటిప్రదేశము)

మస్కు = మాసినది; మురికితో కూడినది (మలినము)

మక్కువ = ప్రేముడి (ప్రేమము)

మగఁటిమి = పౌరుషము

మగఁడు = మగవాఁడు (పురుషుఁడు)

మగఁడు = పెనిమిటి (భర్త; ధవుఁడు)

మగతనము = మగఁటిమి

మగనాలు = ఐదువ; భర్త గల స్త్రీ (పతివత్ని)

మగపోల్కికూటమి = పైకూటమి (ఉపరిసురతము; పురుషాయితము)

మగరా [ఉ] = మగజా [ఉ] [వజ్రము [ఉ]

మగవాఁడు = మగఁడు (పురుషుఁడు)

మగిడెను = మరలెను; వెనుకకు తిరిగెను

మగుడ = మరల (పునరర్థకము)

మగుడు = మరుగు; గోడమీఁదికప్పు (కుడ్యవాలిక)

మగువ = పడఁతి (స్త్రీ)

మగ్గము = వస్త్రములు నేయుయంత్రము (నేఁతయంత్రము)

మగ్గరి = నేఁతకాఁడు; వస్త్రములు నేయువాఁడు (తంతువాయుఁడు)

మచ్చు = మచ్చుతు; నగలు మొదలగువాని కచ్చుకోలు; అది (చిహ్నము)

మచ్చ = పుట్టుమచ్చ (కాలకము)
మచ్చము = మచ్చ (చిహ్నము)
మచ్చరము = చలము (మాత్సర్యము)
మచ్చిక = మక్కువ (ప్రేమము)
మచ్చు = మీఁద కట్టడము లేనిమిద్దెటిల్లు (అల్పహర్మ్యము)
మచ్చెము = చేఁప (మత్స్యము)
మజ్జనము = తానము (స్నానము; మజ్జనము)
మజ్జరి = ఉత్తమ మైనఆవు (నైచికి)
మజ్జిగ = చల్ల (దండాహతము)
మజ్జా = అయ్యారె (ప్రశంస)
మటుమాయలాఁడు = టక్కరి (మాయావి)
మట్ట = ఆకుతొడిమె (పత్త్రవృంతము)
మట్టము = బుడుత; పొట్టివాఁడు (వామనుఁడు)
మట్టసము = మట్టము
మట్టసి = మట్టము
మట్టి = మృత్తిక; మన్ను (మృత్తిక)
మట్టు = మట్టము
మట్టె = స్త్రీలు కాలిరెండవవ్రేలికి ధరించునొకసొమ్ము (పదాంగుళీభూషావిశేషము)
మడఁతి = మగువ (స్త్రీ)
మడత = చలువ; ఉదికినవస్త్రము (ధౌతవస్త్రము)
మడమ = చీలమండదిగువ ఉండుపాదముయొక్క వెనుకటిభాగము, గుదికాలు (పార్ష్ణి)

| | | |
|---|---|---|
| మడి | = | పడిగ; ఏటిదగ్గఱ ఉండునేల (నదీప్రాంతము) |
| మడి | = | మహిత |
| మడి | = | ధౌతవస్త్రము, వరిమడి |
| మడి | = | కొద్దిపైరు చేయుటకైనపొలము (అల్పసస్యక్షేత్రము) |
| మడికాసు | = | వెండి (రజతము) |
| మడికాసుగట్టు | = | కైలాసపర్వతము; శివాద్రి [రజతా౦] |
| మడిపెను | = | పరిమార్చెను: చంపెను |
| మడిపెను | = | కొట్టెను (ప్రహరించెను) |
| మడియుట | = | తెగుట; చావు (మరణము) |
| మడిసెను | = | చనెను; చచ్చెను |
| మడుఁగు | = | హ్రదము, పరిశుద్ధమైనవస్త్రము |
| మడుఁగు | = | ఉదికినవస్త్రము (ధౌతవస్త్రము) |
| మడుఁగు | = | అగాధ మగుసరస్సు (హ్రదము) |
| మడువ | = | మడిచుట్టు ఏర్పఱచినచిన్నకట్ట (సేతువిశేషము) |
| మడుఁగు | = | ఎనిమిదిపీసెలబరువు, ధౌతవస్త్రము |
| మడుఁగుఁబూవు | = | ఒకపెండిపంట (కుబేరమూలము) |
| మతకరి | = | మాటుమాయలాఁడు |
| మత్తా | = | ఏనుఁగుమదము (దానము; మదము) |
| మత్తు | = | మత్తా |
| మదట | = | సోమరి; ప్రాల్మాలినవాఁడు |
| మదల | = | మదట |

మదహత్తి = ఉత్తరపదమైనప్పుడు పూర్వపదార్థముయొక్క శ్రేష్ఠతకు వాచకము [రాచమదహత్తి-మొ.]

మది = డెందము (హృదయము)

మదురు = మడులు; గోడమీఁదికప్పు

మద్దెల = మృదంగము; మర్దలము

మద్దెకసంచు = ఒకవిధమగు వంపు; మల్లయుద్ధమందలి యొకవిధమగు మొదటిగమనము (ముష్టియుద్ధాదిగతివిశేషము)

మనసు = మది

మనికట్టు = చేతిమొదలు (మణిబంధము)

మనికి = బ్రతుకు (జీవనము)

మనికితంబు = సంకిలి (మనోవ్యథ)

మనిచెను = బ్రతికించెను; పెంచెను

మనిసి = మానిసి (మనుష్యసామాన్యము)

మనుట = మనికి

మనుదిండి = విషము లేనియురుదలలపాము (డుండుభము)

మనుపాల = చిన్నపాల; పాలకూరచెట్టు (జీవంతిక)

మనుఁబిల్లి = ఒకజాతిమృగము (ఋశ్యము)

మనుఁబోతు = మనుఁబిల్లి

మనుమఁడు = కొడుకుకొడుకు, కొమార్తెకొడుకు (నప్త)

మనుమరాలు = కొడుకుకొమార్తె, కొమార్తెకొమార్తె (నప్త్రి)

మన్నన = బహుమానము; గౌరవము

మన్ని = మెడకు వెనుకభాగమున ఉండునరము (మన్య)

మన్నిక = మన్నన

మన్నిగొనెను = చంపెను (వధించెను)

మన్నింపు = మన్నన

మన్నీఁడు = నాలుగువందలయోజనములపరిమితి కలభూమిని ఏలుసామంతరాజు (మండలేశ్వరుఁడు)

మన్ను = మట్టి (మృత్తిక)

మన్ను = మనుఁబోతు; మనుఁబిల్లి

మన్నెము = మండెము; చొరరాని ప్రదేశము

మన్నెతికము = మన్నెపుదొరతనము (మండలేశత్వము)

మన్నెవాఁడు = మన్నీఁడు (మండలేశ్వరుఁడు)

మబ్బు = మొయిలు (మేఘము)

మబ్బు = లాహిరి; మద్యము త్రాగుటవలనిమత్తు (మదము)

మబ్బుత్రోవ = నింగి (ఆకాశము; మేఘవర్త్మ)

మబ్బుపూవిసుపు = నీరుపాప; మగమోములయ్య (అగ్నిదేవుఁడు)

మబ్బురవుతు = మొగులుపుదొర (మేఘవాహనుఁడు: ఇంద్రుడు; సురనాథుఁడు)

మబ్బురాయుంట = మత్తుపదార్థములు బాగుగా చేర్చి చేసిన యొకమందు

మఱ్ఱి = మఱ్ఱిచెట్టు (న్యగ్రోధము)

మల = కొండ (శైలము)

మలకిడిమ్మి = చెప్పు (పాదరక్ష)

మలంచెను = చుట్టెను (వేష్టించెను)

మలఁగ = వెనుక; ఉత్తగోనెసంచి

మలత = మురిగొనునది: గర్వించునది

మలార = మంచిగంధము (శ్రీఖండము)

మలిగె = సరుకు లుంచి అమ్మెడుదుకాణము
(ఆపణము)

మలిమిడి = పశువులముఖములకు వచ్చురోగము
(పశువార్ణరోగము)

మలుఁగు = ఒకవిధ మగుచేఁప (మత్స్యవిశేషము)

మల్లి = బల్లి [ఒకవిధ మగుమారాఁకుడు]
(సరావిశేషము)

మల్లచఱచెను = మోఁచతిపై భాగముపై పెద్దధ్వని అగునట్లు
అఱచేతితో కొట్టెను; భుజములు
అప్పళించెను

మల్లచఱుపు = దండచేతిపై అఱచేతితో కొట్టుట
(భుజసమాస్ఫాలనము; భుజాస్ఫాలనము)

మల్లచఱుపుడు = మల్లచఱుపు

మల్లరమ్మ = పొగరు (గర్వము)

మల్లారము = రాజులు గ్రుచ్చినదండ

మల్లు = మక్క. లేంటి (కళింగక దేశము)

మల్లె = కొమ్మ; చిన్నకొమ్మ (ఉపశాఖ)
మల్లె = మల్లెచెట్టు (మల్లి)
మల్లె = నిప్పు; కట్టెనిప్పు (అంగారము)
మల్లెలు = మల్లెపూలు
మళ్లెను = మరలెను; వెనుకకు మరలెను
మవ్వము = మెత్తనిది (మృదువు)
మసక = చిమ్మచీకటి; కొద్దిపాటి చీకటి (అవతమసము)
మసకము = సర్పములసంభోగము (అహిరతి)
మసటు = మాలిన్యము; మలము
మసనంబు = కాడు (శ్మశానము)
మసలెను = తిరిగెను; జాగుచేసెను [ఆలసించెను]
మసి = కర్రలు మొదలగునవి కాల్చినచో అగునల్లనిపొడి (మషి)
మస్టు = మసటు
మస్తరించెను = చేతులు అప్పళించెను; గట్టిగా తాకెను
మస్తు = మత్తు; ఏనుగుమదము
మస్తువాడు = మదించినవాడు; మద్యపానాదులచే ఒడలెరుగనివాడు (మత్తుడు)

# మా

మాందాళి = కృత్రిమమైనఒకదినుసుగరుడపచ్చ
మాగుడు = అడుగంటి మాడినఅన్నము (దగ్గిక)

మాచకమ్మ = స్త్రీపురుషలక్షణములు గల-ఆఁడుది (పోట)

మాట = వాక్యము

మాటలమారి = ప్రేలువాఁడు; చెడ్డమాటలు పెక్కులు ఆడువాఁడు (వాచాటుఁడు)

మాటికి = మరల; ఇంకొకసారి (పునరర్థకము)

మాటిమాటికి = పలుమాఱు; మాటికిమాటికి

మాటు = మఱుఁగు (వ్యవధానము)

మాడ = పదిరూకలు పరిమాణము గాఁ గలది (పణదశకము)

మాడ = అరవరా సువర్ణము (అర్ధగద్యాణము)

మాడి = అడవిదుంపవ (వనకశేరుకము)

మాడుగు = ఒక విధమగు ప్రాసాదము (ప్రాసాదభేదము)

మాడువు = మాడుగు

మాడెము = మన్నెము, కొండలప్రదేశము (దుర్గమస్థలము)

మాడ్కి = పోలికి (ఉపమ, సాదృశ్యము)

మాదాపాలు [లు] = పలురంగులు గలయొకవస్త్రము (చిత్రవస్త్రవిశేషము)

మాదిగ = గోసంగి; మాదిగవాఁడు (మాతంగుఁడు)

మాదీఫలము = మాతులుంగము

మాదిరి = మాడ్కి

మాన = నాలుగుసోలలు (కుడపము)

మానిక = మాన

మానికము – మాణిక్యము (రత్నము, మణి)

మానిసి = మనిషి (మనుష్యసామాన్యము)
మానుట = వదలుట (విసర్జనము)
మానెను = వీడెను; విడిచెను
మాపు = సాయంకాలము
మామ = భర్తతండ్రి; భార్యతండ్రి (శ్వశురుఁడు)
మామిడి = మావి; మామిడిచెట్టు (ఆమ్రము)
మామెన = నల్లసుగంధిపాల (ఉత్పలశారిబ)
మాయదారి = టక్కరి (మాయావి)
మాయలాఁడు = మాయదారి
మారిమసంగెను = చంపెను (వధించెను)
మారెను = కొట్టెను; కొట్టిచంపెను
మారేడు = బిల్వము
మార్తుఁడు = పగవాఁడు (శత్రువు; వైరి)
మాఱకము = ఒక టిచ్చి మఱియొకటి పుచ్చుకొనుట (వినిమయము)
మాఱు = బదులు (ప్రతి)
మాఱుగడ = మాఱకము
మాఱుమనుమది = రెండుతడవలు వివాహము చేసికొనినస్త్రీ (దిధిషువు)
మాఱుమసలెను = సమానముగా ప్రవర్తించెను; సరిగ ఎదిరించెను
మాఱుమాట = మఱుమాట (ప్రతివాక్యము; ప్రత్యుత్తరము)
మాలి = తోటవాఁడు (వంశపాలుఁడు)

మాలకరి = పూలమ్ము వాఁడు

మాలకాకి = పెంతకాకి (ద్రోణకాకము)

మాలఁడు = మాల

మాలిమికాఁడు = ఓపవాఁడు (నావికుఁడు)

మాలుగుఁటోతు = సోమరి; ప్రాల్మాలినవాఁడు

మాలుగులు = పల్లకీ మోయు బెస్తలుజములో నొకతెగ
తడిమహతపాత్రి

మాలె = మాడుగు; ఒకవిధ మగు ప్రాసాదము

మాలెత = చండాలజాతిస్త్రీ (చండాలిక)

మావంతుఁడు = ఏనుఁగును నడుపువాఁడు; మావటీవాఁడు
(ఆధోరణుఁడు)

మావటీఁడు = మావంతుఁడు

మావి = మామిడి (ఆమ్రము)

మావి = గర్భస్థ మగుపిండమునకు రక్షకముగా
మీఁద చుట్టుకొని యుండుమాంసపుఁబొర
(జరాయువు)

మావు = వారువము; గుఱ్ఱము (అశ్వము)

మాసటీఁడు = ఆయుధవిద్యయందు ఆరితేఱినవాఁడు
(శస్త్రదక్షుఁడు)

మాసి = కైజీతము; వెనుకకు తిరుగ నని ఒట్టు పెట్టు
కొని యుద్ధము చేయువాఁడు
(శపథాయుధజీవి; సంశప్తకుఁడు)

మాసినది = మాలిన్యము కూడినది (మలినము)

మాస్టీఁడు = మాసటీఁడు

# మి

మించు = మెఱుపు (విద్యుత్తు)

మించు = తళుకు (కిరణము)

మించు = మట్టు ప్రవర్తిలిక రానీయకుండఁ జేయుసాదా మట్టు [త్రాసు]

మించెను = పెరిఁగెను [వృద్ధిఁ బొందెను]

మిండ = పల్లికీ: పలికండ్లపాము (రక్తపుచ్ఛ)

మిండగీఁడు = అంకుమగఁడు (జారుఁడు)

మిండఁడు = మిండగీఁడు

మిక్కిలి = గొప్పది (అతిశయము, అధికము)

మిక్కిలి = మిగిలినది; ఎక్కువగా ఉన్నది (అధికము: శిష్టము)

మిక్కుటము = మిక్కిలి (అతిశయము)

మిగత = ఖర్చు పోఁగా మిగిలినసొమ్ము (లాభము)

మిగత = మిక్కిలి (అతిశయము)

మిగులు = మిగత (లాభము)

మిటారము = ఒయ్యారము (విలాసము)

మిటారి = సౌందర్యగర్వము గలయాఁడుది (స్త్రీవిశేషము)

మిటారింపు = మిటారము

మిట్టపండ్లవాఁడు = ఎత్తైనపండ్లు గలవాఁడు (దంతురుఁడు)

మిడిగ్రుడ్లవాఁడు = పైకి ఉబికినకంటిగ్రుడ్లు కలవాఁడు (ఉన్నేత్రుఁడు)

మిన్న = [ఉత్తరపదమై] పూర్వపదార్థముయొక్క శ్రేష్ఠతను తెలుపును-ఉదా:- వేలుపుమిన్న-మొ.

మిన్నక = ఊరక [మాటలాడక యుండుట] (తూష్ణీమర్థకము)

మిన్ను = బయలు (ఆకాశము)

మిరియము = ఒకవిధ మగుసంభారవస్తువు (మరీచము)

మిఱిమిడి = మోహ లేనికాంతి (మందాలోకప్రభ)

మిఱుమిట్లుగొనెను = కన్నులు చెదరునట్లు చీకట్లు క్రమ్మెను

మిట్టు = మెట్ట; మెఱక యైనది (ఉత్తానము)

మిల్లి = చిన్నగరిటె (అల్పకంబి)

మిసిమి = నున్ననిది (స్నిగ్ధము)

మిహి = మిసిమి (స్నిగ్ధము)

మిహి = క్రొత్త: అప్పటి కప్పుడు ఏర్పడినది; క్రొత్తది (నవము)

## మీ

మీఁగడ = కాఁచినపాలమీఁదితెట్టె (మండము)

మీఁగాలు = పాదముమీఁదిభాగము (పాదోపరిభాగము)

మీఁజేయి = చేతిమీఁదిప్రదేశము (కరోపరిభాగము)

మీఁది = పయిని; మీఁద ఉండుప్రదేశము (ఊర్ధ్వము)

మీట = చిన: క్రిందికి ఆడుటకు ఆధార మగునట్టితప్పు మ్రాను మొదలగునది; యంత్రపుకీలు (ఉత్పతనకీల)

మీను = మచ్ఛము; చేప (మత్స్యము)
మీరెను = మించెను [వృద్ధిఁ బొందెను]
మీఱెను = మించెను; కడచెను
మీలముచ్చు = నీటికి ఉటికి చేపలఁ బట్టుకొను పక్షి (పత్రిక)
మీలవల్లఁకి = మీలముచ్చు
మీస = పై పెదవిమీఁది వెండ్రుకలవరుస (శ్మశ్రువు)
మీసము = మీస

# ము

ముంగ = ఎన్నులమోపు (కణిశభారము)
ముంగఱ = ముక్కుఱ. ముక్కున పెంచుకొను సొమ్ము (నాసికాభూషణము)
ముంగల = ముందు ; ఎదుట (పురోఽర్థకము)
ముంగామురువు = చేతులకు ధరించెడి ఒకవిధమైనసొమ్ము (హస్తభూషావిశేషము)
ముంగాలు = కాలిముందుభాగము (పాదాగ్రము)
ముంగి = ముంగిస (నకులము)
ముంగిలి = ఇంటికి ఎదురుగా ఉండుస్థలము (అంగణము)
ముంగిస = ముంగి
ముంగురులు = నొసటియందు గునిసి ఆడెడియుంగరపు వెండ్రుకలు (భ్రమరకములు)
ముంజెరమ = చెంప; ముకుపుటము (నాసికాపుటము)

ముంజెయి = మణికట్టువఱకు కలమోఁచేతి క్రిందిభాగము (ప్రకోష్ఠము)

ముంత = నల్ల లోనగునవి పోసికొనుటకు కొయ్య మొదలగువానితో చేసినముంత (దార్వాదికలశము)

ముంత = పూరిక; రెండుతవ్వలు (కుడుపము)

ముంపిల = పొదల, తలముందుభాగము (శిరోఽగ్రము)

ముందు = మునుగల

ముందువెనుకలు = అటిముటి, తాఱుమాఱు

ముక్క = తునుక (ఖండము)

ముక్కంటి = శివుఁడు

ముక్కఱ = ముంగఱ

ముక్కాఁడి = మూఁడుకానులు (కాకణీత్రయము)

ముక్కాలిపీఁట = మూఁడుకాళ్లు అమర్చినయెత్తుబల్ల (త్రిపాస్థి)

ముక్కిఁడి = ముక్కు లేనివాఁడు (విగ్రుఁడు)

ముక్కు = నాసిక

ముక్కుస = మూఁడుకుంచములు; పండ్రెండుమానికలు (ప్రస్థత్రయము)

ముగియించెను = చంపెను (వధించెను)

ముగిసెను = మడిసెను; చచ్చెను

ముగుద = లేఁతప్రాయము కలయూఁడుది (ముగ్ధ)

ముచ్చ = తిగ; మూఁడు (త్రికము)

ముచ్చ = అఱకట; పిఱుఁదలప్రక్క ప్రదేశము (నితంబపార్శ్వము)

ముచ్చె = తిలకము; వెన్నముక క్రిందిభాగము (త్రికము)

ముచ్చట = గుసగుస; ప్రీతితోడిపరస్పరసంభాషణము

ముచ్చిపుక = మూఁడుదుగులముయి; ఆలుబేడలు

ముచ్చు = దొంగ (తస్కరుఁడు)

ముచ్చె = ఒకవిధమగుపాదరక్ష (పాదరక్షావిశేషము)

ముచ్చెవాఁడు = గోదరి, తోలుపనివాఁడు (చర్మకారుఁడు)

ముట్టు = కుసుమ (స్త్రీరజస్సు; ఆర్తవము)

ముట్టుగత = బహిష్ఠయైనస్త్రీ (ఉదక్య; ఋతుమతి)

ముట్టె = పందిమొక్క మోర (ఘృష్టిఘోణ)

ముట్టె = పశ్వాదులయొక్క నిడుపైనమొగము

ముట్టెను = అంటెను; తాఁకెను

ముడి = గుబ్బ: చెట్టు మొదలగువానిబుడిపె (గ్రంథి)

ముడికాళ్లవాఁడు = ఒకటికి ఒకటి తగులుచున్నమోఁకాళ్లు గలవాఁడు (సంజ్ఞుఁడు)

ముడిఁగెను = అడఁగెను: తగ్గెను

ముడిచె = అంటురోగము (సాంక్రామికామయము)

ముడివిడిపు = ముళ్లు విప్పువాఁడు; చొక్కా సంచులు లోనగువానిని కత్తిరించి ధనము అపహరించువాఁడు

ముడుత = ముడి

ముడుము = మోఁకాలు; తొడపిక్క నడుమ సంధుభాగము (జానువు)

ముడుసు = వెన్నెముక క్రింది చివరిభాగము; ముడ్డిపూస (గ్రంథిలాస్థి)

ముడ్డి = మూడి (గుదము)

ముణుఁగుఁదామర = సోఁకుడుముడుఁగు అనునొక ఓషధి (నమస్కారి)

ముత్తవ = చిట్టాముదపుఁజెట్టు

ముత్తవ్వ = నాయనమ్మతల్లి (ప్రపితామహి)

ముత్తాత = తాతతండ్రి (ప్రపితామహుఁడు)

ముత్తియము = నవరత్నములలో ఒకటి (మౌక్తికము)

ముత్తుము = మూఁడుపేరములు (త్ర్యాణకి)

ముత్తెము = ముత్తియము

ముత్తైదువ = వృద్ధురాలు అయినమగనాలు

ముత్యము = ముత్తియము

ముత్యాలకుచ్చు = స్త్రీలు తలను ధరించునొక కేశాభరణము (వాలపాశ్యావిశేషము)

ముదల - ఆనతి (ఆజ్ఞప్తి)

ముదిమి = ముసలితనము (వార్ధకము)

ముదివాఁడు = పెద్ద (వృద్ధుఁడు)

ముదుకు = ముదివాఁడు

ముదుప = ముదివాఁడు

ముదుసరి = ముదివాఁడు

ముద్ద = అన్నపుముద్ద (పిండము)

ముద్దరాలు = ముగుద

ముద్దియ = ముగుద (ముగ్ధ)

ముద్దు = చుంబనము
ముద్దుగలతల్లులబిడ్డఁడు = కొమరుఁడు (కుమారస్వామి; గుహుఁడు; కార్త్తికేయుఁడు)
ముద్దుగుమ్మ = మగువ (స్త్రీ)
ముద్దుటుంగరము = ముద్ర [మొహరు] గలఉంగరము (ముద్రాంగుళీయకము)
ముద్దె = తామరపూవులోనిదిమ్మె (కర్ణిక)
మున్ = ముందు (పురాభాగము)
మునగ = శిగ్రువు
మునిచీకటి = కొద్దిపాటిచీకటి (అవతమసము)
మునిమాపు = సంజ (ప్రదోషము)
మును = మున్
మునుక = మజ్జనము (స్నానము)
మునుపు = మున్
మునుము = కోయుపైరునకు ముందగుపైరు
మున్నీటిరాచూలిముక్కఁ
గెంజడలోనఁ గ్రొవ్విరి
గాఁ దాల్చికొన్నమేటి = శివుఁడు [చంద్రశేఖరుఁడు]
మున్నీరు = కడలి (సముద్రము; వననిధి)
మున్ను = మున్
మున్నాలు = మూఁడు నాలిపోఁగులదారము (త్రిసూత్రి)
మున్నేఁడు = జరిగినసంవత్సరమునకు ముందటిసంవత్సరము (పరారి)
ముప్పది = మూఁడుపదులు (త్రింశత్తు)

ముప్పరువునేల = మూఁడుకోసులమేరము (క్రోశత్రితయము)

ముప్పలము = మూఁడుపలములు (త్రిపలి)

ముప్పాతిక = నాల్గవభాగము తక్కువగా ఉన్నరూక (పాదోనపణము)

ముప్పిరి = మున్నూలు

ముప్పు = ముదిమి; ముసలితనము

ముప్పేట = మున్నూలు

ముప్పేటపేరు = మూఁడుపేటలు గల కంఠహారము (త్రిసరము)

ముమ్మొనవాలు = శూలము; [శివుని] త్రిశూలము

ముయ్యేడు = ఆఱుమాసికలు (షట్పష్ట్కము)

ముయ్యాకుపొన్న = త్రిపర్ణి

మురిపము = మిటారము; కులుకు: ఒకవిధ మగుశృంగార చేష్ట (విలాసము)

మురుము = అందుగు (గజభక్ష్య. సల్లకి: హ్రాదిని)

మురువు = మురిపము

మురువు = సౌందర్యము, చేతికడియము -[మురుగు]

ముర్వు = ఒకవిధ మగుకర్ణభూషణము (కర్ణభూషావిశేషము)

ముర్వు = పొలుపు, అందము (సౌందర్యము)

ముఱికి = తలవెండ్రుకలయందు చెమట మున్నగు వానిచే కలుగుమాలిన్యము (మూర్ధమలము)

ముఱుచీకటి = మసక [కొలఁదిపాటిచీకటి]

మటిముటిచీకటి = ముఱుచీకటి

ముఱుగుత్రోవ = దుర్వాసనతో నిండినత్రోవ (దుర్గంధపథవి)

ముఱ్ఱు = జున్నుపాలు (పీయూషము)

ములక = వాకుడువంటి ఒకవిధమగుచిన్న చెట్టు (అస్ఫుటఫలి)

ములు = ముల్లు (కంటకము)

ములుక = ఏఱువంగ; ముండ్లవంగ (కంటకి)

ములుకోల = పశువులను తోలుముల్లుకఱ్ఱ (తోత్త్రము)

ములుగు = బాధవలన కలుగుధ్వని (ఖేదధ్వని)

ములుగోరిమిడి = కోకిలాక్షము

ములుచ = చెడుగు (ధూర్తుఁడు; దుశ్శీలుఁడు)

ములుదోస = ముండ్లు గలదోస (కంటకోర్వారుకము)

ములుపెలమ = ఒకజాతిచుర్రిమాను (స్వాదుకంటకము)

ముల్లంగి = ఒకజాతిదుంప (మూలకము)

ముల్కి = చిలుకు; బాణముయొక్క కొనకు వేసెడి ఉక్కుతునుక (ఫలము)

ముల్లు = వరిలో నగువానిముల్లు (శూకము)

ముల్లుచింత = అలర్కము

ముల్లుముస్తె = ముల్లుచింత

ముల్లి = మల్లయుద్ధమునందు ఉపయోగించు ఆయుధముయొక్క కొనలు [చేతాళ్ల కొనలు]

మువ్వ = అలంకారముగా మొలత్రాడు మొదలగు వానిలో గ్రుచ్చబడిచిన్నగంట (క్షుద్రఘంటావిశేషము)

ముప్వేసము = మూఁడువేసములు

ముసగస = గుసగుస; ప్రక్కవాఁడికందని స్వర సంభాషణము (సల్లాపము)

ముసినగవు = చిన్నగవు (మందహాసము; స్మితము)

ముసిముసినగవు = ముసినగవు

## మూ

మూఁక = ప్రాణిసమూహము (సమాజము, సంఘము)

మూఁకుడు = చిప్ప; పొయ్యిమీఁద మూఁతగా ఉపయోగించెడిమట్టిపాత్ర (శరావము)

మూఁగ = వాక్కు లేనివాఁడు (మూకుఁడు)

మూఁత = మాటు (వ్యవధానము)

మూఁపు = కొప్పరము (భుజశిరస్సు; అంసము)

మూఁపురము = ఱాఁపురము; ఎద్దుయొక్క ఎత్తైన ముడివంటి భుజశిరస్సు (కకుదము)

మూడి = ముడ్డి (గుదము)

మూతి = నోరు (వక్త్రము)

మూస = మూఁగపోఁత; ముదిధాన్యము (తుషసమేతధాన్యము)

మూయు = మూఁత

మూర = రెండుచేతులకొలఁది (హస్తము)

మూరెఁడు = మూరపరిమాణము కలది

మూరం = కొప్పు, తలయందు దోఁపెడి వెండ్రుకలముడి (కబరి)

మూల = రెండుదిక్కులు కలిసిన భాగము (కోణము)

మూలకొత్తళములు = కోటగోడయందుండు దిబ్బ [బురుజు]

మూలరా[లు] = వజ్రము

మూలుగు = ఎముకలలోనుండు కొవ్వు (మజ్జ)

## మెం

మెంచ = కామధేనువురోమకూపములనుండి పుట్టిన యొకజాతివాఁడు (మ్లేచ్ఛుఁడు)

మెంటు = మెరక అయిననేల (ఉత్తానము)

మెండు = ఎక్కువ (అధికము)

మెంతి = మెంతులు (మేంధి)

మెంతి = మెంతిపైరు (మేంధి)

మెకములఱేఁడు = బొబ్బమెకము (సింహము; మృగరాజు)

మెకమెకపాటు = ఓర్వరానిఆకలిబాధ

మెక్కెను = తినియెను (భుజించెను)

మెగ్గ - బుగ్గ; సంతతధారగా పైకి ఉబికెడి ఊటనీరు (ఉత్సవిశేషము)

మెచ్చు = పడియ, చిన్నసరస్సు (అల్పసరస్సు)

మెచ్చు = పొగడ్త (స్తోత్రము; వినుతి)

మెట్టి = మెట్టు (సోపానము)

మెట్ట = మెరక (ఉత్తానము)

మెట్ట = సహజముగా చదునై నీటియాధారము లేక పండెడినేల (స్థలి)

| | |
|---|---|
| మెట్ట | = కూలుతపట్టునేల; కోసెడుదూరము (క్రోశము) |
| మెట్ట | = కొండ (శైలము) |
| మెట్ట | = ఒకదినుసుపాదరక్ష (పాదరక్షావిశేషము) |
| మెట్టతామర | = పైడితామర (స్థలపద్మము) |
| మెట్టిక | = మెట్టిక |
| మెట్టు | = మెట్టిక |
| మెట్టు | = పులిమెట్టు; పుల్లనీళ్లు (అభిషుతము) |
| మెడ | = అజ్జు; కంఠముపై భాగము (గ్రీవ) |
| మెడసూలు | = కంటె; చక్రాకార మగుకంఠాభరణభేదము |
| మెడవంపు | మెడకొనభాగము (గ్రీవాగ్రము) |
| మెదుద | = మెట్టు (అభిషుతము) |
| మెత్త | = పాన్పు; దూది మొద లగువానితో ఏర్పఱచినపఱుపు మొద లగునది (శయ్య) |
| మెత్త | = గుఱ్ఱముపల్లముక్రింద వేసెడిగంత [జీనము] |
| మెదడు | = తలయందు దుండుక్రొవ్వు (మస్తిష్కము) |
| మెదుకు | = [అన్నపు] మెతుకు (సిద్ధకము) |
| మెప్పు | = మెచ్చు |
| మెయి | = మేను (శరీరము) |
| మెరక | = మెట్ట; అకృత్రిమభూమి (స్థలి) |
| మెఱసెను | = ఒప్పెను [ప్రకాశించెను] |
| మెఱుగు | = మెఱుపు (విద్యుత్తు) |
| మెఱుగు | = కాంతి; ప్రభ |

మెఱుగు = మెఱుపు, కాంతి

మెఱుగుఁబోఁడి = మెఱుఁగువంటిశరీరము కల స్త్రీ (స్త్రీవిశేషము)

మెఱుఁగుఁబరిక్కలు = శ్రేష్ఠము లైనచుక్కలు, పగడములు

మెఱుపు = మెఱుఁగు (విద్యుత్తు)

మెఱుపు = మెఱుఁగు (కాంతి)

మెలఁకువ = మేలుకొంట; నిద్రనుండి మేల్కొనుట (అవబోధము)

మెలఁకువకాఁడు = మేలుకొని యుండుస్వభావము కలవాఁడు (జాగరూకుఁడు)

మెలఁత = మగఁటి (స్త్రీ)

మెలఁతుక = మెలఁత

మెల్ల = వినోదార్థము జనులు చేరెడి గ్రామారామాదులయందలి ప్రదేశము (నికర్షణము)

మెల్లకంటివాఁడు = ఓరగంటిచూపువాఁడు (కేకరుఁడు)

మెల్లఁగ = తిన్నఁగా (శనైరర్థకము)

మెసవుట = ఆరగింపు (భోజనము; భుక్తి)

మెసవెను = తినియెను (భక్షించెను)

## మే

మే = మేను (శరీరము)

మేఁక = చుమ్చు; [ఆఁడు] మేఁక (ఛాగి)

మేఁడి = దున్నువాఁడు పిడికిలితో పట్టుకొనుటకై నాఁగటిచివర అడ్డముగా చెక్కినచిన్న కొయ్య: మేఁడితోఁక (ముష్టిసంగ్రాహ్యదాపుచ్ఛ)

మేకు = చెక్కినమొన గలకొయ్య (శంకుభేదము)

మేకోలు = ఒప్పికోలు (సమ్మతి; అంగీకారము)

మేటి = కన్నాకు (శ్రేష్ఠము)

మేడ = ఉప్పరిగ (సౌధము; రాజగృహము)

మేడి = అత్తి (ఉదుంబరము)

మేడి = అత్తి, నాగేటిచివర

మేదరవాఁడు = వెదురుతడికలు లోనగునవి అల్లువాఁడు (వేణుకారకుఁడు)

మేదరి = మేదరవాఁడు

మేనకోడలు = పురుషునకు తోఁబుట్టినదానికొమార్తె, స్త్రీకి తోఁబుట్టినవానికొమార్తె (భాగినేయి)

మేనత్త = తండ్రితోఁబుట్టువు (పితృష్వస)

మేనబావ = తనకంటె పెద్దవాఁడైన మేనత్త మేనమామల కొడుకు

మేనమఱదలు = తనకంటె చిన్నదైన మేనమామ మేనత్తల కొమార్తె

మేనమఱఁది = తనకంటె చిన్నవాఁడైన మేనమామ మేనత్తలకొడుకు

మేనమామ = తల్లిసోదరుఁడు (మాతులుఁడు)

మేనరికము = తనతండ్రితోఁబుట్టినవారియొక్కయు, తల్లితోఁబుట్టినవారియొక్కయు దేహసంబంధసాంకర్యము

మేనల్లుఁడు = పురుషునకు తోఁబుట్టినదానికొడుకు, స్త్రీకి తోఁబుట్టినవానికొడుకు (భాగినేయుఁడు)

మేనవదినె = తనకంటె పెద్దదైన మేనమామమేనత్తల కొమార్తె

మేను = మెయి (శరీరము)

మేమఱుఁగు = బొందళము; యుద్ధాదులందు తొడుగు కొనెడియినుపచొక్కా (కవచము)

మేముదు = మేకోలు (సమ్మతి)

మేర = గడువు (మర్యాద; అవధి)

మేరగట్టు చుట్టుఁగొండ (చక్రవాళపర్వతము)

మేరువు = వీణయొక్క అగ్రము (మేరువు)

మేల్ = సేమము (క్షేమము)

మేల్ = కూరిమి (ప్రేమ)

మేల్ = పొగడ్త (ప్రశంస)

మేలము = కేళి (పరిహాసము)

మేలిమి = కడాని; పదాఱువన్నెబంగారము (అతిశుద్ధకాంచనము)

మేలిమి = బంగారము, ఉపకారము

మేలిల్లు = పైమేడ, ఒప్పు

మేలు = శుభము, అర్థము, ప్రశంస

మేలు = ఉత్తరపదమై పూర్వపదార్థశ్రేష్ఠతను తెలుపునది

మేలుకంట = మెలకువ: నిద్రనుండి మేల్కొనుట (అవబోధము)

మేలుకట్టు [లు] = చందువ [లు] (వితానము, చాందిని)

మేలుకాంచుట = మేలుకంట

మేలుకొంట = మేలుకంట

మేలువాఁడు = ఱంకుమగఁడు (జారుఁడు)

మేలువాఁడు = శుభము చేకూర్చువాఁడు (శుభకరుఁడు)

మేల్కత్తి = కరవాలు (ఖడ్గము)

మేల్బంతి = మేటి (శ్రేష్ఠము)

## మై

మై = మేను (శరీరము)

మైకోలు = మేకోలు (సమ్మతి; అంగీకారము)

మైద = గోరంట (కురంటకము)

మైమఱపు = సొలుపు (మూర్ఛ)

మైమఱుపు = మేమఱుఁగు

## మొ

మొంటె = పిల్లలు బొమ్మలదగ్గఱ ఉంచి ఆడుకొనే చాలచిన్న చేట (బ్రహ్మశూర్పము)

మొండి = కాళ్లు లేనివాఁడు (అపదుఁడు)

మొండి = కాలు చేయి మొద లగునవి తెగుట (భిన్నత్వము)
మొండికట్టె = పలువ (కుజనుఁడు)
మొండెము = తల లేనశరీరము (కబంధము)
మొండొడ్డెను = మొండితనము [మూర్ఖత్వము] వహించెను
మొక్క = మొలక (అంకురము)
మొక్కడీఁడు = చిన్నదంతములు గలయేనుఁగు, (అల్పదంతిగజము)
మొక్కళి = కెంపులయందు తళుక్కని మెఱసెడి యెక్కువకాంతి
మొక్కళీ = చిన్నదంతములు గలయేనుఁగు, సాహసుఁడు, కెంపుయొక్క ఎక్కువ ప్రకాశము
మొగడ = మొగ్గ (ముకుళము)
మొగడుదామర = ముకుఁగుదామర; ఒకయోషధి (నమస్కారి)
మొగము = ముఖము
మొగముట్టు = గుఱ్ఱము మొగమునం దుంచుభూషణము (అశ్వముఖవిభూష)
మొగమోట = సంకోచము (ముఖభీతి)
మొగరంబు = గృహమునకు ప్రధానముగా ఆధార మైనగుంజ (నికేతనాశ్రమ స్తంభము)
మొగరాడు = మొగరంబు
మొగలి = గేదఁగి (కేతకి)

| | | |
|---|---|---|
| మొరింగ | = | ఇసుకప్రమాను (వరుణము) |
| మొగవాకము | = | ఇల్లు మొదలగువానియందు ముఖభాగము (నిస్సరణము) |
| మొగసాల | = | తలవాకిటిచావడి (ముఖశాల) |
| మొగి | = | ముంగల, ముందు (పురోవర్తకము) |
| మొగులు | = | మబ్బు (మేఘము) |
| మొగులువిరి | = | నీరు (జలము) |
| మొగ్గ | = | అప్పుడే వికసింపఁగల పువ్వైన మొగ్గ (ముకుళము) |
| మొగ్గరము | = | వ్యూహము [సేనను పద్మాదివ్యూహాకారము గా ఉంచుట] |
| మొటిక | = | మొలక (అంకురము) |
| మొటిమె | = | మొగమునందు లేచెడిచిన్నగడ్డిపొక్కు (వదనవిస్ఫోటము) |
| మొట్ట | = | ఒకవిధ మగుమత్స్యము (ప్రోష్ఠి) |
| మొట్టి | = | బుడుత; పొట్టివాఁడు |
| మొత్తము | = | గుంపు (సమూహము; వర్గము) |
| మొత్తెను | = | కొట్టెను (ప్రహరించెను) |
| మొదటిది | = | మొదట ఉండెడిది (ప్రథమము) |
| మొదల్ | = | బోదె (ప్రకాండము) |
| మొదలు | = | బండాలము, వ్యాపారమునకైనమూల ద్రవ్యము (మూలధనము) |
| మొద ల్చెడుట | = | మడియుట (మరణము) |

| | | |
|---|---|---|
| మొదవు | = | తొలిచూలితావు (ప్రథమగర్భిణి) |
| మొద్దు | = | మొదల్ |
| మొన | = | కొన (అగ్రము) |
| మొన | = | సేనయొక్క ముందుభాగము (సేనాముఖము) |
| మొన | = | ఒకరాయుధవిద్య |
| మొనగాలు | = | ఒకవిధ ముగుగుఱ్ఱపునడక (అస్కందితవిశేషము) |
| మొన్న | = | ప్రకృతదినమునకు ముందటిరెండవదినము |
| మొయిలు | = | మొగులు (మేఘము) |
| మొరపనేల | = | గులకరాలభూమి (శర్కరిలభూమి) |
| మొరపము | = | గులకరాయి (శర్కర) |
| మొరసు | = | పిసాళి (అవివేకి; మూఢుఁడు) |
| మొరిఁటె | = | మొంటె; చిన్నచేట |
| మొఱ | = | రక్షింపుమని బిగ్గరగా అరుచుట; కూయి (ఆక్రోశము) |
| మొఱఁగుడు | = | మోసము (వంచన) |
| మొఱుఁగు | = | కుక్కయఱుపు (శునకారవము) |
| మొట్టి | = | మోఱ |
| మొట్టి | = | మొండి; [కాలు చేయి మొదలగునవి] తెగుట (భిన్నత్వము) |
| మొల | = | పిఱుఁదులముందటిభాగము (కటి) |
| మొలక | = | మొక్క (అంకురము) |

మొలక = మూలవ్యాధి; అర్శము

మొలనూలు = స్త్రీలు అలంకారముగా ధరించెడి మొలత్రాడు (కటిసూత్రము)

మొలవ = మొలక; మొక్క (అంకురము)

మొల్ల = కుందము

మొల్లమి = మొత్తము (సమూహము. వర్గము)

మొల్లము = మొల్లమి

మొల్లలు = మొల్లపూలు

మొసలి = మకరము

మొసలికాలు = చిమట; మకరముఖాకృతి గలపిడికొన పసుజుదానియందు చీల పట్టుకొనునట్లు అలుగువాయి అమర్చుటకు వీలుగా ఉండు ప్రదేశము

మొసలివాయి = మొసలికాలు

మొహదా = అడ్డకత్తి (కట్టసము)

మొహాళము = ఒకదినుసుకూరాకు మొక్క (మోహాళము)

# మో

మోకాలు = తొడపిక్కలసంధిభాగము (జానువు)

మోచెయి = బుజమునడుమ ఉండుబుడిపె (కూర్పరము)

మోదెను = మొత్తెను (ప్రహరించెను)

మోక = మొలక (అంకురము)

మోచెను = తాల్చెను (ఆవహించెను; ధరించెను)

మోజా = ఒకవిధమగుపాదరక్ష (పాదుకావిశేషము)

మోట = కపిలె; ఎద్దులను కట్టి బావిలోని నీరు ఎత్తిపోసెడి ఒకవిధమగుపాత్రము (ఘటీయంత్రవిశేషము)

మోటు = మొరకు (అవివేకి; మూర్ఖుడు)

మోటు = కొమ్మలు లేనిచెట్టు (స్థాణువు)

మోటు = మొద్దుగుఱ్ఱము (మూఢకహయము)

మోదము = మందారము (మేఘావరణము)

మోడి = కోపముచే మాటలాడకుండుట (కోపమౌనము)

మోడి = కోపమౌనము, విధము

మోడు = మోటు (స్థాణువు)

మోదుగ = కింశుకము

మోపరి = బోయుడు; బరువు మోయువాడు (భారవాహకుడు)

మోపెట్టుట = ఎక్కుపెట్టుట; ధనుస్సునకు నారి తగిలించుట (గుణారోహణము)

మోము = మొగము (ముఖము)

మోర = ముట్టె; పశ్వాదులయొక్క నిడుపైన మొగము

మోరు = కొండశిఖరపుకొన

మోవి = పెదవి (ఓష్ఠము)

మోవు = ముడుత పడనితాటియాకుమొలక (తాలాగ్రసంపన్నము)

మోసము = పరాకు; ఏమఱిపాటు (ప్రమాదము)

మోసల = మొగసాల, తలవాకిలిచావడి (ముఖశాల)

మోసాల = మోసల

మోసు = మొలక (అంకురము)

మోహరించెను = మొహరి జేసెను, వ్యూహముగా ఏర్పడెను

## మ్ర

మ్రగ్గెను = ముగిసెను; చచ్చెను

మ్రగ్గెను = అణగెను; తగ్గెను (కృశించెను)

## మ్రా

మ్రాకు = వృక్షము

మ్రానిపోటుపులుగు = వడ్రంగిపిట్ట (దార్వాఘాటము)

మ్రాను = మ్రాకు

## మ్రు

మ్రుగ్గు = అలికిపిమ్మట ముత్యములు లోనగువానితో లతాదులయాకారముతో చేయుఅలంకరణము (రంగవల్లి)

మ్రుచ్చిలి = దొంగతనము (చౌర్యము)

మ్రుచ్చిలి = మ్రుచ్చిమి

మ్రుచ్చు = అరఁటిపువ్వులలోని కేసరములలోపల ఉండువస్తువిశేషము(కదళీకేసరాంతర్గతాచ్ఛ సూచికానిభాంశము)

## మ్రొ

మ్రొక్కు = సలాము (నమస్కారము)

మ్రొక్కువాఁడు = దండములు ఊరక పెట్టువాఁడు (వందారువు)

మ్రొక్కెను = ఎరఁగెను (నమస్కరించెను)

## మ్రో

మ్రోఁగుడు = చప్పుడు (ధ్వని)

మ్రోఁత = మ్రోఁగుడు

మ్రోకు = నాఁగటిని కాఁడికి కట్టుమోకు (ఆబంధము)

మ్రోల = ఎదుట (పురోఽర్థము)

మ్రోసెడిది = ధ్వనించెడిఅందె మొదలగునది(ముఖరము)

## ర

రంగు = దర్శనాదులవలన ప్రీతి కలిగించునది [కాంతి, అందము మొదలగునది] (రంజనము)

రంజకము = చులుకైనమందు, తుపాకిచెవియందు కాల్చుటకై ఉంచెడిమందు

రంజణి = గాదెవలె ఉండెడికాఁగు

రంపు = శత్రు రాష్ట్రమునకు కలిగించెడి ఒత్తిడి (అవమర్దము)

రకము = రంగు

రకము = నాణెము, అందమైనది (మంజులము)

రక్కసి = పొలసుదిండి (నైరృతి)

రక్కసులు = పొలసుదిండ్లు (రాక్షసులు; అసురులు)

రచ్చ = పెద్దవీథి (రథ్య)

రజన = గడన (సంపాదనము; ఆర్జన)

రజ్జు = ప్రేలుడు; ప్రయోజనము లేనిమాట (ప్రలాపము)

రజ్జులాఁడు = బొంకరి (అసత్యవాది; అసత్యుఁడు)

రట్టడి = పెద్దధ్వని (ఆఘోషణము)

రట్టు = రట్టడి

రడ్డి = పూర్వములోనియొక తెగ

రతనపువిల్లు = ఇంద్రధనుస్సు; సురేంద్రధనువు

రతనము = మాణికము (మణి, రత్నము)

రద్ది = రట్టడి

రద్దు = రట్టడి

రవము = చెల్లుబడి; ఆజ్ఞ మొదలగునవి సాగుట

రవ = బంగారు లోనగువానితునుక (లోహశకలము)

రవగాల్ = ఒకవిధమగు గుఱ్ఱపు నడక (ఆస్కందితము)

రవడి = అప్పు (ఋణము)

రవరవ = చుఱుకు కైవకోపము

రవ = మ్రోఁత (ధ్వని; శబ్దము)

రవాయి = కెంపువలె ఉండినవంటి రాయి; కృత్రిమమగు కెంపు

రవాలు = రవగాల్

రవుతు = గుఱ్ఱపురౌతు (రాహుతుఁడు)

రసదాడి = ఒకజాతిచెఱకు (రసాలము)

రహి = రంగు (రంజనము)

## రా

రా = రాజు (నరపాలకుఁడు)

రాఁగి = తవిఁదపైరు

రాగి = ఒకలోహము (తామ్రము)

రాఁగులు = తవిఁదలు

రాచ = క్షత్త్రియజాతి

రాచది = క్షత్త్రియజాతిస్త్రీ (క్షత్త్రియాణి)

రాచపుండు = వీపున లేచెడిమహావ్రణము (రాజవ్రణము)

రాచటికమ్ము = రాచతనము (రాజత్వము; రాజధర్మము, రాజకృత్యము)

రాచవాఁడు = రాజు (క్షత్త్రియుఁడు)

రాజనము = వడ్లలో నొకభేదము (వ్రీహివిశేషము)

రాజు = రాచవాఁడు (క్షత్రియుఁడు)

రాజు = ఏలిక; క్షత్రియుఁడైనను గాకున్నను భూమి యేలువాఁడు (నరపాలకుఁడు)

రాజు = చంద్రుఁడు, క్షత్రియుఁడు, భూపతి

రాటము = ముప్పదిరెండువిన్నాణములలో ఒకటి (మల్లబంధవిశేషము)

రాట్నము = దూదినుండి నూలు తీయుయంత్రము (తంతుసంతతిసముత్పాదనయంత్రము)

రాడు = కంబము; గుంజ (స్తంభము)

రాణ = రంగు (రంజనము)

రాణ = నాణెము; అందమైనది

రాణి = దొరసాని; రాజుభార్య (రాజ్ఞి)

రాణివాసము = అంతిపురము; రాజస్త్రీలు ఉండుగృహము (శుద్ధాంతము; అంతఃపురము)

రాతిరి = రేతిరి (రాత్రి)

రాత్రిఁ దిరుగుమేటి = రక్కసి (నైరృతి)

రాపులుఁగు = రాబందు (లోహపృష్ఠము; కంకపక్షి)

రాపూవు = ఒకానొకగంధద్రవ్యము (అశ్మపుష్పము)

రాపొడి = ఆకుటాయి మున్నగువానితో రాచినప్పుడు రాలెడిపొడి (ఘృష్టరజము)

రామతమ్ము = చిలుక (శుకము)

రాములక = నేలములక (బృహతి).

రాయంచ = ఎఱ్ఱని కాళ్లు ముక్కు గలయొకజాతిహంస (రాజహంస)

రాయఁడు = రాజు (నృపాలుఁడు)

రాయవారము = రాజుగారి కొలువు సభ సంధి మొద లగునది (రాజ ...)

రాయబారి = రాజులసందేశము పరరాజులకు అందించు వాఁడు (రాజదూత)

రాయఱేకమ్ము = రాచరేకమ్ము

రాయసము = రాజులు వ్రాయుపత్త్రము (రాజలేఖ)

రాయి = కల్లు (శిల)

రాయిడి = రంపు (అపమర్దము)

రారాజు = దుర్యోధనుఁడు

రారాపు = రంపు

రారేక = ఒకవిధ ముగు చెవిసొమ్ము (కర్ణ భూషావిశేషము)

రాల్చెను = జాడించెను; విదిలించెను; దులిపెను

రావి = రావి చెట్టు (కుంజరాశనము; అశ్వత్థము)

రావిరేక = చెవికి ధరించునొకసొమ్ము (కర్ణభూషావిశేషము)

రవుతు = గుఱ్ఱపురౌతు (రాహుతుఁడు)

రాసి = ప్రోవు (రాశి)

# రి

రింగు = పింజె; ఒకవిధ మైనబట్టమడత (కచ్ఛ భేదము)

రింబ = ఉన్మాదము; పిచ్చి (ఉన్మాదము)

రిక్కదారి = మిన్ను; ఆకసము (ఆకాశము)

రిత్త = శూన్యము, ఏమియు లేనియిల్లు మొద లగునది (శూన్యము)

రిమ్మ = రింబ

రివట = చివర; చిన్నకొమ్మ (ఉపశాఖ)

రివ్వ = రివట

రివ్వ = ఒకపక్షి (పక్షి విశేషము)

## రు

రుంజ = ఒకచర్మవాద్యము (చర్మవాద్యవిశేషము)

రుటము = తీవ్రము (తీక్ష్ణము)

రుత్త = రిత్త

రుద్దుడు = తుడుచుడు (మార్జనము)

రుద్దెను = తోమెను [నిర్మల మొనరించెను; శుభ్రపఱచెను]

రుమాల = ఒకవిధ మగుతలపాగ (ఉష్ణీషవిశేషము)

రువ్వపులుఁగు = కాటుకపిట్ట (ఖంజరీటము)

## రూ

రూక = ద్రవ్యము; [illegible] (పణము)

రూకంత = రూక యంత [illegible] కలది

రొంపి = బురద (పంకము)

రొక్కము = పైకము (ధనము)

రొక్కము = పైడి; భోగస్త్రీలకు ఇచ్చు సొమ్ము (వేశ్యాభృతి)

రొట్టె = ఒకవిధ మగుభక్ష్యము (భక్ష్యభేదము)

రొడ్డుడు = రొంటుడు

రొద = గోల్లు; గుంపునుండి పుట్టిన పెద్దమ్రోత (కలకలధ్వని)

రొద = పింజ; బాణముక్రిందిచివర (పుంఖము)

రొప్ప = శ్రమాదులవలన నైనఅధికశ్వాసము

రొప్పు = రొండు

రొప్పెను = (కాండ్రు కాండ్రు మని) పులి అఱచెను [వ్యాఘ్రము ఆరవముచేసెను]

రొప్పెను = తోలెను [ఉచ్చాటనముచేసెను]

రొయ్య = చిఱుచేప (క్షుద్రాండజము)

రొల్లుడు = రొంజుడు

## రో

రో = కొనెడివస్తువున కిచ్చెడిమూల్యము; (విక్రయము)

రోకటిబండ = నేలపొన్న (క్రోష్టువిన్న; ఓషధివిశేషము)

రోకలి = ధాన్యాదులు దంచెడుసాధనము (ముసలము)

రోఁజు = ప్రయాసలవలనకలిగిన-అధికమైనశ్వాసము

రోఁజు = [illegible]

రోఁజుడు = రోంజడు

రోఁత = ఊసు (అపవాదము)

రోక = మూల, రెండుదిక్కులనడిమిప్రదేశము (కోణము)

రోయి = రొక్కము (వేశ్యాభృతి)

రోయుడు = వెతకుట, [illegible] (అన్వేషణము)

రోసము = కినుక (కోపము)

రోసెను = పరికించెను. వెదకెను (అన్వేషించెను)

## రౌ

రౌతు = రవుతు; గుఱ్ఱపురౌతు

## ఱ

ఱంకు = వ్యభిచారము, జారత్వము

ఱంకుటాలు = చెడిపె (కులట; వ్యభిచారిణి)

ఱంకులాఁడి = ఱంకుటాలు

ఱంకె = ఆఁబోతుయొక్క కంఠధ్వని (వృషభనినాదము)

ఱంతు = రద్ది; పెద్దధ్వని (ఆఘోషణము)

ఱంతు = ఎంతో భయంకర మగుధ్వని; క్రందు (అతిదారుణధ్వని)

ఱంపము = ప్రాణి శరీరములు మున్నగునవి కోయు సాధనము (క్రకచము)

ఱంప = అంపు (అంబారావధ్వని)

ఱంపిలెను = అఱచెను; ప్రేలెను; కూసెను

ఱంపు = ఱంప

ఱవికె = కంచెల, ఆడువారిఱవికె (కంచులిక)

ఱవ్వ = రట్టడి; పెద్దధ్వని (ఆఘోషణము)

## ఱా

ఱాగ = గయ్యాళి (ధూర్తయోషః దుష్టస్త్రీ)

ఱాకట్టు = కలుగజు (శిలాబంధము)

## ఱి

ఱిక్కించెను = నిక్కించెను; ఉబ్బించెను

ఱిచ్చ = ప్రమాదమున, హర్షశోకాదులచే చేష్టలు లేక యుండుట (ప్రళయము)

ఱిచ్చపాటు = ఱిచ్చ

## ఱె

ఱెక్క = ఱెక్కమొదలు; సూడు (పక్షతి)

ఱెక్క = రెట్ట; మనుష్యునిరెక్క

ఱెప్ప = కంటిరెప్ప (పక్ష్మము)

ఱెల్లు = ఒకజాతిగడ్డి: రెల్లు (కాశము)

ఱెల్లుచూలి = కొమరుఁడు (కుమారస్వామి; గుహుఁడు)

# ఱే

ఱేఁక [లు] = కూర్పనిదుప్పటి [దుప్పటిలోనిసగము]

ఱేఁచు = అడవికుక్క (వనశునకము)

ఱేఁడు = రాజు (నరపాలుఁడు)

# ఱై

ఱైక = రవిక (కంచుళిక)

ఱొచ్చు = సడి (అపవాదము: నింద)

ఱొచ్చు = బురద (పంకము)

ఱొచ్చు = గొడ్లు మొదలగువానిపేఁడ
(పశుకాదివిష్ఠ)

ఱొమ్ము = అక్కు (హృదయము)

# ఱో

ఱోలు = రుబ్బుట దంచుట లో నగువానికి ఉపయో
గించెడియొకసాధనము (ఉలూఖలము)

రోలుగ్రమాను = ఉదుక; కుసి తిరుగుటకై తలుపుక్రింద అమర్చినకొయ్యచిప్ప (కవాటమూలాలవాలము)

# ల

లంక = గుంట్రని సెనగలు: బటానులు (కలాయము)

లంక = దీవి; నీళ్ల నడిమిదిబ్బ (ద్వీపము)

లంక = తలవాకిటిప్రక్క నుండుగృహము (ప్రకోష్ఠము)

లంకింపు = దోఁపుడు; దొంగతనము (చౌర్యము)

లంకె = పసువులు లోనగువానిని గట్టెడిగుంజ (కీలకము)

లంజ = వెలయాలు; బోగముది (వేశ్య)

లంజియ = లంజ (వేశ్య)

లంజియ = ఱంకుటాలు (కులట)

లంజె = లంజ (వేశ్య)

లంజె = లంజియ (కులట) [విటకత్తె]

లంజెకాఁడు = బొజుగు (విటుఁడు; భుజంగుఁడు)

లంజెసవరము = గొంగెమగోరు: ఒకమందాకుచెట్టు (సారణి)

లంద = పెద్దబొజ్జ గలవాఁడు; బొజ్జవాఁడు (తుందిలుఁడు)

లంప = తన్ను ఇతరులు ఎఱుఁగకుండ సేయునేర్పు; దొంగనేర్పు)

లంబెన = గొలుసు; మెడయందు వేసికొను నడిహారము మొదలగునది (లలంతికావిశేషము)

లకుముకి = ట్రీట్రీ అని కూయు ఒకానొకపక్షి (టిట్టిభము)

లకోరి = ఒకవిధ నుగుపావురము (పారావతవిశేషము)

లకోం = తూపు (బాణము; శరము)

లక్క = ఎఱ్ఱనియొకరంజనద్రవ్యము [లక్క చెట్టు నుండి యేర్పడినబంక] (లాక్ష)

లక్కనంబు = ఆనవాలు (చిహ్నము)

లక్కుముడు = లక్ష్మణుడు

లగడ = చిమిడిక; ఎక్కువగా ఉడికినయన్నము (అధికపక్వాన్నము)

లగుడు = ఒకజాతిడేగ (శ్యేనవిశేషము)

లగ్గ = ముట్టడించి కోటపైకి ఎగఁబ్రాఁకుట (ప్రాకారలంఘనము)

లగ్గడింపు = కోటగోడమీఁదినుండి శత్రువులపైకి దొర్లించు ఱాతిబండలు, కొయ్యమొద్దులు, నిప్పులకుండలు మున్నగునవి (పాషాణదార్వగ్నిభాండాదికము)

లగ్గమయ్యెను = లోనయ్యెను [స్వవశ మయ్యెను]

లగ్గు = మేల్ (క్షేమము)

లచ్చి = సిరి; కలిమిచెలి (లక్ష్మి; శ్రీ)

లచ్చి = కలిమి (సంపద)
లచ్చికోడలు = పలుకుఁజెలి (సరస్వతి)
లచ్చిదొరగొమ్ము = విష్ణునిశంఖము (పాంచజన్యము)
లచ్చిమగఁడు = వెన్నుఁడు (విష్ణువు)
లచ్చిజేనెడమకన్ను = నెల (చంద్రుఁడు) [వెన్ను నెడమకన్ను]
లజ్జ = నాన; సిగ్గు (లజ్జ)
లడ్డిగ = వెదురుతో అల్లినబుట్ట పళ్లెము మొద లగునది (వేణుపాత్రము)
లట్టువ = లట్టు (లట్వా)
లత్తుక = కరఁగినపలుచనిలక్క (లాక్షారసము)
లప్ప = కమికిలి; ఎఱ్ఱముగా వంపఁబడినవ్రేళ్లు గలచేర (పాణివిశేషము)
లలి = విలాసము
లవిటి = పక్షులతోఁక (పక్షిపుచ్ఛము)
లవిటి = చెవిటి (బధిరుఁడు)
లవిటి = తోఁక; గుఱ్ఱము మొద లగువానితోఁక (పుచ్ఛము)

## లా

లాఁకకట్టు [లు] = విఱిచి కట్టినపెడచేతులకట్టు
లాఁగ = గోటియ (గర్తము; భూరంధ్రము)
లాఁగు = ముప్పదిరెండువిన్నాణములలో ఒకటి (మల్లబంధవిశేషము)

లాఁగులు = నాముఁగోసఫేవములు (మల్లవిద్యా విశేషములు)

లాఁపరాయి = తూమునఁ బడె నీటితో వచ్చుచెత్త చెదారము పోనీయనిపలక

లాక = పసుగునందు అక్కుటిక్కున గ్రుచ్చెడి వెదురుగొర్ర (అర్చ)

లాతము = యోగులచేతిబెత్తము (యోగివేత్రము)

లాయము = గుఱ్ఱపుసాల (మందుర)

లాలసరులు = గుఱ్ఱముమీఁదిపల్లములకు ఇరుప్రక్కల వ్రేలాడెడిపట్టుత్రాళ్లు

లాలి = ఉయ్యాల (డోల)

లావణము = క్రొత్తగా వచ్చినపనివారిని పట్టికయందు వ్రాసికొనుట [కొలువు మొదలిడినట్లు వ్రాయుట]

లావరి = బలియుఁడు (బలవంతుఁడు)

లావు = లవిటి; పక్షితోఁక (పక్షిపుచ్ఛము)

లావు = బల్మి; సత్తువ (శక్తి)

లావుక = ఒకజాతిపక్షి (లావకము)

లాహిరి = మబ్బు; మద్యము త్రాగుటవలనిమత్తు (మదము)

## లి

లింగరాజు = భృంగ [రాజ] పక్షి

లిక్క = గడ్డి లోనగువానిని కోసెడిచిన్నకొడవలి (అల్పలవిత్రము)

లిబ్బి = భూమ్యాదులయందు దాఁచిపెట్టఁబడి యెంతతీసినను తఱుగకుండ పెరుఁగుచుండుధనముపాఁతఱ (నిధి)

లిబ్బిదొర = జక్కులకు ఱేఁడు (కుబేరుఁడు; యక్షరాజు)

## లీ

లీగు = కొను; నడుము (మధ్యభాగము; మధ్యము)

## లుం

లుంగ = గుడ్డలమోపు (వస్త్రభారము)

లుంగి = అంగదట్టము; స్త్రీలు మొలను కట్టుకొనెడి యొకవస్త్రము; పావడ (యోషాంతరీయము)

## లూ

లూటి = దోఁపుండు, దండుగ-[ధనాదులవలననష్టము]

## లెం

లెంక = జోదు (భటుఁడు, యోధుఁడు)

లెక్క = సంఖ్యలను ఆధారముగా కొని చేసెడిలెక్క (గణితము)

లెక్కవాఁడు = కరణము (గణకుడు)

లెక్కించెను = ఎంచెను; లెక్కపెట్టెను (గణించెను)

లెప్ప = గుఱి: గురి చూచి వేసినబాణము పడెడిచోటు (పతనలక్ష్యము)

లెస్స = లగ్గు (క్షేమము)

లెస్స = బాగుగ ఉన్నది-అనుట (సాధూక్తి)

## లే

లే = కొద్ది (అల్పము)

లేఁగ = క్రొత్తగా పుట్టినదూడ (తర్ణకము)

లేఁత = లే

లేఁతి = బిడుత (బాలుఁడు)

లేకరి = వ్రాఁతకాఁడు; చక్కఁగా వ్రాఁత వ్రాయువాఁడు (లిపికారుఁడు)

లేడి = ఆఁడుజింక (మృ°)

లేదు లేదు = కాదు కాదు; అది అట్లు జరగలేదు (నఞర్థము)

లేనగవు = చిన్ననవ్వు (స్మితము)

లేప = పఱుపుపై పఱచెడిదుప్పటి (శయ్యాచ్ఛాదిని)

లేప = ఏనుఁగుపీఁపుపై పఱచెడిచిత్రకంబళి (కుథము)

లేబరము = పీసరము; ప్రయోజనము లేనిది (వ్యర్థము)
లేమ = మగువ (స్త్రీ)
లేమి = పేదఱికము (దారిద్ర్యము)

## లొ

లొంప = కొంప; చిన్నయిల్లు (అల్పగృహము)
లొచ్చు = కొంత; తక్కువది (న్యూనము)
లొటారము = లొత్త; గుంటపడినది (సుషిరము)
లొటారము = రిత్త; ఏమియు లేనిగృహము లో నగునది (శూన్యము)
లొటిపిట = ఒంటె (ఉష్ట్రము)
లొటిపిట్ట = లొటిపిట
లొట్ట = లొటారము (సుషిరము)
లొట్టకంటివాఁడు = కంటిరోగముచే అడఁగి గుంటగా ఉండి నీరు కాఱుకన్నులు కలవాఁడు (క్లిన్నదృక్కు)
లొట్టిపిట్ట = లొటిపిట
లొట్టియ = లొటిపిట
లొట్టె = లొటిపిట
లొట్టేనుఁగు = పెద్దయొంటె (మహోష్ట్రము)
లొడిత = జుట్ట (ప్రాదేశము)
లొడితిలి = లొడిత; జుత్త; జుట్ట
లొత్త = లొటారము (సుషిరము)
లొద్ద = గుంపు (వర్గము; సమూహము)

లొద్దె = లోయ; కొండలమధ్యభాగము (అచలమధ్యధర)

లొద్దుగ = లొద్దుగచెట్టు (లోధ్రము)

## లో

లోఁగిలి = ఇల్లు మొదలగునవి కట్టుటకు తగినస్థలము (వాస్తువు)

లోఁతు = మిక్కిలిపల్లమైనది (గంభీరము)

లోఁగుక్క = పావురాపల్కులు; కూకీపల్కులు (మణితము)

లోచెయ్యి = అఱచెయ్యి: చేతిలోపలిభాగము (కరతలము)

లోడి = సాము చేయుటకై త్రిప్పెడుఒకపరికరము (మల్లవిద్యాసాధనము)

లోన = లోపలిప్రదేశము; నడిమిచోటు (అంతరస్థకము)

లోనన్ = లోన

లోనయ్యేను = స్వవశమయ్యేను; వశపడెను

లోయ = లొద్ది (అచలమధ్యధర)

లోవి = లోఁతైనకుంట; పెద్దకుంట(నిమ్నభాగము)

## వ

వంకర = అంతయు ఒకేతీరుగా [ఋజువుగా] ఉండనిది (వక్రము)

పటల = జాల (సమృద్ధము)

పట్టము = చెల్లనినాణెములు మొదలగువానిని చెల్లించుటకై ఇచ్చెడిధనము (హేయదీనారముఖభాగధేయము)

పట్టము = తక్కువవన్నెమూల్యము కలదైనదీనారమునకై ఇచ్చుతలుగుధనము

వట్టివేరు = ఔరుగడ్డివేరు (ఉశీరము) [వీరణతృణమూలము]

వట్టు = ఎండినపండు (శుష్కశలాటువు)

వట్రువ = [వట్రువ] సుడి (ఋకారము)

వట్రువ = బటువు; గుండ్రనిది

వడ = మిరపకాయ మొదలగుసంభారవస్తువులు చేర్చి చేసినగారె (మాషాపూపము)

వడకు = శీతి మొదలగువానిచే వణకుట (కంపము)

వడగండ్లు = వాన కురియునప్పుడు పడురాళ్ళు (కరకలు, వర్షోపలములు)

వడముడి = భీముడు; అనిలజుడు

వడవడకు = మిక్కిలివణకుట (అధికకంపము)

వడి = రాట్నమునకు చుట్టి కదుపునకు తోలించెడి వశీకారము (తంతుసముత్పాదనయంత్రబద్ధసూత్రము)

వడి = పద్యములందలియతి, వేగము

వణితము = వంటిము, రాజధానిలోనికొంతభాగము (సీమైకదేశము)

వత్తి = ఒకవిధ మగువస్త్రపుచివరియంచు; బద్దె (దశలు)

వత్తి = దీపపువత్తి (వర్తి)

వదనిక = ఒకఓషధి; మాదనిక (వంద)

వదప = వ్యర్థ మైనమాట; పలవరింపు (ప్రలాపము)

వదరు = చేదుసొర; చేదుసొర (తిక్తాలాబువు)

వదరు = ఒకజాతిపక్షి (నిద్రాహ్వ)

వదలుట = తొలగుట, విడిచిపెట్టుట (విసర్జనము)

వదావళి = వదరు (ప్రలాపము)

వది = ముండ్లతో కప్పబడినగోయి (కంటకావరణఖాతము)

వదినె = భార్యయక్క భర్తయక్క (జాయాపతిజ్యేష్ఠలు)

వదియ = ఒకవిధ మైనగడ్డిపోగు; వంటె (తృణలవిశేషము)

వదె = వదియ

వనట = దేవురింపు; దుఃఖముతోడిమాట (పరిదేవనము)

వనపు = వనట

వనరు = వనట

వన్నియ = తెలుపు లోనగురంగు (వర్ణము)

వన్నె = వన్నియ (వర్ణము)

వన్నె = జాతి (బ్రాహ్మణాదివర్ణము)

వన్నెకాఁడు = నీటుకాఁడు (అలంకారి)

వన్నెవెదురు = ఒకవిధ మైనపూరాకుచెట్టు (వృత్తపత్రము)

వయసువాఁడు = యువ; తరుణుఁడు

వరవుసంబు = బానిసము (దాస్యము; సేవ)

వరవుడు = బంటు (దాసుఁడు, సేవకుడు)

వరసంది = మడిచుట్టు ఏర్పఱచినకట్ట; మడువ (సేతువిశేషము)

వరా = వరాహముద్ర గలబంగారునాణెము (దీనారము)

వరి = వడ్లు (వ్రీహిధాన్యము)

వరుగు = ఎండినపండు, వట్టు

వరుగుఁజేప = ఉప్పుఁజేప, ఎండినచేప (శుష్కమత్స్యము)

వరుస = పరువడి (క్రమము, ఆనుపూర్వి)

వర్గువు = మొత్తము (వర్గము, సమూహము)

వఱడు = నక్క (జంబుకము)

వఱద = వఱప (ప్రవాహము)

వఱపు = వర్షము లేకుండుట (అవగ్రహము, అనావృష్టి)

వఱలెను = మెఱసెను; ఒప్పెను

వల్లు = వలువ

వల = చేఁపలను బట్టెడియొక సాధనము (జాలము)

వలకడ = దక్షిణము (దక్షిణదిక్కు)

వలచినది = మనస్సునకు ఇష్టమైనది (ప్రియము)

వలపల = కుడిప్రక్క (దక్షిణభాగము)

వలపు = యువతియొక్కయు యువకునియొక్కయు
నిండుప్రేమ (యువయువతీసంభృతప్రేమ)

వలపుమోపరి = గాలి (పవనుఁడు, వాయువు; గంధవహుఁడు)

వలము = లావరి (బలవంతుఁడు)

వలమురి = విష్ణునిశంఖము (పాంచజన్యము)

వలమురి = దక్షిణావర్తశంఖము

వలరాజు = పూవులవిలుకాఁడు (స్మరుఁడు; మన్మథుఁడు)

వలరాజుతల్లి = లచ్చి (లక్ష్మి) [మరుతల్లి]

వలస = తీఁగలతో కట్టి ఏర్పఱచిన యావరణము
(వల్లికాపర్యాతవృతి)

వలవాఁడు = వల పన్ని మృగముల బంధించువాఁడు
(వాగురికుఁడు)

వలస = దేశము విడిచి పరదేశమునకు పోయి
నివసించుట (ప్రవాసము)

వలి = వణఁకు (కంపము)

వలి = గాలి, చల్లదనము

వలికి = ఒకానొకపక్షి (గోనర్దము)

వలికి = కాడు (శ్మశానము)

వలిపము = పల్చని, సన్ననివస్త్రము
(సూక్ష్మవస్త్రము)

వలిపిరి = వలి (కంపము)

వలిపుల = గుబ్బలిదొర (హిమాద్రి; ప్రాలేయశైలము)

వలిమొలక = వుమడి (భీముఁడు; అనిలజుఁడు)

వలుఁద = బలియుఁడు (బలవంతుఁడు)

వలుఁద = గొప్పది; పెద్ద (పృథువు)

వలువ = వలిపము

వలుపు = వలిపము

వలె = పోలిక (ఇవార్థకము; సాదృశ్యము)

వల్లె = మంచిదె (సమ్మతి)

వల్లెత్రాడు గలాఁడు = పడమటివంకఱేఁడు (వరుణుఁడు; పాశి)

వవాజకాఁడు = ఊరక వ్యర్థము లైనమాటలు మాటలాడు వాఁడు (వ్యర్థభాషుఁడు)

వసుకు = కారణము లేనితగవు (మిథ్యాభియోగము)

వస = వద (ఓషధీవిశేషము; వచ)

వసమఱెను = వేసారెను; చాల శ్రమము గలవాఁడాయెను

వసి = ముల్లు (కంటకము)

వసె = వేఁట కగుఒకదినుసుసాధనము (శంఖభేదము)

వస్త్రి = పొత్తిక; పొత్తిగుడ్డ (బాలాచ్ఛాదనము)

## వా

వా = వాయి; నోరు (వక్త్రము)

వాఁక = సెలయేఱు; కొండనుండి వచ్చెడిప్రవాహము (అచలనది; నిర్ఝరము)

వాఁకుడు = నేలములక (బృహతి)

వాఁగు = వాఁక

వాఁగుడు = మ్రోఁత (శబ్దము; ధ్వని)

వాఁడి = ప్రభావము, ప్రభుశక్తి; కోశదండబలము [శక్తిత్రయమునందు ఒకటి]

వాఁడిమి = ప్రతాపము [కోశదండములవలన కలిగిన తేజము]

వాఁపి = వాఁపురోగము గలవాఁడు (శోఫి)

వాఁపు = వాఁపురోగము (శోఫ)

వాడు = భాష; దేశభాష

వాకొనుట = చెప్పుట (వచనము)

వాక్రుచ్చుట = వాకొనుట

వాక్రుచ్చెను = పలికెను (వచించెను)

వాగళంబు = కళ్లెమునకు ముందటిభాగము (ఖలముఖము)

వాగె = గుఱ్ఱపునోటికి తగిలించెడిపగ్గము (వల్గ)

వాచరంబు = దేవురింపు; దుఃఖముకొఁడిమాట (పరిదేవనము)

వాచారపంబు = వాచరంబు

వాట్లేఁడు = చెప్లకొటఅవి; చెడ్డవాఁడు [ఇతరులకు బాధ కలిగించువాఁడు] (ఖలుఁడు)

వాడ = వాటి; వీధి

వాడ = సువాసన, వీథి

వాడి = దవ; చెఱకుకొన (తీక్ష్ణాగ్రము)

వాతెఱ = పెదవి (ఓష్ఠము)

వాతెఱ = మొగమునుండి పడినయాహారము, పెదవి

వాదు = వాదము; వాక్కలహము

వాన = వర్షము

వానకోయిల = చాతకపక్షి

వాననెచ్చెలి = వల్లెత్రాడు గలాఁడు (వరుణుఁడు, అప్పతి)

వానించెను = పైనిఁ దేలించెను; జలాదులలో మునుఁగక
పైకి తేలునట్లు చేసెను

వానీఁడు = లిబ్బిదొర (కుబేరుఁడు)

వాపోవ = మొఱ (ఆక్రోశము; ఆర్తధ్వని)

వాపోయెను = ఏడ్చెను [రోదనము చేసెను]

వాపోయెను = బొబ్బరిల్లెను; గట్టిగా అఱచెను

వామనపాతుకాఁడు = ఒకపక్షి (పక్షివిశేషము)

వామి = గడ్డిమేటి (తృణతతి)

వాయ = కొండ సందిచ్చిన నేల (శైలవిశ్లిష్టభూమి)

వాయి = వాయువు; వాతరోగము

వాయి = వా; నోరు (వక్త్రము)

వాయి = కత్తి మొదలగువాని పదునైనయంచు
(ధార)

వాయింట = ఒకదినుసుకూరాకుమొక్క (బర్బర)

వాయింపు = వాదు; వీణ మొదలగువానిమీఁద పాడెడి
పాట (వాదనము)

వాయిదార = దోదుమ్మి; వంపులు గల కత్తి

వారక = ఎడము లేకుండ; దట్టముగా (నిరంతరము)

వారకంబు = కుదువ; తాకట్టు (ఆధి)

వారిజము = బారిజము (పారిభద్రము)

వారువంబు = మావు; గుఱ్ఱము (అశ్వము)

వార్చెను = కడిగెను, ఉపాసించెను, పాసెను, ఉద్దేశించెను

వార్పు = ఆచమించుటకు తగినజలము (ఆచమనీయము)

వార్పు = గంజి (అన్నరసము)

వాటెన = కాఁడికి వేఁడికోలను కలపుత్రాడు (రజ్జుభేదము)

వాలకము = వేసము (వేషము)

వాలము = వేఁటకు ఉపయోగపడుచిఱుతపులి (వ్యాళము)

వాలు = మేల్కత్తి (ఖడ్గము)

వాలు = ఖడ్గము, పొడుగైనది

వాలుఁగన్నులు = ఒకజాతియాఁడుచేఁపలు, నిడుదకన్నులు

వాలుగ = సముద్రమునందుండు పెద్దచేఁప (వాలసిపము)

వాలుగు = వాలుగ

వాలుచూపు = ఓరచూపు (వక్రదృష్టి)

వాలుసు = మందు కుపయోగపడుచెక్క; తైలము గలఒకచెట్టు (వాతారి)

వాలుమెకము = పంది (ఘృష్టి)

వాల్గంటి = దీర్ఘము లైనకన్నులు గలయాఁడుది (స్త్రీవిశేషము)

వాల్గంటి = కత్తిదెబ్బవలనిగాయము, పద్మనేత్ర

వావాదు = మాటాడుట కైనప్రారంభము (ఉపన్యాసము)

వావి = సంబంధమున కగుయోగ్యత; వరుస (భావము)

వావిలి = సిందువారము

వావురము = వారువంబు (అశ్వము)

వాసము = కప్పునకు ఆధారము గా ద్వారముమీఁద ఉండెడు అడ్డకమ్మి (ఛదిరాధారము)

వాసి = ఎత్తైనవాఁడు (ఉన్నతుఁడు)

వాసి = విడు పైనది; అడ్డపుఁబొడుగు గలది (దీర్ఘము; ఆయతము)

వాసెగ్రోలు = పిల్లనగ్రోవి (వంశనాళము)

వాసైనవాఁడు = పే రైనవాఁడు; ప్రసిద్ధి కెక్కినవాఁడు (ఖ్యాతుఁడు)

## వి

వింటాలము = ముప్పదిరెండువిన్నాణములలో ఒకటి (మల్లబంధవిశేషము)

వింటిపసి = ఖేచరగవి; కామధేనువు [స్వర్గపి]

వింటివాఁడు = విలుకాఁడు;విల్లు పట్టినవాఁడు

వింజము = వింధ్యశైలము

వింజామర = తెల్లనిచామరము (చామరము)

విందు = అతిథిపూజ; మనుష్యయజ్ఞము

విందు = అతిథి

విందుపురువు = ఈఁగపులి; ఒకజాతిసాలెపురుగు (లూతావిశేషము)

విందులు = చుట్టములు (బంధువులు; బాంధవులు)

విచ్చుటాకు = చెవ్వాకు; స్త్రీలు చెవులయందు ధరించెడి లక్కపూసినతాటాకు (కర్ణపత్త్రము)

విచ్చెను = విరిసెను; పగిలెను

విచ్చేసెను = చనుదెంచెను; వచ్చెను

విటకాఁడు = బొజుఁగు (విటుఁడు; వేశ్యాపతి)

విటతాటము = కీళ్లు విఱిచిపెట్టుట,దయ్యము పట్టియుండుట

విటతాటము = కీలు కీలు విఱుచుట

విదఁబడెను = విడువఁబడియెను; విచ్చలవిడిగా ఉండెను

విడి = వదలుట; వదలిపెట్టుట (విసర్జనము)

విడి = కెంపుయొక్క ప్రకాశము

విడిది = బిడారు: సేన దిగి యుండుచోటు (నివేశము; శిబిరము)

విడిముడి గలవాఁడు = ఆస్తికాఁడు (ధనవంతుఁడు; ఆఢ్యుఁడు)

విడియము = వీడ్యము (తాంబూలము)

విడివడినది = హద్దు మీఱినది (విశృంఖలము)

విడుట = విడి (విసర్జనము)

విడుదల = విడి (విసర్జనము)

విడుపు = విడి (విసర్జనము)

విదేము = విడియము

విద్యము = విడియము

వితమరి = ఆరంభించినపని వదలక నెఱవేర్చువాఁడు (కర్మదక్షుఁడు)

వితము = చందము (విధము; ప్రకారము)

వితా = ప్రయోజనము లేనిది (వృథా; వ్యర్థము)

విత్త = మిక్కిలిచిన్నగోనసంచి (అత్యల్పగోణి)

విత్తనము = గింజ (బీజము)

విత్తు = విత్తనము (బీజము)

విత్తు = పసరు (వీర్యము; పురుషరేతస్సు)

విదియ = రెండవతిథి (ద్వితీయ)

వినిచెను = వినఁబడెను; విననాయెను

వినుచూలి = గాడ్పు (పవనుఁడు; వాయువు) [నభోజాతుఁడు]

వినుప్రోల్దొర = తూరుపుదొర (సురనాథుఁడు; ఇంద్రుఁడు) [దివస్పతి]

వినువాఁక = తెలియేఱు (సురగంగ; ఆకాశగంగ)

వినెను = ఆలించెను: వినియెను

విన్నాణము = నేరుపు, బ్రహ్మజ్ఞానము కానిజ్ఞానము; శిల్పాదులయందలిజ్ఞానము (విజ్ఞానము)

| | |
|---|---|
| విన్ను | = మిన్ను (ఆకాశము) |
| విప్పుగన్ను మొత్తము | |
| పడవాలు | = వెల్లుచూలి [వేల్పులదళవాయి] (గుహుఁడు; కుమారస్వామి) |
| విబూది | = బూది (భూతి; విభూతి) |
| వియ్యంకుఁడు | = పెండ్లికొమార్తెతండ్రి, పెండ్లికొమారుని తండ్రి [ఒకరి కొకరు] |
| వియ్యంపురాలు | = పెండ్లికొమార్తెతల్లి, పెండ్లికొమారునితల్లి [ఒకరి కొకరు] |
| వియ్యంపుసాని | = వియ్యంపురాలు |
| వియ్యము | = వియ్యంకుఁడు |
| వియ్యము | = వియ్యంకులధర్మము(వైవాహికసంబంధము) |
| విరటుఁడు | = విరాటరాజు |
| విరవాది | = ఒకజాతిజాజి (నవమల్లిక) |
| విరి | = పువ్వు (పుష్పము; సుమము) |
| విరిగి | = ఒకచెట్టు (శేలువు; శ్లేష్మాతకము) |
| విఱిగి | = పగుల్లువాఱినభూమి (స్ఫోటపృధివి) |
| విఱిగెను | = విరిసెను; బ్రద్దలాయెను |
| విఱుగు | = ఓటమి (అపజయము) |
| విఱుగుడు | = విఱుగు |
| విఱుపు | = విఱుగు |
| విలిచెను | = పిలిచెను |
| విలిచెను | = అమ్మెను, వెలకు వస్తువులను ఇచ్చెను [విక్రయించెను] |

విలుకాఁడు = ధనుస్సు ధరించినవాఁడు (ధన్వి)

విలువ = వెల (విక్రయము: క్రయధనము)

విల్లు = ధనువు

విసదారి = పాము (సర్పము)

విసనకఱ్ఱ = గాలికై విసరుకొనువీవన, సురటి (వ్యజనము)

విసబొద్ది = ఒకానొక యోషధి (పాఁ)

విసము = చిలువము (విషము)

విసరు = ఒకఆయుధవిద్య (శస్త్రవిద్యాభేదము)

విసిపలక = పరుండెడిపెద్దబల్ల (శయ్యార్థఫలకము)

విసివెను = వస మఱెను; బడలెను

విసువాసి = నమ్మకము గలవాఁడు (విశ్వాసి)

## వీ

వీఁగెను = గర్వించెను

వీచెను = తోలెను [ఉచ్చాటనముఁ జేసెను]

వీడియము = విడియము (తాంబూలము)

వీడు = ఒకవస్తు విచ్చి దానికి మాఱుగా గ్రహించెడిమఱియొకవస్తువు (అపమిత్యకము)

వీడు = ప్రత్యపకారము, గ్రామము

వీడు = ప్రోలు (పురము)

వీడుకోలు = విడుట (విసర్జనము)

వీడుపట్టు = వీడిది (నివేశము; శిబిరము)

వీడెను = జాఱెను [చ్యుతమయ్యెను]

వీడెను = మానెను. విడిచెను; చాలించెను

వీడెము = వీడియమ్ము

వీడ్పాటు = తెంపుబాటు; తాఱుమాఱు (వ్యత్యయము)

వీడ్యము = వీడియమ్ము

వీణము = దుప్పటి; రెండుబట్టలు కలిసి కుట్టినమూతెర బట్ట [హంసావళి]

వీణియ = ఒకతంత్రీవాద్యము (వీణ)

వీణె = వీణియ

వీణెకాఁడు = వీణె వాయించువాఁడు (వైణికుఁడు)

వీను = చెవి (శ్రవణము)

వీపు = వెన్ను: వెనుకమేను (పృష్ఠము)

వీరమద్దె = కాలిబొటనవ్రేలికి తగిలించునొకసొమ్ము (పదాంగులీభూష)

వీరణంబు = ఒకచర్మవాద్యము

వీరాణము = ఒకచర్మవాద్యము

వీఱిఁడి = వెట్టివాఁడు (ఉన్మాది)

వీవన - విసనకఱ్ఱ

వీసము = రూకలోనిపదునాఱ్గవభాగము; నాలుగు కానులు (పణషోడశాంశము)

వీసరము = లేబరము (వ్యర్థము)

వీసె = ఇరువదిపలములు (వింశతిపలి)

# వె

వెంగలి = పిచ్చివాఁడు (ఉన్మాది)

వెంట = తోడు (సహాయుఁడు, సాహ్యము)

వెంట = వెనుక; వెనుకప్రదేశము (పృష్ఠభాగము)

వెంటము = అనుభవింపనివస్తువును గూర్చినయుబలాటము (కుతూహలము)

వెంటి = గడ్డితో పేనినత్రాడు (తృణరజ్జువు)

వెంట్రువ = ఒకజాతిముంగిస (బభ్రువు)

వెండి = మడికాసు; పంచలోహములలో ఒకటి (రజతము)

వెండి = మఱియు, రజతము

వెండి = మగుడ; మరల (పునరర్థకము)

వెండ్రుక = తలవెండ్రుక (కేశము)

వెంపలి = చాలచిన్నదైనయొకానొకచెట్టు (శరపుంఖ)

వెంబడి = వెంట (పృష్ఠభాగము)

వెంబరవిత్తు = వెంగలి

వెకలి = వెంగలి

వెక్క = వేఁడి (ఉష్ణము)

వెక్క = వేఁకి (జ్వరము)

వెక్కిలి = ఎక్కిలి (హిక్క)

వెక్కు = వెక్కిలి

వెక్కురు = ఏవగింపు (వికృతము; వికృతి)

వెగటు = భరింపరానివాసన (వికటగంధము)

వెగడు = అచ్చెరువు (ఆశ్చర్యము)

వెచ్చ = వేఁడి (ఉష్ణము)

వెచ్చ = వేఁకి (జ్వరము)

వెచ్చన = వెచ్చ; వేఁడి (ఉష్ణము)

వెచ్చెను = కందెను; క్రాఁగెను

వెజ్జు = వైద్యుఁడు; చికిత్సకుఁడు

వెట్ట = వెచ్చన (ఉష్ణము)

వెట్టి = కూలిలేని కష్టము (విష్టి)

వెడఁగు = వెంగలి; వెట్టివాఁడు

వెడఁద = విరివి యైనది (విశాలము)

వెడలించెను = తొలఁగించెను; తోలెను [ఉచ్చాటనముఁ
జేసెను]

వెడలుట = బయలుదేఱుట (నిర్గమనము)

వెడలెను = తరలెను; వెళ్లెను

వెడలుపు = వెడల్పు; వస్త్రము మొదలగువాని కొలది
(పరిణాహము)

వెదవిలుకాఁడు = వలరాజు (మన్మథుఁడు)

వెఱతురు = శరీరము

వెత = బాధ (బాధ; వ్యథ)

వెతారము = వెత

వెద = ఒకవిధమగు కేశబంధము

వెద = పశ్వాదులు గర్భము కలిగించుట
(బీజావాపము)

వెదకుట = రోయుట; వెతకుట (అన్వేషణము)

వెదకెను = వెతకెను (అన్వేషించెను)

వెదవల్లెను = చల్లెను; విత్తనములు లో నగువానిని
నలుదిక్కులకును పడునట్లు వేసెను

వెదమొదవు = వెదనైన ఆఁబోతుచే వెంటాడఁబడిన ఆవు
(సంధిని)

వెదురు = గట్టివెదురు (వేణువు)

వెనకయ్య = పిళ్లారి (విఘ్నేశ్వరుఁడు; వినాయకుఁడు)

వెనకుడు = [illegible]కుడు

వెనకెను = వెదకెను

వెనుక = వెంబడి (పృష్ఠము)

వెన్న = వెన్నపూస; పెరుగు చిలికి తీయునది
(నవనీతము)

వెన్నడాయి = ఒకపక్షి (పక్షివిశేషము)

వెన్నముద్ద = చంద్రుఁడు; ముద్దగా చేసిన వెన్న;
[నవనీతముటిక]

వెన్నాడెను = వెంటఁబడెను; వెంబడించెను

వెన్ను = వీపు (చరమాంగము

వెన్నుండు = విష్ణువు; నలినాక్షుఁడు

వెన్నునడుగు = విన్ను (ఆకాశము; నభంబు) [విష్ణుపదము]

వెన్నెల = రేయెండ (చంద్రిక)

వెన్నెల = ఒకవిధ మగు ముక్తాహారము (నతివిశేషము)

వెన్నెల = ఒకవిధమగు ముక్తాహారము వెన్నెల

వెన్నెలగుత్తి = చందురుఁడు (చంద్రుఁడు)

వెన్నెలపిట్ట = వెన్నెల తిని బ్రతుకు ఒకజాతిపిట్ట(చకోరము)

వెన్నెలరాయఁడు = చందమామ; వెన్నెలగుత్తి

వెన్వెంట = వెనుక

వెఱ = బెదరు (అధైర్యము; అధృతి: భయము)

వెఱఁగు = వెగడు; సోద్దెము (ఆశ్చర్యము)

వెఱఁగుపడువాఁడు = కోశి; ఆశ్చర్యపడెడివాఁడు (విస్మయాన్వితుఁడు)

వెఱచెను = జడిసెను [భయముఁ జెందెను]

వెఱపరి = అళుకరి; పిఱికి (భయశీలుఁడు)

వెఱపు = వెఱ

వెఱ్ఱి = ఉమ్మాదము; పిచ్చి (ఉన్మాదము)

వెఱ్ఱి = వెకలి; పిచ్చివాఁడు (ఉన్మాది)

వెల = విలువ (మూల్యము; విక్రయము)

వెలఁగ = కపిత్థము

వెలఁది = లేమ (స్త్రీ)

వెలఁదుక = వెలఁది

వెలచెను = తోమెను (నిర్మలపఱచెను)

వెలమ = ఒకవృక్షము (ధవము)

వెలమసంది = ఒక విధమగు వేము (కాకజంఘ)

వెలయాలు = భోగముది (వేశ్య)

వెలవ = కాఁపుడుగంజి (విలేపి)'

వెలసెను = వఱలెను; ఒప్పెను

వెలార్చెను = వెదచల్లెను

వెలి = తెల్లవన్నె: తెలుపు (శుక్లము)

వెలి = బహిఃప్రదేశము, వెలుపు

వెలి = బయట: వెలుపల (బహిరర్థకము)

వెలికి = ఒకానొక చిన్నమొక్క: ఒకయోషధి (పింఛికము)

వెలికిలఁబడుతొడుకు = వింటేవు (కామధేనువు; ఫేనంగవి)

వెలిగిడ్డి = వెలికిలఁబడుతొడుకు

వెలిగ్రుక్క = కూకీపలుకులు; రతికాలమున స్త్రీలు చేసెడి అవ్యక్తధ్వని (మణితకూజితము)

వెలిచె = ఒకానొకపిట్ట (వర్తకము)

వెలితి = పలుచన; పలుచగా ఉండునది (నిర్మలము)

వెలిదమ్మి = తెల్లదమ్మి: తెల్లదామర (పుండరీకము)

వెలిఁబడ్డవాఁడు = సంఘాములనుండి వెడలఁగొట్టఁబడినవాఁడు (బహిష్కృతుఁడు)

వెలిమిడి = పిడుకనిప్పుబూడిద (భస్మవిశేషము)

వెలుఁగు = జ్యోతి (ప్రకాశము; జ్యోతిస్సు)

వెలుఁగు = కంచె, కాంతి

వెలుఁగు = ఊరుచుట్టు వేయు ఆవరణము(ప్రాచీనము)

వెలుపట = బయట; వెలి (బహిరర్థము)

వెలుపుడు = తోడుకుడు; నూలు తోఁడుట (తంతుప్రసారణము)

వెలువడుట = వెడలుట; బయలుదేఱుట (నిర్గమనము)

వెలువడెను = వెడలెను; బయలువెడలెను

వెల్మ = వెలమ; శూద్రులలోనియొక తెగ

వెల్ల = తెలుపు (శుక్లము)
వెల్లదమ్మి = తెల్లదమ్మి; తెల్లదామర (పుండరీకము)
వెల్లన = వెల్ల
వెల్లాటకత్తె = లంజ, భోగముది
వెల్లి = అ[illegible] ప్రవాహము
వెల్లుల్లి = తెల్లయుల్లి (లశునము)
వెల్లువ = వెల్లి
వెల్లెలుక = ఒకజాతియెలుక (మూషకభేదము)
వెళుపు = [illegible]ము (విలాసము)
వెళ్లఁదన్నెను = వెడలించెను (ఉచ్చాటనముఁ జేసెను)
వెళ్లెను = పోయెను; చచ్చెను
వెళ్లెను = వెడలెను (నిర్గమించెను)
వెసన్ = [illegible]; వేగముగా (ఝటిత్యర్థకము)
వెసల = చిన్నకుండ (అల్పభాండము)

## వే

వే = వెసన్
వేంచేసెను = విచ్చేసెను; వచ్చెను
వేఁకరి = ఒకజాతి కిరాతుఁడు
వేఁకి = వెచ్చ (జ్వరము)
వేఁగి = ఒకజాతిమద్దిచెట్టు (పీతసాలము)
వేఁగి = [illegible], వేఁట కుపయోగపడుచిఱుతపులి (వ్యాళము)

వేఁగిస = వేఁగి (పిలినాలము)

వేఁగెను = వెచ్చెను; వేఁడిమిచే మాఁగియుకొంగుసు పొందెను; కమలెను

వేఁట = మృగములు లో నగువానిని వెంటాడి చంపుట (మృగయ)

వేఁట = గొఱ్ఱెపోతు, మృగయ

వేఁటకాఁడు = వెంటాడువాఁడు (మృగయుఁడు)

వేఁడి = వెట్ట (ఉష్ణము)

వేఁడికోలు = ప్రార్థన; అభ్యర్థనము

వేఁడిమి = వాఁడిమి (ప్రతాపము)

వేఁడుట = ప్రార్థించుట (యాచ్ఞ)

వేఁదుట దైన్యముతో అడుగుట (యాచ్ఞ)

వేఁదువాఁడు = ధనాదులను 'దేహి' అని అడుగువాఁడు (యాచకుఁడు)

వేఁదుఱు = వెఱ్ఱి: పిచ్చివాఁడు (ఉన్మాది)

వేఁపి = కుక్క (శునకము)

వేకువ = ప్రాతఃకాలము; ప్రభాతము

వేగంటి = మబ్బురవుసు (ఇంద్రుఁడు, మేఘవాహనుఁడు) [సహస్రాక్షుఁడు]

వెగరులు = రాజులకు పరరాజులసమాచారములు తెలుపుబాధపురుషులు (చారులు)

వేరము = చెరచెర (వేగముగా)

వేగు = తెల్లవాఱుగా

వేగులవారు = వేగుపలు
వేగెను = తెలవారెను
వేదఱము = బూతు (అబద్ధము: అర్థశూన్య మగుమాట)
వేడుక = వెంటుకు (కుతూహలము)
వేడుకగాఁడు = లంజెకాఁడు (విటుఁడు)
వేడెము = ఒకవిధ మగుగుఱ్ఱపునడక (రేచితము)
వేడ్క = వేడుక
వేదు = వెగటు; భరింపరానివాసన (వికటగంధము)
వేనలి = అల్లినజడ (వేణి)
వేమఱు = మాటిమాటికి; చీటికిమాటికి; అన్నిటికి (సమార్థకము)
వేము = వేపచెట్టు (నింబము)
వేయంచులలుఁగు = బాణపుకత్తి (చక్రము; సుదర్శనము) [సహస్రారము]
వెయి = పదినూర్లు (సహస్రము)
వేరము = పగ (వైరము)
వేరము = వైరము, వేగము
వేరు = దుంప (మూలము)
వేఱు = భేదోపాయము [చతురుపాయములలో ఒకటి]
వేఱు = వెఱ; వేఱొకటి (ఇతరము)
వేలము = వీడుపట్టు; విడిది (నివేశము; శిబిరము)
వేలిమి = గృహస్థు చేయుదినత్యాగ్నిహోత్రము (దేవయజ్ఞము)

వేలుపులబోనముపుట్టిక = వెన్నెలరాయఁడు; వేలుపులబువ్వ (చంద్రుఁడు)

వేలుపుసాని = సోదె చెప్పెడిది (దైవజ్ఞ)

వేల్పుటకూడు = అమృతము; సుధ

వేల్పుమొగము = మబ్బుపూఁగవ్ర (అగ్నిదేవుఁడు) [దేవముఖవ]

వేల్పులయిల్లు = పసిండిగట్టు (మేరుపర్వతము, హేమాద్రి, సురాలయము)

వేల్పులు = వెలుఁగంటులు (సురలు; అనిమేషులు; దేవతలు)

వేశము = వేగము, సేన విడిచినచోటు-[పాళెము]

వేశాకోశము = వెఱ్ఱి (ఉన్మాదము)

వేవన్నెలపసిండిగట్టు = వేల్పులయిల్లు [సువర్ణాద్రి]

వేవి = వేఁగు; తెల్లవాఱఁగా

వేవిళ్లు = బయ్యంకలు (దౌహృదము)

వేవెను = వేగెను; తెల్లవాఱెను

వేవెలుఁగు = మినురతనమ్ము (సూర్యుఁడు; సహస్రాంశువు)

వేసఁగి = గ్రీష్మఋతువు

వేసటము = కంచరగాడిదె (వ్యాసటిక)

వేసడము = ఒకజాతిడేగ

వేసడంబు = వేసటము (వ్యాసటిక)

వేసరము = కంచరగాడిద, ఒకజాతిడేగ

వేసము = వాలకము (వేషము)

వేసవి = వేసఁగి

వేసారెను = విసివెను; చాలశ్రమము కలవాఁడాయెను,

## వై

వైనము = వక్కాణ (వాఖ్యానము)

వైరవులు = నిప్పు; కట్టెనిప్పు (అంగారము)

వైరాలు = వైరవులు

వైశము = సేఁరము [శ్రీమము]

## వ్ర

వ్రంః = సెలయేఱు, కొండనుండి వచ్చెడియేఱు (అచలనది)

వ్రక్క = ముక్క; తునక (శకలము)

వ్రప్పు = వ్రక్క

వ్రయ్య = వ్రక్క

## వ్రా

వ్రాఁత = లిపి; అక్షరవిన్యాసము

వ్రాఁతకాఁడు = లేకరి; చక్కఁగా వ్రాఁత వ్రాయువాఁడు (లిపికారకుఁడు)

# వ్రే

వ్రేఁకటి = నెలలు (గర్భము)

వ్రేఁగులు = బరువులు (భారములు)

వ్రేత = గొల్లత; గొల్లకులపుస్త్రీ (గోపిక)

వ్రేపల్లె = గొల్లపల్లె (ఘోషము)

వ్రేలు = అంగుళి; అంగుళము

వ్రేల్మిడి = చిటిక; చిటికవేయునంతకాలము (క్షణిక)

వ్రేసెను = మోదెను (ప్రహరించెను)

# స

సంకటము = అమ్మఁబడెడివస్తువు (పణ్యద్రవ్యము)

సంకటి = చిక్కఁగా కాఁచినఅంబలి (పిష్టవిశేషము)

సంకు = బూరగొమ్ము (శంఖము)

సంకు = ఓలి (కన్యాశుల్కము)

సంకులవాఁడు = శంఖములు బాగుచేయువాఁడు (శాంఖికుఁడు)

సంకెల = బంధనమునకగు ఇనుపగొలుసు (శృంఖల)

సంగడము = సాము చేయుటకై త్రిప్పెడు నొకపరికరము (మల్లవిద్యాసాధనము)

సంగరము = రెండుసిద్దెలను చే[illegible] మొలిక ([illegible])

సంగడి = పొందు (మైత్రీభావము; స్నేహము)

సంగడికాఁడు = నెయ్యుఁడు (మిత్రుఁడు)

సంగడీఁడు = సంగడికాఁడు

సంచి = ఒకవిధమగు చిన్నగోనె (అల్పగోణీవిశేషము)

సంచు = కొద్దిపాటిధ్వని, రతి

సంజ = పూఁట (సంధ్య)

సంతసము = సంతోషము, సంతుష్టి

సంతు = వంగసము (వంశము)

సంతోసము = సంతసము (సంతోషము)

సందడికాండ్రు = చిల్లరవాండ్రు (ఉపసర్జనులు; అప్రధానులు)

సంది = దండచెయ్యి (ప్రగండము)

సంది = సంధి [షడ్గుణములలో ఒకటి]

సందికడియము = దండకడియము (కేయూరము; భుజకీర్తి)

సందిదండ = సందికడియము

సందియము = సందేహము

సందిలి = సంది (ప్రగండము)

సందు = కొద్దిపాటిత్రోవ, మల్లవిద్యావిశేషము

సందుసీసము ముప్పదిరెండువిన్నాణములలో ఒకటి (మల్లబంధవిశేషము)

సంద్రము = మున్నీరు (సముద్రము; వనధి)

సంపంగి = సంపెంగ (చంపకము)

సంపెఁగ = సంపంగి

సంబరేను = చర్మకము; చర్మకష

సంబళకాఁడు = జీతగాఁడు [పని చేసి జీతము తీసికొని బ్రతుకువాఁడు] (వైతనికుఁడు)

సంబళము = జీతము [చేసినపనికి ప్రతిఫలముగా ఇచ్చు ధనము] (వేతనము)

సందారు = కూరలలో వేయురసవర్గము; ఆవాలు మెంతులు మొదలగునవి (వేసవారము, సంస్కారము)

సంచెల = సమ్మెట [ఇనుము నాఁగఁగొట్టెడి పెద్ద సుత్తి] (శంబళి)

సంవెల = తమలపాకులు పక్కలవి ఉంచుకొను బరిణె (సంపుటము)

సకి = పంఁతి (స్త్రీ)

సకి = చెలికత్తె (సఖి)

సకిన = రత్నములు మొదలగువానితో చేసినపక్షి (కృత్రిమవిహంగము)

సకనము = శకునము. శుభసూచకనిమిత్తము

సకినాలపులుఁగు = పైఁడికంటి (కనకాక్షి)

సకియ = సకి (సఖి)

సకిరింత = గుఱ్ఱపుధ్వని (హేష)

సకిలింపు = సకిరింత

సగటు = చదరంగపుసందలిపెకటు (ద్యూతశకటము)

సగటు = సరాసరి; సరి చూడఁగా నగుసమత్వము (సామాన్యము)

సగము = అర; సగభాగము (సమాంశము)

సజ్జ = మేడ (సౌధము)

సజ్జ = అయితము (సన్నాహము, సంపద్ధము)

సజ్జ = సజ్జపైరు; ఒకదినుసుకాయధాన్యము (సర్జము)

సజ్జరసము = మద్దివృక్షముయొక్క బొంకతో ఏర్పడునొక సూపద్రవ్యము (సర్జరసము)

సజ్జారము = గజశాలః సామజాగారము

సట = బొంకు (అసత్యము)

సడ = లెం; పట్ట మగువాఋవరుస

సడి = నిందు (అపవాదము; నింద)

సడికియ = కుక్కమెడకు కట్టెడిత్రాడు (శ్వగళరజ్జువు)

సడింపులు = ఎసరుపోయకము; దంపి బాగు చేసినబియ్యము

సడుగు = ఒడిగొణైము, వంకరమాట (వక్రోక్తి)

సడ్డ సేయనది = చేయంగానిది; లక్ష్యము చేయనిది (అకృతలక్ష్యము)

సత = ఏడు (సప్తసంఖ్య)

సత్తి = దుర్గ (పార్వతి; దుర్గ)

సత్తి = దయ్యము (పిశాచము)

సత్తి = బల్మి (సామర్థ్యము; శక్తి)

సత్తు = పిండి; బియ్యములో నగువానిపొడి (సక్తుకము)

సత్తువ = సత్తి (శక్తి)

సద = ఆకుమీంగినసూంగు (భదరజస్సు)

**సదమద మొనర్చెను = పరిమార్చెను (వధించెను)**

సదాయ = వంకర గల్గి ఋజువుగా ఉండక ఎత్తైనది (ప్రోన్నతము)

సదాప = ఒకానొకచెట్టు (మధురిక)

సద్దు = చప్పుడు (ధ్వని; శబ్దము)

సన్నపిల్లి = చెలఁది; సాలెపురుగు (లూత)

సన్నంబు = కొద్ది (అల్పము)

సన్నకల్లు = సన్నికల్లు; నూఱెడిఱాయి (పేషణశిల)

సన్నెకల్లు = సన్నకల్లు

సప్పై = దారములవలన ఏర్పడినబొమ్మ (తాంతవప్రతికృతి)

సబము = పీనుంగు (శవము)

సబ్బు = చౌకారము. వస్త్రములమురికి పోఁగొట్టుట కుపయోగించెడివస్తువు (వస్త్రధావనపదార్థము)

సమకట్టినది = సజ్జః ఆయితము (సంసిద్ధము; ఆయత్తము)

సమకోలు = మేకోలు. ఒడఁబాటు (సమ్మతి)

సమయుట = చావు (మరణము)

సమర్త = స్త్రీలమొదటిఋతువు (ప్రథమార్తవము)

సమసకము = అచ్చతెలుఁగుపదములసమాసము (సమాసము: సమాసకము)

సమసీసము = ముప్పదిరెండువిన్నాణములలో ఒకటి (మల్లబంధవిశేషము)

సమసెను = పోయెను; చచ్చెను

సవరపుమెకము = చామరాకుల నుపయోగించుతోఁక వెండ్రుకలు గలమృగము; జల్లిమెకము (చమరి)

సవసవ = కొద్దిగా వినుట; చూచాయగా వినుట

సవి = అని (ఇత్యర్థకము)

ససి = పైరు (సస్యము)

సనువు = మంచివాఁడు (సజ్జనుఁడు)

## సా

సాఁబాలు = సవము; సగము

సాకము = ఒకయుత్సవము (ఉత్సవవిశేషము)

సాకము = వ్యాజము, ఉత్సవవిశేషము

సాకి = సాక్షి; ప్రత్యక్షద్రష్ట

సాకిరి = సాక్షి

సాకెను = మనిచెను; కాపాడెను

సాగెను = తరలెను; వెడలెను, అరిగెను

సాజము = ఓజ (స్వభావము; సహజము)

సాటి = ఈడు (సదృశము)

సాటువ = సాటి

సాదన = శస్త్రవిద్య; ఆయుధవిద్య

సాదనకాఁడు = మానసటీఁగు; ఆయుధవిద్యయందు ఆరితేఱినవాఁడు (శస్త్రదక్షుఁడు)

సాదువు = మంచివాఁడు (సజ్జనుఁడు)

| | |
|---|---|
| సానకత్తి | = బొంకకోల, మోఘలశస్త్రవిద్యాభ్యాసమున కగు ఆయుధము (సాధనాయుధము) |
| సానలవాఁడు | = పూసలవాఁడు; రత్నములను సాన పట్టువాఁడు |
| సానికలు | = వెలిపాటితట్టలు; ఒకవిధమైనవెడల్పు పళ్లెములు |
| సామి | = ఇల్లువదలి (కుమారస్వామి; గుహుఁడు) |
| సామి | = దొర (రాజు) |
| సామి | = రాజ్యాంగములోనిరాజు |
| సామితల్లి | = అమ్మిక (పార్వతి; అంబిక) |
| సాము | = సవము సగము |
| సాము | = మల్లురు చేయువ్యాయామము (మల్లవిద్య, గరడి) |
| సాంబ్రాణి | = సాంబ్రాణి, సంబరేనుచెట్టునుండి కలిగిన యొకధూపద్రవ్యవిశేషము |
| సారా | = కైపు; ఒకదినుసుకల్లు |
| సారాయి | = సారా |
| సారి | = యుద్ధమునకగుప్రయాణము (సమరయాత్ర) |
| సారు [లు] | = ఒకవిధమైననాట్యగమనము [లు] (నాట్యగతివిశేషము) |
| సారె | = మెట్టు: వీణమెట్టు; సరకట్టు(సోపానము[లు]) |
| సారె | = సొగటాలపావిక; నిడుపైనసారె (శారి) |
| సారె | = మరల (పునరర్థకము) |

సాదెసత్తులు = జంతికలు; ఒకవిధ మగుమణుగుబూలు (యంత్రికలు)

సాలీడు = ఒకజాతి సాలెవాడు (తంతువాయభేదము)

సాలువ = సెల్లా; అంచు లేనివస్త్రము (శాటిక)

సాలె = తంతువాయభేదము [ఒకజాతి నేతవాడు]

సాలెవాడు = ఒకజాతి నేతవాడు (తంతువాయభేదము)

సాళ్వము = ఒకజాతిడేగ (శ్యేనభేదము)

సావ = మల్ల [ఒకవిధమగుమూకుడు] మట్టికంచము (శరావవిశేషము)

సావాలు = సాగాలు (సమభాగము; సమాంశము)

సావి = తలి (స్థాలము)

సావి = సవి; అవి (  ర్థకము)

## సి

సింగము = బొబ్బమెకము (సింహము; కరిరిపువు)

సింగము = [ఉత్తరపదమై పూర్వపదార్థముయొక్క శ్రేష్ఠతను చెప్పును ఉదా :- రాచసింగము-

సింగాణి = కొమ్ముతో చేసినధనుస్సు (శృంగధనువు)

సింగారపుతోట = అంతఃపుర స్త్రీలు మాత్రము విహరించుతోట (ప్రమదవనము)

సిరపము = సేనము; కొయ్య నటుకుచిన్నఉలి
సిరసు = నెత్తి (శిరస్సు)
సిరాజి = పగరము (ప్రవాళము)
సిరి = లచ్చి (లక్ష్మి; శ్రీ)
సిరి = [అణిమాదిక మగు] ఐశ్వర్యము (భూతి)
సిరి = ఛాయ (కాంతి)
సిరి = కలిమి (సంపద)
సిలుగు = కీడు (అశుభము)
సిలుగు = చేటు (ఆపద)
సివము = దేవతావేషము
సీకాయ = సికఫలము
సీకాయచెట్టు = సిగ (సిక)
సీతు = చల్లన; చల్లదనము, చల్లనిది (శీతము)
సీదరపుఁబెద్ద = పాఁపఱేఁడు (శేషుఁడు; ఆదిశేషుఁడు)
సీమ = కోటచే ఒప్పుభూమి (రాజధాని; దుర్గాఢ్యభూమి)
సీసకము = బొమిడికము; ఇనుపటోపి (శిరస్త్రము)

# సు

సుంకము = దానము [మార్గమున నియమితస్థలములందు చెల్లింపవలసినపన్ను] (శుల్కము)
సుంకరి = రాజునకు అమ్ము సరుకులపై ఈయవలసిన పన్ను తీసికొనెడిఅధికారి (శుల్కాధికారి)

సుంకు = కసువు [పొన్నకంకి మొదలగువానిమీఁది పూఁత] (సస్యకుసుమము)

సుండి = నిశ్చయము

సుఁడి = సుండి

సుకము = హాయి (సుఖము; సౌఖ్యము)

సుకిని = సుకీయ; పూర్ణపుబూరె (సుఖని)

సుగంధిపాల = దూసపాల (శారిబ; గోపిక)

సుగము = సుకము

సుగ్గడితము = గడితము [చిక... నైనసేఁత గలవస్త్రము]

సుడి = నీన్నసుడి (ఆవర్తము)

సుఁడి = వట్రువ [సుడి] (బుకారము)

సుడియుడిదము = పేఁపంచులయుడుఁగు (చక్రము)

సుడుము = కంప [ముండ్లకంప మొదలగువానిమోపు]

సుతి = తిత్తి (శ్రుతి)

సుతికాఁడు = సుతి వేయువాఁడు (శ్రుతివిధాయి)

సుత్తి = చిన్నసుత్తె (అల్పశంబళి)

సుద్ది = ప్రశస్తమైనమట్టి (శుద్ధమృత్తిక)

సుద్దము = జలాదులచే కడుగఁబడి స్వచ్ఛమైనది (శుద్ధము)

సుద్ది = వార్త: వృత్తాంతము

సున్న = అనుస్వారము: బిందువు

సున్నఁగాము = సున్నముంచుకొనెడిబరణి (మార్ణకరండము)

సున్ని = చిక్కనము; సున్నిపిండి

సున్ని = పొడి [ఏదేని ఒకవస్తువుయొక్క పొడుము] (చూర్ణము)

సుపాఱి = ఒకదినుసుముత్యము; శుద్ధమైననీరు గలముత్యము (మౌక్తికవిశేషము)

సుబ్బు = నానుడి; అంగడినోటను నానుడివాక్యము

సుమారకము = సుకము

సుమారము = మైమఱపు (మూర్ఛ)

సుమీ = సుండీ (నిశ్చయము)

సుమ్మీ = సుమీ

సురక్రోవి = పిరంగి; తుపాకి

సురటి = విసనకఱ్ఱ (వ్యజనము)

సురటి = ఒకవిధమగుపావురము (పారావతవిశేషము)

సురతాణిలగ్గ = నలుమూలలనుండి ముట్టడివేసి కోట నెక్కుట (ప్రాకారలంఘనము)

సురపొన్న = ఒకదినుసుపొన్న (సురపున్నాగము)

సురిగ = రెమ్మ; చిన్నకొమ్మ (ఉపశాఖ)

సురిగి = ఒకజాతిమల్లెతీగ (శిఖండి)

సురిగెను = వాడెను, వసలెను, వికాసము లేని దాయెను

సురియ = ఒకవిధమగుచిన్నకత్తి (ఛురిక)

సురియాడుపు = మాలఁడు; మాలవాఁడు (చండాలుఁడు)

సురుడు = దివ్వెనకోల: పెండ్లి సప్పుల్లలు లో నగువానిని కాల్చిపట్టుకొను నడిదీపము (కాష్ఠదీపిక)

సురుప్పు = పెట్టుప్పు; సురేకారము (సురక్షారము)

సురుము = నలుము; పొడి (చూర్ణము)

సురె = కటారి; చిన్నకత్తి; ఒకవిధమగుపెద్దగాడు (కరాళి)

సురి = సురియ

సుళ్ళు = వేగిరము (శీఘ్రము)

సువారంపువాడు = వంటపూటవాడు (పాచకుడు)

సువారంపువాడు = వంటలవాడు; వ్యంజనముల నొనర్చువాడు

సువారము = వంట (సూపకారము)

సువ్వాల = = సోల; ఒకవిధమైనపాట (గానవిశేషము)

## సూ

సూ = సుమ్మీ (నిశ్చయార్థకము)

సూటి = లక్ష్యమునకైనమార్గము (లక్ష్యవీథి)

సూడిగంబు = స్త్రీలు చేతులకు ధరించెడి ఒకవిధమైనసొమ్ము (హస్తభూషావిశేషము)

సూడిద = కానుక; ఉపాయనము

సూడు = పగ సాధించుట (ప్రతివైరము)

సూడు = కంటు; తీఱనివైరము (విద్వేషము; విరోధాతిశయము)

సూడుకాడు = పగవాడు (వైరి; విరోధి)

సూది = గుడ్డలవి కుట్టుటకు ఉపయోగపడు సాధనము (సూచి)

సూదిరాయి = మిఱుగుఱాయి; సూదంటుఱాయి (కశివశిల)

సూరెపుటంబు = ఒకవిధ మాగాణేలుజాతిపట్టుతో [మొకమాలుతో] నేసినవస్త్రము (సూర్యపటము)

సూరెలు = ఇరుపక్కలు; రెండుప్రక్కలు (ఉభయపార్శ్వములు)

సూనక = సీలు తలను ధరించునట్టి కేశాభరణము (వాలపాశ్యావిశేషము)

సూనరి = గారకాడు; గచ్చుపని చేయువాడు

# సె

సెగ = మఱుగుడు; అగ్నివలని వేడిమి (తాపము)

సెగ్గు = దూరు (అపవాదము; నింద)

సెగ్గెము = సెగ్గు

సెజ్జ = పాన్పు (శయ్య)

సెనగ = సెనగపైరు (చణకము)

సెవిగ = సెనగ

సెబాసు = మేల్ (ప్రశంసార్థము)

సెల = రెబ్బ; చిన్నకొమ్మ (ఉపశాఖ)

సెల = నది ఉప్పతించుప్రదేశము (అంబుజన్మదేశము)

సెలకట్టె = ఒకఆయుధము (శల్యము)

సెలగ = సెల (ఉపశాఖ)

సెలపంది = ఏదు; ముండ్లపంది (శల్యము)

సెలవు = ధాన్యము కొలిచెడివారు ఇచ్చుకొనెడి పన్ను (ధాన్యపరిమాతృభాగధేయము)

సెలయేరు = వాగు; కొండనుండి వచ్చెడియేఱు (అచలనది)

సెలవి = పెదవిమూల (సృక్కణి)

సెలవు = ముదల (ఆజ్ఞ)

సెల్లా = సాలువ; అంచు లేనివస్త్రము (శాటిక)

సేవ = పరిచర్య; శుశ్రూష

# సే

సేగి = చేటు (అశుభము)

సేగి = చెట్ట (ఆపద)

సేగింపు = సెగ్గెము

సేనము = సేవనము; చిన్నగొడలి (అల్పదారుచ్ఛేది)

సేబాసు = సెబాసు (ప్రశంసార్థము)

సేమము = మేల్ (క్షేమము)

సేల = పుట్టము (వస్త్రము)

సేలా = సెల్లా

సేష = పైని దొంతర పేర్చుటకు పై పైనపొంతి సంత (ఉత్పంక్తివిన్యాససౌభాగ్యభాంశము)

| | | |
|---|---|---|
| సేపెలు | = | [సేమ్యా (వ్య.)] (సేవికలు) |
| సేస | = | దోసిలితో పట్టిపవ్వూలు (పుష్పాంజలి) |

## సై

| | | |
|---|---|---|
| సైదము | = | గోదుమపిండి |
| సైపుడు | = | శాల్మి (సహనము; క్షాంతి) |
| సైకంబు | = | కొంచెము (అల్పము) |
| సైదోడు | = | తోబుట్టు (సోదరుడు; సహజుడు) |
| సైబు | = | వాయిదార: వంకలు గలకత్తి |
| సైయాట | = | సయ్యాట (పరిహాసాది; సహక్రీడ) |
| సైరణ | = | సైపుడు |

## సొ

| | | |
|---|---|---|
| సొంటి | = | వంది ఎండబెట్టిన-అల్లము (శుంఠి) |
| సొంపు | = | చెన్ను (కాంతి) |
| సొగటము | = | జూద మాడెడి [నిడు పైన] సారె |
| సొగసు | = | మురిపము (విలాసము) |
| సొగసుకాడు | = | నీటుకాడు; అలంకరించుకొనెడివాడు (అలంకారి) |
| సొగసెను | = | సురిగెను: వాడెను; వసలెను |
| సొట్ట | = | వంకర (వక్రము) |

సొద = ఏనుఁగును కాల్చుటకై పేర్చినకట్టెలు లోని నిప్పుప్రోగు (చితి; చిత)

సొన్నారి = కంసాలి, కమసాలి (స్వర్ణకారుఁడు)

సొబగు = చక్కఁదనము (సౌందర్యము)

సొబను = ఆఁడుకట్టుము ధరించుగర్భము (బహుభాగ్యము)

సొమ్మ = మైమఱపు; బాధచే స్మృతి తప్పి వర్తించుట (మూర్ఛ)

సొమ్మలువోయెను = మూర్ఛను జెందెను; మూర్ఛిల్లెను

సొమ్మసిలినవాఁడు = స్మృతి తప్పినవాఁడు (మూర్ఛితుఁడు)

సొమ్మసిలుట = సొమ్మ

సొమ్మసిలెను = సొమ్మలువోయెను

సొమ్ము = తొడవు (భూషణము)

సొర = సొద

సొరంగ = గుహాయట్లు తొలిచినరంధ్రము (బిలము)

సొరంగము = సొరంగ

సొరిగెను = సొగసెను; వాడెను

సొరిది = బారు; వరుస (పంక్తి)

సొరుఁగు = సొమ్మ (మూర్ఛ: రోగవిశేషము)

సొరుగు = సొమ్మ (మూర్ఛ)

సొర - అనుగము (అలాబువు)

సొలపు = సొరుగు (మూర్ఛారోగము)

సొలపు = సొరుగు; మైమఱపు

సొలిమిడి = సొంపు; మైమఱపు: బాధాదులచే స్మృతి తప్పి వర్తించుట

# సో

సోఁకు = బూతము (పిశాచము; భూతము)

సోఁకెను = ముట్టెను: తాఁకెను

సోఁపు = నల్లజీలకఱ (కృష్ణజీరకము)

సోదుముట్టెను = అంతట వ్యాపించెను

సోద = గార; ఇసుక చేర్చి దంచినసున్నము (సున్న విశేషము)

సోదె = ఒకవిధ మగుస్మృతి (స్మృతివిశేషము)

సోదెకత్తె = వేలుపుసాని; సోదె చెప్పెడిది (దైవజ్ఞ)

సోద్దెము = అబ్బురపాటు (ఆశ్చర్యము)

సోద్యము = సోద్దెము

సోన = చిన్నవాన (అల్పవర్షము)

సోప = శరీరము లావు ఎక్కించెడివాఁపురోగము (శోఫ)

సోబ = సోప

సోబె = సిబ్బెము; దేహమందలి యొకవిధమైనపొక్కు

సోమరి = మాలుగుఁబోతు; పాటుపడనివాఁడు; (ప్రాల్మాలినవాఁడు

సోమిదమ = సోమిదమ్మ; సోమయాజిభార్య (యజ్వపత్ని

సొమిసారి = సోమిదమి

సోమెటి = సోమగంధ, సోమలత

సోయగము = సొబగు (సౌందర్యము)

సోయగము = చాయ (కాంతి; ఛాయ)

సోరణగండి = కిటికీ (గవాక్షము)

సోల = తవ్వలోనిసగము (నికుంచము)

సోలు = సొరుగు; మైమఱవు (మూర్ఛ)

సోలెను = వాడి వ్రాలెను; బడలిక చెంది వివశుఁడై నేలకు ఒరగెను

## సౌ

సౌరము = ఒకవిధ మగువింజామర (చామరభేదము)

సౌరు = సోయగంబు; చక్కఁదనము

## స్ర

స్రగ్గెను = క్రుంగెను; అణఁగెను; తగ్గెను

## స్రు

స్రుక్కెను = స్రగ్గెను (క్షీణించెను)

హాయి = సుకము (సుఖము)

హాళి = జతనము (ఉత్సాహము)

హాళి = కేళి (పరిహాసము)

హావడి = ఆవడి; ఉపద్రవము;
[రాజ్యాక్రమణాదులవలని] పెద్దబాధ

## హు

హుటాహుటి = వేగిరము (శీఘ్రము; వేగము)

హుడుక = హుడుక్క; బుడుబుడుక్క
(వాద్యవిశేషము)

హుళిక్కి = బొంకు (అసత్యము)

## హె

హెచ్చరిలెను = పెరిగెను [వృద్ధిచెందెను]

హెచ్చు = మిక్కిలి (అధికము)

హెచ్చెను = హెచ్చరిలెను

## హే

హేమాహేమీలు = మిక్కిలిఅధికులు (పూజ్యార్థకము)

హేరవంకి = వింతవన్నెలు గలకోక; పలురంగులు
గలిగిన వస్త్రము

## హై

హైసరే = సత్యే; నిజము [నిజము అగును]) యాథార్థ్యము)

## హొ

హొంతకారులు = మల్లవిద్యయందు ఆరితేఱినగొప్పమల్లుని యొక్క పరివారము; బిరుదు వేసినజెట్టి పరివారము

హొన్ను = బంగారు; బంగారము (కాంచనము; సువర్ణము)

హొమ్మ = ఒమ్ము: బలుపు గలది )స్థూలము)

హొయలు = ఒయ్యారము (విలాసము)

హొయలుబండి = ఎద్దులబండి (శంబళీవాహ్యశకటము, గోశకటాంగము)

హొరపు = హొయలు

హొస = క్రొత్త (నవము; నూతనము)

## హో

హోరాహోరి = ఎడతెగకుండుట (అవిచ్ఛిన్నార్థము)

## హౌ

హౌసుకాడు = సుఖవంతుడు; భోగి



# అనుబంధము

[చేర్చుకొనవలసినవి]

అపరంటుట = కూలుట (మరణము)

అరకటి = పిరుదుల ప్రక్కప్రదేశము (నితంబపార్శ్వము)

ఆను = నూగారు: నాభిపై నుండు రోమపంక్తి (రోమరాజి)

కల్లు = మద్యము, సుర

గడ్డి = కసవు (తృణసామాన్యము)

గరుడి = గరుటాలమంటపము

నాదించెపు = విదిలిచెపు; సుమ్మొమొన లఘువానిని దులిపెను

తటి = తరి (కాలము)

తీటెను = చచ్చెను

దొండు = దొండ; పెద్దబొజ్జ గలవాడు

నెమిలి = నెమిలియడుగుమ్రాను

పట్టి = బిడ్డ (అపత్యము, సంతానము)

పట్టిలి = కమికిలి (పాణివిశేషము)

పసావది = ఆయుధవిద్యలలో విశేషము (శస్త్రవిద్యాభేదము)

పాము = చిలువ (సర్పము)

పాముది = పాపరి (అహితుండికుడు: విషారి)

| | | |
|---|---|---|
| పాయపోసు | = | ఒకదినుసుపాదరక్ష (పాదరక్షావిశేషము) |
| పూవు | = | పువ్వు |
| పెండేరము | = | పెండెయము; కాలినగ |
| బరికట్టె | = | పేద (దరిద్రుఁడు) |
| ముసలి | = | ముదుసలి (వృద్ధు) |
| మెఱుఁగు | = | చమురు: నెయ్యి మొద లగువానిజిడ్డు (స్నేహము) |
| మొరసునేల | = | మొరపనేల: గులకరాలభూమి |
| రెట్ట | = | పక్షులవిట్టము (పక్షి-మలము) |

---

సూచన :- పై వానిని అకారాదిక్రమమును తప్పకుండ అక్కడక్కడ చేర్చి చదువుకొనవలయు

2756

# అనుబంధము

[కొన్ని తెలుగు పదములు - పర్యాయ సంస్కృతపదములు]

అంకవన్నె (అశ్వపార్శ్వావలంబిరజ్జువు)

అంగిలి (వక్త్రాంతస్థానము)

అంచతేజి నెక్కునట్టిరాజు (హంసవాహనుడు)

అంచు = కమ్మి (అంశుకాగ్రావయవవిశేషము)

అచాటము = పెద్ద (పృథువు)

అటకలి = నలుగు-మె. (అభ్యంగస్నేహహారక ద్రవ్యము)

అడవిపాకరి = అడగాకర (కర్కోటకి)

అనుసు = (ఆందోళికాదిదండాగ్రసంధేయము)

అరణము = కన్యకు తండ్రి యిచ్చెడిధనము (పితృదత్తకన్యాధనము)

అరవీసము = రెండుకానులు (కాకణీద్వయము)

అఱపు పసువులకంఠధ్వని (పశుకంఠారవము)

అల్లెము = అల్లునితనము (జామాతృత)

అసిమి = (అల్పగోజీవిశేషము)

ఆణి = ఒకజాతిముత్యము (మౌక్తికవిశేషము)

ఆఱె = (దద్రువు)

ఆసు = (తంత్వావర్జనము)

ఇంచువింటివాడు = (ఇక్షుధన్వుడు)

ఈనిక = (పశ్వాదిప్రసవము)

ఉక్క = (ఊష్మము)

ఉత్తండము = (సర్పవిశేషము)

ఊగుపు = (పాషాణవిశేషము)

ఎడబెట్టు = ఒకవిధ మగుబంగారునాణెము (దీనారభేదము)

ఏడుపు = (ఆర్తకంఠరవము)

ఓమము = (దీప్యము)

కేక = నెమిలికూఁత (కేక)

కొండె = (కేశబంధవిశేషము)

చంగుల్లు = చేసుల్లు (అష్టాన్నతండులములు)

సిరవము = కొయ్య నఱకుచిన్నయులి; సేనము = (అల్పదారుచ్ఛేది)

---

సూచన :- (      ) - ఇట్టిగుఱుతులలో ఉన్నవి సంస్కృతపదవ లని తెలియవలయును.

# ఉన్నది – ఉండవలసినది

| ఉన్నది | ఉండవలసినది | పుట | పంక్తి |
|---|---|---|---|
| (నికటము) | : నికటము | 2 | 6 |
| (భయము) | ; భయము | 2 | 10 |
| ; వేడెను | [ వేడెను] | 7 | 15 |
| ; కుక రాల్చినపక్షి | [ కుకరాల్చినపక్షి] | 8 | 19 |
| ; అపెలెను | [అపలెను] | 9 | 18 |
| అనాథ: భర్త లేనిది (విధవ) | భర్త లేనిది(విధవ, అనాథ) | 10 | 7 |
| ఎల్లప్పుడు | సతము; ఎల్లప్పుడు | 11 | 6 |
| (గృహీత మయ్యెను) | [గృహీత మయ్యెను] | 11 | 16 |
| , ఓడిపోయెను | : ఓడిపోయెను | 12 | 5 |
| (అజీర్తి) | : అజీర్తి | 14 | 8 |
| (అధృతి) | ; అధృతి | 16 | 17 |
| (భుక్తి) | : భుక్తి | 20 | 16 |
| (ఆనక) | (ఆనకము) | 29 | 22 |
| (మొదట తెలియుక్త్థమున 'అటు' | [ మొదట తెలియుక్థమున 'అటు' | 20 | 23, 24 |
| ప్రస్థ | ప్రస్థ | 21 | 17 |
| ; కోరిక | [కోరిక] | 22 | 18 |
| ; చల్లనిది | , చల్లనిది | 23 | 19 |
| వాకిటి | వాకిటి | 24 | 14 |
| ఇనతల | ఇవతల | 23 | 15 |
| ఉన్పొంగెను | ఉప్పొంగెను | 32 | 17 |
| ఆలవణము | అలవణము | 33 | 2 |
| (మత్స్యము) | (పుష్ప-మత్స్యము) | 33 | 10 |

| ఉన్నది | ఉండవలసినది | పుట | పంక్తి |
|---|---|---|---|
| వంచుటకు | నీళ్లవి వంచుటకు | 103 | 12 |
| ారామ్యు) | రామ్ము | .0 | 18 |
| మ్లించి | మళ్లించి | 115 | 5 |
| గోశ | గోళ | 115 | 18 |
| కోకిలోంగావు | కోకిలాకము | 124 | 18 |
| గొను కట | గొఱుకట | 125 | 3 |
| చందుర | చందురు | 130 | 17 |
| విలువు | నిలువు | 133 | 17 |
| చిందోశు | చింబోతు | 137 | 19 |
| చిడిమిడి | చిడిముడి | 139 | 10 |
| కుమము | కుసుమము | 139 | 22 |
| సగాన | నూనె | 140 | 20 |
| పిన్న పాలు | పిన్న పాల | 141 | 14 |
| [పూలమొక్క] | [పూల] మొక్క | 142 | 4,5 |
| చెక్కెమ | చెక్కెను | 148 | 21 |
| తెల్ల | తెట్టు | 150 | 4 |
| చెవ్వులు | చెవులు | 153 | 17 |
| వస్తి : | (వస్తి ; | 153 | 16 |
| చేకూపెను | చేకడెను | 153 | 20 |
| చేసప | చేసవ | 15, | 24 |
| ా కీవము | ా ివము | 156 | 11 |
| స్లతి | స్లై | 158 | 3 |
| అ ర్యము | అధైర్యము | 159 | 19 |
| జల | జల | 1'1 | 9 |

| ఉన్నది | ఉండవలసినది | పుట | పంక్తి |
|---|---|---|---|
| అన | అస | 161 | 17 |
| గంధపు | గందపు | 168 | 19 |
| జీసు | జీపు | 165 | 22 |
| పర్ష | వర్ష | 166 | 7 |
| జొబ్బిలెమ | జొబ్బిలెను | 169 | 4 |
| టకుటంక | టకటంకు | 170 | 17 |
| టెక్కెంబు | టెక్కెంబు | 171 | 10 |
| సాఁగగొట్టు | సాఁగఁగొట్టు | 173 | 17 |
| డుబుడుక్క | డుబుడక్క | 175 | 3 |
| లోవి | లోని | 175 | 12 |
| నౌకజాతి | నౌకజాతి | 177 | 5 |
| తపవెను | తపసెను | 179 | 14 |
| పురుషాం | పురుషాం | 182 | 11 |
| (కవ్వపుఁగొండ) | [కవ్వపుఁగొండ] | 182 | 23 |
| తెప్పక | తప్ప | 183 | 6 |
| తలాకము | తలాటము | 184 | 22 |
| తాడి | తాఁడి | 185 | 8 |
| తాళీపుటి | తాళపుటి | 187 | 20 |
| తలము. | తలము: | 188 | 5 |
| ఉన్మాది | (ఉన్మాది) | 188 | 13 |
| వాకిటి | వాకిట | 189 | 6 |
| ఒకటి | ఒకటి] | 189 | 21 |
| తిరువు | తిప్పుప | 192 | 8 |
| ఆశకము) | (ఆశకము) | 194 | 23 |

| ఉన్నది | ఉండవలసినది | పుట | పంక్తి |
|---|---|---|---|
| లా వ్త్రైన | లా వైన | 195 | 8 |
| పాద్దిగ | ప్రాద్దిశ | 95 | 5 |
| బయు ఘ; | యు:లు, | 197 | 14 |
| (అభి..ుడు | (అభిజ్ఞుడు) | 193 | 6 |
| ధనుదారి | ధనుర్ధారి | 193 | 24 |
| గాబు) | గాబు | 200 | 17 |
| కొన | కొనను | 201 | 20 |
| విబుడగ | వి-ఋగ | 201 | 25 |
| ప్రాద్దిశ | ప్రాద్దిశ | 202 | 17 |
| జేసెను) | జేసెను] | 204 | 22 |
| తోస్త్రాము | తోస్త్రానము | 204 | 24 |
| నిశటము] | నిశటము) | 209 | 11 |
| డాక | దాక | 211 | 12 |
| పేగడిక | తెగడిక | 214 | 4 |
| దువ్యోన | దివ్యోన | 216 | 3 |
| (వరా ...భాగము) | [వరా . భాగము] | 215 | 13 |
| దుగ్గాసులు | దుర్గ్గాసులు | 215 | 17 |
| (రెండు...నాణెము) | [రెండు...నాణెము] | 215 | 17,18 |
| (హంసావళి) | [హంసావళి] | 216 | 15 |
| పిపాస | పిపాస | 217 | 20 |
| (అడ్డము. దూలము) | [అడ్డము...దూలము] | 218 | 9 |
| (దావరడంగి) | [దావడంగి] | 219 | 2 |
| అంజలి | అంజలి | 222 | 12 |
| ప్రాల్మాలిన | ప్రాల్మాలిన | 223 | 4 |

| ఉన్నది | ఉండవలసినది | పుట | పంక్తి |
|---|---|---|---|
| రవ | రవళి | 360 | 5 |
| రవుటు | రావుటు | 362 | 21 |
| రెంబ | రెంట | 364 | 7 |
| అరవముఁ | ఆరవముఁ | 366 | 14 |
| నిథ | నిధి | 374 | 6 |
| లెస్స | లెస్స | 375 | 9 |
| వలస | వడవ | 384 | 14 |
| దవ, | దవ; | 387 | 3 |
| వాయువు, | వాయువు: | 387 | 19 |
| వా, | వా; | 387 | 20 |
| నాయి | వాయి | 388 | 2 |
| దోదుమ్మి, | దోదుమ్మి: | 388 | 2 |
| కుదువ, | కుదువ | 388 | 4 |
| వింటివాగు | వింటివాఁడు | 390 | 3 |
| విరిసెను, | విరిసెను; | 390 | 13 |
| పిత్తనము | విక్తనము | 391 | 12 |
| భూతి, | భూతి; | 392 | 5 |
| సద్దసేయనది | సద్దసేయనిది | 403 | 15 |
| ప్రసేన | ప్రసేవ | 415 | 20 |

సూచన :- కండచుక్క - ఇది 'కండె'కు ముందుండవలయును

పల్ల — (287 పు. 12 పదముగా ఉన్నది. పల్లము'గా ఉండవలయును. 'పల్లిక'కు ముందు చేరవలయును.

# ఇతర గ్రంథములు

| | |
|---|---|
| అచ్చతెలుఁగుకోశము (ఆంధ్రభాషార్ణవమునకు వ్యాఖ్యాన రూపమున వెలసిన మహానిఘంటువు (మూఁడుభాగములు) | 150.00 |
| మధురావిజయము ( తెలుఁగు వ్యాఖ్యతో అనువాదముతో) | 30.00 |
| మధురావిజయము (సంస్కృతవ్యాఖ్యతో ఆంగ్ల పీఠికతో దేవనాగరిలిపితో) | 30.00 |
| మధురావిజయము (వచనకావ్యము, శిథిల (కథా) పూరణముతో) | 5.00 |
| గంగాదేవి (సాహితీచరిత్రల సమ్మేలనాత్మక మగునొకనవల) | 20.00 |
| సుభద్రాధనంజయము (నాటకము-ఆళ్వారులకృతికి తెలుఁగు) | 5.00 |
| తపతీసంవరణము (నాటకము-ఆళ్వారులకృతికి తెలుఁగు) | 5.50 |
| మధ్యమవ్యాయోగము (భాసకృతికి తెలుఁగు) | 3.00 |
| త్యాగవీరుఁడు (కరుణరసప్రధాన మగునాటకము) | 3.00 |
| మధురకవులు ( వేమనాదుల సాహితీజీవితచరిత్రల సంగ్రహము) | 3.00 |
| శ్రీశైలస్థలపురాణము (స్కాందములోని శ్రీశైలఖండము నకు అనువాదము. సర్వస్వామ్యములు శ్రీశైలదేవస్థానమువారివి) | |
| [కావ్యకలానిధి, శతావధాని పిసుపాటి చిదంబరశాస్త్రిగారి] జీవితచరిత్ర - అవధానసాహిత్యము | 25.00 |

## త్వరలో వెలువడనున్నవి

| | |
|---|---|
| వాఙ్మయవ్యాసములు (రెండుభాగములు) | 30-00 |
| ఆకాశవాణీప్రసంగములు | 10-00 |
| ఉభయరామలింగేశ్వర స్థలపురాణము | 10-00 |
| శివలీలాతరంగిణి | 15-00 |
| ఉత్తరహరివంశము (పదార్థదీపికావ్యాఖ్యతో) | 80-00 |
| మహాభారతము (యథాతథ మగుసంస్కృత భారతకథతోడి వచన కావ్యము) | 10-00 |

## రచనలో ఉన్నవి

శృంగారశ్రీనివాసము (పద్యకావ్యము)

మధుకణములు (పద్యసంపుటి)

మహాకవిశరణ్యము (లక్షణగ్రంథము)

అధ్వాణకారికలు - అహోబలపతి

నన్నయయడుగుజాడలలోని తిక్కన (పరిశోధనాత్మకమహాగ్రంథము)

(శ్రీనాథుని) కాశీఖండము (కూలంకషవ్యాఖ్యతో)

వాక్యపదీయము (సంస్కృతాంధ్రవ్యాఖ్యలతో)



